శ్రీ

నమోనారాయణ
సరస్వత్యై నమః



# భగవద్గీత

( తెనుగు గీత = కృష్ణ చరిత్ర కలది )

వ్యాసమహర్షి







చర్ల గణపతి శాస్త్రి

# ఉపక్రమణిక.

అగ్నినుండి విడినట్లు గనఁబడి వేఱుగాఁ దోఁచు నగ్ని కణములు అగ్నికంటె వేఱుగానట్లు పరమేశ్వరునుండి విడివడి నట్లు దోఁచు జీవులు పరమేశ్వరునికంటె భిన్నులు గారు. భ్రాంతివల్ల దుఃఖించు జీవుల భ్రాంతిని బోఁగొట్టి అవ్యయము అద్వైతము ఆనందము నగు పరబ్రహ్మముతో నైక్యమొందించుటకె భగవద్గీతాది గ్రంథములు మహర్షులచే వ్యక్తపరుపఁబడినవి.

పరమేశ్వరునుండి యాకాసము. ఆకాశమునుండి వాయువు యాయువునుండి తేజస్సు, తేజస్సునుండి జలము, జలము నుండి భూమి, భూమినుండి యోషధులు. ఓషధులనుండి యన్నము. అన్నమునుండి జీవులు వెడలుట సృష్టిక్రమము.

మరల జీవులు అన్నమై. అన్నమునుండి యోషధులై ఓషధులనుండి భూమియై. భూమినుండి జలమై. జలమునుండి తేతస్సయి, తేజస్సునుండి వాయువై. వాయువునుండి యాకాశమై, ఆకాశమునుండి వరమేశ్వరుని రూపమై యందు లయమందుట ప్రళయక్రమము.

ఇంక జీవులు స్వస్వకర్మలనుబట్టి యాయా లోకము పొందుదురని శ్రుతులనుబట్టి తెలియుచున్నది.

1. "బ్రహ్మజ్ఞానులు పరబ్రహ్మమును గాంచినవారు గాన వారేలోకములకుఁ బోనక్కరలేకుండఁగనే యంతట నిండియుం

ప్రతులకు

చల్లా గణపతి శాస్త్రి
5, కిల్లంపూడి క్వార్టర్సు,
వాల్తేరు - 3

ముద్రణ :
లలితా ఆర్టు ప్రెస్సు,
టౌనుహాలు రోడ్డు,
విశాఖపట్నం - 1

# ఉపక్రమణిక.

అగ్నినుండి విడినట్లు గనఁబడి వేఱుగాఁ దోఁచు నగ్ని కణములు అగ్నికంటె వేఱుగానట్లు పరమేశ్వరునుండి విడివడి నట్లు దోఁచు జీవులు పరమేశ్వరునికంటె భిన్నులు గారు. భ్రాంతివల్ల దుఃఖించు జీవుల భ్రాంతిని బోఁగొట్టి అవ్యయము అద్వైతము ఆనందము నగు పరబ్రహ్మముతో నైక్యమొం దించుటకై భగవద్గీతాది గ్రంథములు మహర్షులచే వ్యక్త పరుపఁబడినవి.

పరమేశ్వరునుండి యాకాసము. ఆకాశమునుండి వాయువు వాయువునుండి తేజస్సు, తేజస్సునుండి జలము, జలము నుండి భూమి, భూమినుండి యోషధులు. ఓషధులనుండి యన్నము. అన్నమునుండి జీవులు వెడలుట సృష్టిక్రమము.

మరల జీవులు అన్నమై. అన్నమునుండి యోషధులై ఓషధులనుండి భూమియై. భూమినుండి జలమై. జలమునుండి తేతస్సయి, తేజస్సునుండి వాయువై. వాయువునుండి యాకా శమై, ఆకాశమునుండి వరమేశ్వరుని రూపమై యందు లయ మందుట ప్రళయక్రమము.

ఇంక జీవులు స్వస్వకర్మలనుబట్టి యాయా లోకము పొందుదురని శ్రుతులనుబట్టి తెలియుచున్నది.

1. "బ్రహ్మజ్ఞానులు పరబ్రహ్మమును గాంచినవారు గాన వారేలోకములకుఁ బోనక్కరలేకుండఁగనే యంతట నిండియుం

డిన భగవంతునిఁ బొంది వ్యాధి జరా మర జన్మ రహితమైన శాశ్వతానంద పదమును బొందుదురు.

2. యజ్ఞములు జ్ఞానముతోఁ జేసినవారు అర్చిరాది దేవయానమునఁ గ్రమక్రమముగ బ్రహ్మలోకమును బొందుదురు. శ్రుతిస్మృత్యుక్త యజ్ఞములును, పూర్తములు దత్తములనఁబడు ద్రవ్యయజ్ఞములును, చాంద్రాయణాది తపోయజ్ఞములును ప్రాణాయామాదులగు యోగయజ్ఞములును మోక్షశాస్త్రాధ్యయన రూప స్వాధ్యాయ యజ్ఞములును, అంతఃకరణశుద్ధిరూప జ్ఞానయజ్ఞములు మొదలగునవియు యజ్ఞపద వాచ్యములు. వాపీ కూప తటాక దేవాలయాన్నదానాది కర్మలు పూర్తములనఁబడును. శరణాగతరక్షణ ప్రాణ్యహింసా ప్రాణిసేవాదులు దత్తములందురు.

3. మంచకేల కర్మపరులు ధూమాది పితృయాణ మార్గమున చంద్రలోకము పొంది యక్కడఁ బుణ్యము క్షీణింపఁగాఁ దిరిగి యాకాశాదిరూపముగ భూలోకముఁ జేరి వారివారి శుభకర్మలను బట్టి ఉత్తమ మధ్య మాధమ జన్మలను పొందుదురు,

4. ధనపుత్రాది వ్యామోహము గలిగి శుభకర్మలు చేయనివారు భూలోక నరకలోకములకుఁ బ్రయాణము చేయుచుఁజావు పుట్టుకలను సర్వవిధ కష్టములను బొందుదురు.

5. యజ్ఞాదులగు నేవిధమైన శుభకర్మలుచేయక తామసులైయుండువారు అజ్ఞానాంధకార భూయిష్టమగు పశుపక్షి కీటకాది జన్మలను బొందుదురు."

ఇత్యాదికముగ సృష్టి ప్రళయాదులను గూర్చియు, జీవుల శుభాశుభములఁబట్టి కలుగు లోకములఁగూర్చియు శాస్త్రములు చెప్పుచున్నవి.

ఇంకజీవులు చనిపోయినపిదప వారి యింద్రియ వ్యాపారములు మనస్సునను. మనస్సు ప్రాణమునను లయ మొందఁగా పిదప నాజీవులు సూక్ష్మ భూతములతోఁ గూడి ఆ నర రూపమున ఆయాబీజములలో పడి జీవులయి స్వస్వ కర్మ వశమున ఆయాలోకములకుఁ బోదురు.

ఇట్లు అనేక గతులను బొందు జీవులు అశాశ్వతములగు స్వర్గాదిలోకాంతరములను, దుఃఖభూయిష్ఠము లగు జన్మలను బొంది కష్టపరంపరలంబడి మునిఁగి పోకుండ రక్షించుటకై తనకంటె భిన్నులు గాని సర్వప్రాణుల సేవకై వారి జన్మల లోని దుఃఖములఁ బోగొట్టుటకై శాశ్వతానంద ప్రాప్తికై భగవంతుఁడె వ్యాసమహర్షిద్వారా ఆత్మజ్ఞానమును బోధించుచు ఆ జ్ఞానమునకు సోపానములగు సాంఖ్య కర్మాది యోగములను, సాత్త్విక యజ్ఞాదులను గీతాముఖమున నుపదేశించెను. అట్టి భగవద్గీత యుపదేశముల మనోవాక్కాయ కర్మలచే ఆచరించుచు ధనపుత్రాది వ్యామోహముక్తులై పరులను భగవంతునివలెఁ జూచి సేవించుచు శుభకర్ములై ధర్మపరులై జ్ఞానులై జనులు శాశ్వతానంద స్వరూపు లగుదురుగాక !

చర్ల గణపతిశాస్త్రి

# సమన్వయము

జీవిపుట్టిన తరువాత తన తల్లిదండ్రుల అలవాటులను చుట్టుపట్ల గల సంగతులను తెలిసికొనుచు వానిని అనుకరించును. తనపూర్వుల పెద్దల భావములే మతము లనుపేరుతో పెలసినవి. తనకు తన బంధువులకు గల సంబంధమును, తన్నును లోకములను నడపుశక్తిని గూర్చి ఆలోచించి తెలిసికొనును. వేఱు వేఱు ప్రదేశములలో వేర్వేరుకాలములలో పెలసిన భావములు – తలచిన ఉత్తమభావములు మతములైనవి అన్నిటికి, ప్రేమపరోపకారము, దయ, శుభ్రత, ఇంద్రియములను నియమించుట. సత్యము అహింస ముఖ్యములు, పైపై వేషభాషలు ఆచారములు వేరైనను లోపలి భావములు ధర్మములును తమవలె ఇతరులనుజూచి సాయపడుటయు మొదలైనవిఅన్నియు ఒకటే. ప్రపంచమును సృజించిన పరమాత్మను తెలిసికొని వాని యనుగ్రహము పొందుట అందరకు అదర్శము,

ఆ పరమాత్మనే నారాయణుడని, ఒహోవాయని, అల్లాయని జోరాష్ట్రరు అని ఈమొదలగు అనేక నామములతో పిలచుచున్నాము. నదులన్నియు సముద్రములో గలియునట్లు జనులు మతములు ఒకే భగవంతునిలోఁ గలియును. ఒకరు ఇంకొక మతము లోనికి వెళ్లనక్కర లేదు. తన మతమును విడువనక్కరలేదు, మతములు వేఱుగా నున్నను పరమాత్మ యగు దేవుడు ఒక్కడే. అతఁడు చేసినవే ఈ సూర్యచంద్రులు భూమ్యాకాశములు. అతని నియతివల్లనే సకల ప్రపంచము నడచు చున్నది. కనుక ఏ మతములోని వారికైనను దేవుడొకఁడే గనుక తమతమ మతధర్మముల ద్వారా దేవుని పొందుట శ్రేష్టము కనుకనే "శ్రేయాన్స్వధర్మః" అని గీత చెప్పుచున్నది.

చర్ల గణపతిశాస్త్రి

# భగవద్గీత

## ( శ్రీకృష్ణుని జీవితము )

పూర్వము శూరసేనుఁడను రాజు మధురా పట్టణమును రాజధానిగాఁ జేసికొని శూరసేనములనెడి దేశములను పాలించుచుండెను. ఆ శూరసేనునకు వసుదేవుఁడను కుమారుఁడు గలఁడు. ఆ వసుదేవుఁడు ఉగ్రసేనునికిఁ గుమార్తె యయిన దేవకిని వివాహమాడెను. ఆ దేవకికిఁ గంసుఁడను పేరు గల యన్న గలఁడు. అతఁడు బలవంతుఁడు, బహు క్రూరుఁడు, అతఁడు తన చెల్లెలు దేవకిని సారె కానుకలతో అత్తవారింటికిఁ బంపుటకై తన చెల్లెలిని బావయగు వసుదేవుని రథముపైఁ గూర్చుండఁబెట్టుకొని స్వయముగా గుఱ్ఱముల పగ్గములు చేతఁ బట్టుకొని రథమును నడుపుచుఁ బోవుచుండెను. మార్గమధ్యమునందు 'ఓరీ మూర్ఖుఁడా! నీవు ప్రేమతోఁ జెల్లెలిని సాగనంపుచు రథమును దోలుచుంటివే గాని యీామె యెనిమిదవ గర్భము నిన్నుఁ జంపును జుమీ ధర్మముగా నుండుము అని యొక య శరీరవాణి వినఁబడెను. అది విని పాపిష్ఠుయైన యా కంసుఁడు ఉలిక్కిపడి వెంటనే కత్తిపైకిఁదీసి దేవకి కొప్పు పట్టుకొని చంపఁ బూనుకొనెను.

అప్పుడు మెల్లన వసుదేవుఁడు తన బావముఱఁది చేయి పట్టుకొని శాంత వాక్యములతోఁ జల్లఁబఱచుచు నిట్లనియెను. "నీవు అన్నవు. ఈమె నీ గారాబు చెల్లెలు. ఏదో ఆకాశమున ఏవో నమ్మరాని మాటలు వినఁబడినంత మాత్రమునఁ జెల్లెలిని జంపుట న్యాయమా? ఎప్పటికైనను మనము చనిపోవువారమె.

అందుకని చెల్లెలిని జంపి శాశ్వతముగాఁ జెడ్డపేరు తెచ్చు కొందువా. కర్మను తప్పించుకొన నెవరి వశము. అందును ఈ నీ చెల్లెలు ఉత్తమురాలు. నీ యుగ్రరూపము చూచి యెట్లు వణఁకుచున్నదో చూడుము. పెండ్లిలోఁ గట్టిన యీ పసుపుఁ బట్టలు ఇంకను విడువనైనలేదు. ఇట్టి నీ చెల్లెలిని జంపుట న్యాయము గాదు" అని.

ఇట్లు వసుదేవుఁ డెంత ప్రతిమాలినను ఆ క్రూరుఁడు మానక చంపఁదలఁచుట చూచి గతిలేక వసుదేవుఁడు "ఈమె యెనిమిదవ గర్భము నిన్నుఁ జంపునని గదా యశరీరవాణి పలికెను. ఈమెకుఁ బుట్టిన కొడుకులను జంపుటకై నీకప్ప గింతును. ఈమెను వదులుము" అని పలుక విని సరెయని తల వంకించి యా కంసుఁడు చెల్లెలిని చంపక విడిచెను. అప్పుడు వసుదేవుఁడు దేవకితోఁ దన గృహమునకుఁ బోయి సుఖముగా నుండెను.

కొంత కాలమునకు దేవకికి ఒక కుమారుఁడు గలిగెను. అపుడు వసుదేవుఁడు కంసునికి ఇచ్చిన మాట ప్రకారము ఆ కుమారుని దీసికొనివచ్చి కంసునికి అప్పగించెను. తన బావ వసుదేవుఁడు తాను ఇచ్చిన మాట ప్రకారము కన్న కొడుకును అప్పగించుట చూచి సంతోషముతో "నాకు ఎనిమిదవ గర్భము వల్లఁ జావు గలుగునని గదా యశరీరవాణి పలికెను. ఓనివల్ల నాకు భయము లేదు. ఆ యెనిమిదవ వానినే చంపెదను? ఈ కొమారుని దీసికొని పొమ్ము" అని చెప్పి యా కుమారుని వసు దేవుని కప్పగించెను. వసుదేవుఁడు ఆ కుమారుని సంతోష

ముతోఁ దన యింటికిఁ దీసికొని వచ్చెను. కాని కంసునికి ఎప్పు డేబుద్ధి పుట్టి చంపునో యని దేవకీ వసుదేవులును అక్కడి యాదవులును దలఁచి భయముతోనే యుండిరి.

"శత్రు మిత్రులను సమానముగఁ జూచుచు ఎల్లపుడు సత్యమునె పలుకుచు వారి వారి నిజస్థితులను వారి ముందరనె దెలిపి వారిని సన్మార్గమున నడిపి భగవద్భక్తులనుగాఁ జేయుచు భగవంతుడొక్కఁడే మనకు శరణము. అతనినె భజింపుడు అని నిర్భయముగఁ దెలుపు భాగవతోత్తముఁడైన నారదుఁడొక నాఁడు కంసుని దగ్గఱకు వచ్చెను. వచ్చి "గొల్లపల్లెలోని నందుఁడు మొదలైన గొల్లవారును వసుదేవుఁడు మొదలైన వృష్ణులును దేవకి మొదలైన యాదవ కాంతలును దేవతలె. ఓకంసా! నీ జ్ఞాతులును బంధువులును స్నేహితులును దేవతలె, భూమికి బరువైన దైత్యులను జంపుటకే యీ ప్రయత్నము. కాన నీవు జాగరూకతతో, సన్మార్గమున నుండుము" అని నారదుఁడు కంసుని యోగక్షేమమునకై చెప్పిపోయెను. అప్పుడా కంసుఁడా మాటలు వినియు సద్బుద్ధి లేనివాఁడయి యాదవులు దేవతలనియు దేవకి గర్భమున విష్ణువు తన్నుఁ జంపఁబుట్టుననియుఁ దలపోసి దేవకీ వసుదేవాదులను రోహిణిని జైలులో బంధించి దేవకి కన్నకొడుకు లందఱను జంపసాగెను. పిదపఁ దనకు బుద్ధిచెప్ప వచ్చిన తల్లిదండ్రులను సోదరులను బంధువులను బంధించి మహాబలుఁడును క్రూరుఁడునగు కంసుఁడు శూరసేన దేశములను గూడఁ దానే పాలింపఁదొడఁగెను. పిదప ప్రలంబ చాణూరాది రాక్షసుల తోడను, బాణ నరక జరా సంధాది భూపతుల తోడను గూడి కంసుఁడు యాదవులను బాధింపఁ దొడఁగెను. యాదవులు కంసుని బాధలు పడలేక నిషధ కురు

కోసల విదర్భ కేకయ పాంచాల సాళ్వ దేశంబులకుఁ బోయిరి. కొందఱు కంసునే యాశ్రయించి యుండిరి. కంసుఁడు క్రమ క్రమముగ దేవకి కొడుకుల నారుగురను జంపెను. ఏడవసారి దేవకికి గర్భపాతమయ్యెను. ఆ కాలముననే వసుదేవుని భార్య యగు రోహిణికి బలరాముఁడను కుమారుడు గలిగెను. దేవకికి గర్భపాతమగుటయు రోహిణికిఁ గుమారుఁడు గలుగుటయుఁ జూచి దైవమాయ వలన నట్లు దేవకి గర్భమె సంక్రమించెనని లోకులు చెప్పుకొనసాగిరి. అందుచే నా బాలుఁడు సంకర్షణుఁ డని పిలువఁబడెను.

పిదపఁ గొంత కాలమునకు దేవకికి ఎనిమిదవసారి గర్భము నిలిచెను. కంసుఁడు ఎనిమిదవ గర్భము తన్నుఁ జంపుననెడి యాకాశవాణి మాటలు తలఁచుకొని భయపడు చుండెను. కుమారుడు గలుగకుండనె దేవకిని కంసుఁడు చంప దలఁచెను. కాని తనచెల్లెలిని జంపఁ జేతులాడలేదు. మామూ లుకంటె ఇప్పుడు దేవకి గర్భముతోఁ గూడి ప్రకాశించుటచేఁ గంసుని భయము ఇంకను ఎక్కువయ్యెను. అతఁ డేవస్తువు చూచిన ఏశబ్దము విన్న అది యెనిమిదవ గర్భముగాఁ దోచఁ సాగెను. కుమారుఁ డెప్పుడు పుట్టునా ఎప్పుడు చంపుదునా యని యెప్పటికప్పుడే తెలిసికొనుచు జాగరూకుఁడై యుండె ను ఆకాశవాణి మాటలు తలఁచుకొని, ఆమాటల సంగతివిన్న దేవకి వసుదేవులును యాదవులును అందఱు దేవకి మొగము నందుఁగల దివ్యజ్యోతిని చూచి యా యెనిమిదవ గర్భమునఁ బరమేశ్వరాంశ యున్నదని తలఁచి దాని నెట్లయిన రక్షింప దలపోయసాగిరి. కంసుని బాధలు పడలేక పాఱిపోయిన నం

దాదులు జైలు కాపలావాఁడు మొదలు మహాత్ముల వరకును సకలలోకులు ఈ దేవకి యెనిమిమిదవ గర్భమును తమతమ మనస్సులలోఁ దలఁచుకొని స్తుతించసాగిరి. కంసుఁడు చేయు దుష్టకృత్యములకు ఏవపడిన ఋషులు దేవకి కడుపున దేవుడు అధ్యాత్మరూపము, భౌతిక రూపముదాల్చి లోకక్షేమము చేయఁ దలఁచి యున్నదని సమాధి నిమగ్నులై సకలతృప్తి పొందిరి.

శ్రావణబహుళ అష్టమి శుభదినమున 5100సం॥ లకు పూర్వము అర్ధరాత్రివేళ దేవకికిఁ గుమారుఁడు గల్గెను. ఆ సమయమున సకల దిక్కులు ప్రసన్నములై యుండెను. మేఘములు మంగళ దుందుభులను మ్రోయించెను. కంసుని యాజ్ఞచే రేయింబవళ్ళు అప్రమత్తతతోఁ గాచుచుండి నిద్రలేక యున్న ద్వారపాలురు ఆ కుమారుఁడుజనించిన సమయమున మాయానిద్రకులోనై యొడలు తెలియక పడియుండిరి. దైవ మాయచే జైలు తలుపులు తెఱవఁబడెను. అప్పుడు వసుదేవుఁడు ఆ యెనిమిదవ గర్భమును రక్షింపదలఁచి వెంటనే జైలు నుండి వెలికివచ్చి యమునానదిని దాటి గొల్లపల్లెకుఁ బోయెను. సరిగా ఆ సమయముననే గొల్లవానిభార్య యశోద యనునామె యొకకుమార్తెను గనెను. తల్లి యశోద యొడలుమఱచి యుండెను. దైవవిలాసమునకు సంతసించి వసుదేవుడు ఎవరికిని తెలియకుండ తనకుమారుని యశోద ప్రక్కలో నిశ్శబ్దముగ బరుండఁబెట్టి యా యశోదకుమార్తెను దీసికొని వెంటనే తిన్నగా జైలులో బ్రవేశించి యేమియుఁ దెలియని వానివలె నుండెను.

కొంతసేపటికి ఆ యాడుశిశువు రోదనధ్వని యా ద్వారపాలుర నిద్రకు భంగము కలిగించెను. ద్వారపాలురు ఉలికిపడి లేచి వెంటనే యీసంగతి కంసునికి విన్నవించిరి. ఎనిమిదవ గర్భమును ఎప్పుడు చంపుదునాయని కనిపెట్టుకొనియున్న కంసుఁడతి వేగమునఁ గత్తి చేతఁబూని జైలు దగ్గఱకు వచ్చి వాపోలెను. వెంటనే కంసుఁడు దేవకి చేతినుండి యీ యాడు శిశువును లాగికొనెను. "అన్నా ! యీమె ఆడుది. నీ మేనకోడలు నా ఎనిమిదవ పుత్రుఁడు నిన్నుఁ జంపునని గదా నీకు వినఁబడియె ఈమె పుత్రిక కాని పుత్రుఁడు గాదు. ఈమెనైన దయయుంచి విడువుము" అని దేవకి యెంత బ్రతిమాలినను వినక యీమూర్ఖుఁడు ఆ కుమార్తెను చంప ఎగురవైచెను. అంత "ఓరీ ! దుర్మతీ ! నీ చెల్లెలిపిల్లలనందఱను జంపి కులుకుచుంటివి. నిన్నుఁ జంపువాఁడు ఒకచోటఁ బెరుగుచున్నాఁడు" అని యాకాశమున నామె పలుకుచు ఎగిరిపోయెను.

అప్పుడా పలుకువిని దుఃఖితుఁడై కంసుఁడు తనచెల్లెలిబావల కాళ్ళపైఁబడి "నేను మీకు గష్టము గలిగించితిని. నా దుష్కార్యములను మన్నింఁపుడు" అని వేడికొని వారిని జైలు నుండి విడుదల గావించి దేవకీ వసుదేవుల హితవాక్యంబులు విని యింటికిఁ జనియె. మఱునాడు తన స్నేహితుల కీసంగతి తెలుప వారలిట్లనిరి. "నీవు మన దేశమునఁగల శిశువులఁ జంపింపుము. అట్లయిన నీ శత్రువు మడసిపోవును. నీకింక భయంబు గలుగదు" అని. అపుడు ఆపాపాత్ముఁడగు కంసుఁడు తన యనుచరులం బంపి వారుచెప్పినట్లు చేయింపదొడంగెను.

నంద యశోదలును తమకుమారుని యందచందముల కచ్చెరువుపడి బాలుండు తమపాలిటి దైవముగాఁ దలచి పెంచఁ దొడంగిరి. గొల్లలలోఁ బెద్దయగు నందునికిఁ కుమారుఁడు గలుగుట విని యా పల్లెలోని గొల్లలు గొల్లతలువచ్చి యా కుమారుని యందము చూచి ముగ్ధులైరి. ఎవరికివారే "మన యశోద చిన్ని మగవాని గనెనఁట. చూచి వత్తము" రండని రోజురోజు చూడరాఁ దొడంగిరి. ఆ బాలుఁడు నల్లనివాఁడుగ నుండుటచే అందఱను ఆకర్షించుటచేఁ గృష్ణుండనియు తామరపువ్వులవంటి

కన్నులు గల వాడగుటచే పద్మాక్షుఁనియు పిలువఁ బడెను. ఒకనాడు నందుఁడును కంసునికిఁ గప్పము గట్టం బోయి యటనున్న మిత్రుఁడగు వసుదేవుని దర్శించి కంసుడు వసుదేవుని కొడుకుల జంపుట యెఱింగినవాఁడు గాన అతని నోదార్చుచుఁ దనకుఁ గొడుకు గలుగుట నివేదించి నా కుమారుని నీ కుమారునిగా భావింపుము" అనెను. అప్పుడు వసుదేవుండును "అంతయు భగవంతుని చిత్తము, నీకుఁగొడుకున్నచో నాకు నున్నట్లే కంసుఁడు క్రూరుఁడు గోకులమున ఉత్పాతములు తోఁచుచున్నవి. కుమారుని జాగ్రత్తగఁ జూడుము" అని వలయు జాగ్రత్తలఁ జెప్పి తొందరపెట్టి గొల్లపల్లెకుఁ బంపెను. అంత నందుఁడు గొల్లపల్లెకుఁ జని లేకలేక కలిగిన కుమారునికి ఉత్పాతమువల్ల హానికలుగకుండ జాగ్రత్త వహించెను.

క్రమముగా నందుని యింటఁ జిన్నికృష్ణుఁడు ఆనందముతో చంద్రునికళవలె వర్ధిల్లుచుండెను. ఇట్లుండఁ బూతన యను రాక్షసకాంత కంసునియాజ్ఞచేఁ బల్లెలవెంటఁ బోయి మా

యోపాయములఁ జిన్నపిల్లల హింసించుచు నొకనాఁడు సుందరీ వేషముధరించి నందుని యింటికిఁ జనెను. చిన్నికృష్ణుఁడు ఊయ్యాలలోఁ గిలకిల నవ్వుచు గేరింతలు కొట్టుచు ఆడుకొనుచుండెను. అపుడు ఎట్లయిన గృష్ణునిఁ జంపనెంచి పాలిచ్చుటకై తన యొడిలోనికిఁ దీసికొని పాలీయఁబోయెను. దగ్గఱనున్న గోపకాంతలును యశోదయు "వలదువలదు మాఅబ్బాయికిఁ బాలీయవలదు" అని యాపూతన కాంతను వారించినను ఆమె మానదయ్యె. చిన్నికృష్ణుడు ఆ పూతన రాక్షసియని గ్రహించి కాళ్ళు చేతులు గుంజుకొనుచు దాని పాలుత్రాగి చంపివైచెను.

జుట్టుపక్కలనున్న గొల్లలు నంద యశోదలు ప్రోగయి యామె వికృతాకారమునుజూచి ఆరాక్షసిని పాఱవైచిరి. చిన్నకృష్ణునకు ఏ యపాయము గలుగనందుకు వేయి దేవుళ్ళకు మ్రొక్కి దిష్టితీసి రక్షరేకులు గట్టించిరి. ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు ఈ పూతనను మోహమనెడి విషము పూసికొని ఆనంద స్వరూపుఁడగు కృష్ణునిఁ బతితునిఁజేయవచ్చిన మాయాదేవతగా వర్ణింతురు.

కొంత కాలమునకుఁ గృష్ణుఁడు ఒదిగిలఁబడ నేర్చెను. అదిచూచి నంద యశోదలు జన్మ నక్షత్రమునాఁడు గీత వాద్యములతోడను ఇరుగు పొరుగు గొల్లవారితోడను బండ్లెక్కి యొక వనమున నుత్సవము చేయఁ బోయిరి. విప్రులు అక్కడ వేద మంత్రములతోఁ గృష్ణుని దీవించిరి. గొల్లకాంతలు అక్షతలు చల్లిరి. పిదపఁ గృష్ణుని బండిపైని నిద్రపుచ్చి గోవులం

దరు విందులారగించు చుండిరి. అంతలో శకటాసురుడు వచ్చి మీదపడగా కృష్ణుడు వానిని జంపివైచెను. ఇట్లే తృణావర్తుడు మహిషాసురుఁడు కంసునిచేఁ పంపఁబడి వచ్చి శ్రీకృష్ణునిచే హతులైరి. ఇది చూచి శ్రీకృష్ణుని తలిదండ్రులు భగవంతుని దయవల్ల శ్రీకృష్ణుఁడు సుఖముగా నుండెనని తలంచి సంతోషించిరి. ఆధ్యాత్మిక విదులు శకటాసురాదులను లోభమోహాదులనుగా పోల్చిరి. ఆచిన్నికృష్ణుని యాటలలో కేకలలో మునిగిపోయిరి. ఆకృష్ణుడు నవ్వినా చూచినా ఆవులించినా, అప్పుడు ఆనవ్వులో ఆచూపులో, ఆ యావులింతలో సర్వప్రపంచమును జూచుచు అంతయు మఱచిపోయి యశోద కనులుమోడ్చి నిశ్చేష్టురాలయ్యెను.

అంతట నొకనాఁడు వసుదేవుడు పంపఁగా యాదవ పురోహితుఁడైన గర్గమహాముని వచ్చి నందుని ఆశీర్వదించి నందుని కుమారులిద్దఱిలో రోహిణి కుమారునికి బలరాముడనియు, యశోద కుమారునికిఁ గృష్ణుడనియు పేర్లుపెట్టి యా కుమారులు పరమాత్ముని యంశముచేఁ బుట్టిన మహానుభావులని తన జ్యోతిః శాస్త్ర పాండిత్యమునిబట్టి తెలియఁజేసి తన గృహంబునకుఁ బోయెను. నందుఁడిది విని యానందముతో మురియుచునుండెను.

క్రమక్రమముగ బలరామకృష్ణులు మెల్లమెల్లగ నడుగులు వేయుచుఁ దోడి బాలురతో నాడుచుఁ తల్లిదండ్రులగు యశోదానందులకేకాక నందుని గొల్లపల్లెలోని గోపగోపికా జనములకును ఆనందము గూర్చుచుండిరి. ఇరుగు పొరుగిండ్లవారు ముద్దు ముచ్చటలకయి తీసుకొనిపోవ గృష్ణుడు తానునుబోవుచు గోపబాలురతోగూడ కొంటెపనులు చేయుచు

దిరుగాడ దొడగెను. నేనుగోపాలుడను మీరుగోవులు అని, నేను రాజును మీరు భటులు అని, నేను నాటక సూత్రధారిని మీరు నటకులు అనిపలుకుచు అనేకములైన యాటలు గోపబాలురతో ఆడనేర్చెను. క్రమముగ నాలుగయిదేండ్ల ఆ చిన్నికృష్ణుడు యాటపాటలచే గోపగోపికా హృదయములతోపాటు ఇంటింటికి వెళ్ళి వెన్నమగూడ గ్రహింపసాగెను. ఇది నాయిల్లు అది వారియిల్లు అను భేదములేకుండ గోపబాలురతో అన్ని యిండ్లకుబోయి తన యిచ్ఛవచ్చిన రీతిని చరింప దొడగెను. వీరు స్త్రీలు వీరు పురుషులు అను తేడాగూడ ఆ చిన్నికృష్ణుని మనస్సులో దగ్గదయ్యెను. సహజముగా చిన్నపిల్లలలోఁ గలుగు ఋజుస్వభావము కృష్ణునిలో ఇంకను బ్రకాశించెను. ఈ విధముగ అందఱతో గలసి సంచరించెడి యా చిన్నకృష్ణుని యమాయకమైన మృదులమయిన నిర్మలాత్మను గ్రహింపజాలక నీవువేరు నేనువేరు అను భిన్నమనసుగల లాభనష్టముల దృష్టిగల గోపకాంతలు శ్రీకృష్ణుడు చేయు పనులను గొంటెపనులుగా దలచి వానినోర్వలేక యశోద దగ్గఱకు వచ్చి యా చిన్నకృష్ణునిపై నేరములు చెప్పసాగిరి.

నోరువాయిగలిగి జ్ఞానముగల మనుష్యులుఎట్లయిన తమ బాలురను బోషించుకొనగలరు గదా పాపము ఈ లేగలనోరుకొట్టిన వెట్లు అని తలచి దూడలను ఆవు దగ్గరకు విడిచిపెట్టిన యా కృష్ణుని దయార్ద్రభావము గ్రహింపజాలక "పాలులేవని బాలెంతలు మొఱలు పెట్టుచున్నను పకపక నవ్వుచు ఆవుల దగ్గఱకు వాని దూడలను నీ కృష్ణుండు విడిచెను జూచితివా యశోదా?" అని యొక గోపిక వచ్చి యనెను.

బీదపడుచులకు వారి పిల్లలకుఁ గ్రాగిన పాలుపోయక దాచు కొనుట మంచిది గాదని దలఁచి యాదయాలువగు కృష్ణుడు కడవలపాలు బీదపడుచులకుఁ బోయుచుండ నదియెరుంగక "ఓ యశోదా! నీ బిడ్డ మా కడవలలోని మంచి కాగినపాలు పడుచులకుఁబోసి మిగిలిన కడవలను బగులగొట్టెను." అని మఱియొక గోపిక చెప్పెను.

అందఱను ఒకటే కుటుంబములోని వారిఁగాఁ దలఁచి తమ తమ సంపదలను దానముచేయకున్నచో ఇట్లే ఏదో విధముగ సంపదలకు నాశము గలుగునని తెలుపఁదలఁచి ఎత్తుగానున్న యుట్టెల క్రింద ఱోళ్ళు పీటలు ఒకదానిపై నొకటి పోగుగాఁబెట్టి అప్పటికిని కుండలోనిపాలు వెన్న యందకపోవుటచే కుండకుఁ గ్రిందఁ జిన్న రంధ్రముఁచేసి మీగడపాలు దాను త్రావి తోడి బాలురకుఁబోయు భగవంతుఁడగు శ్రీ కృష్ణుని యాశయము గ్రహింపనేరక మా కడవలకు చిల్లుచేసి మీఁగడ పాలు త్రాగి వేయుచున్నాడు మీ కృష్ణుడు అని వేఱొక గోపిక చెప్పెను.

"నేను ఆ బ్రహ్మము నొకటే" అను నద్వైత భావము తెలుపుటకై "నాకంటె నింక వేరే దైవము లేఁడు" అని పలుకునది గ్రహింపనేరక "చూడు యశోదా! నీ కొడుకు తానె దేవుడనును చు మా దేవాలయము గోడపైని ఎంగిలిరాసి మైలపరచెను" అని యొక గోపాంగన పలికెను.

"నేనింటికిఁ బోవుచున్నాను నాతో వచ్చెదవా" యని కృష్ణుఁడనఁగ "నాతో వచ్చెదవా" యని అనెననియు, కొడుకులు

లేరని ఇరుగుపొరుగు స్త్రీలతో నొకస్త్రీ చెప్పుచుండ "లోకములను భరించు దేవునిగొలువ కొడుకులు గలుగుదురను నర్థముతో కృష్ణుడు వలుకగా నన్ను భర్తగా గైకొనుము కొడుకులు గలిగెదరు" యని కృష్ణుడనెను అని ఈ విధముగా ఐదేండ్లు నిండని చిన్ని కృష్ణునిమీద యనేక విధములయిన నేరములు గోపికలువచ్చి యశోదతో చెప్పిరి.

మీకు బాగుగా లక్ష్మి యున్నచో దినవచ్చును గట్టవచ్చు గాని నవ్వుచు మీ కొడుకును మా వంటి బీదల యింటికి ఉసి గొలుపుదువా, ఓయమ్మా! నీ కొడుకు మా యిండ్లలోని పాలు పెరుగు నుండనీయడమ్మా! ఈ యూరు విడచి ఎక్కడయినను బోయెదము యని యిట్లు ఆ గోపికలు పలుక విని య ద "ఏమిటమ్మా యిట్లు అనెదరు నా చిన్ని కృష్ణుడు ఎప్పుడు నా యొడివిడిచి ఎక్కడకును వెళ్లనే వెళ్లడు మీరు వానిని అట్లు తీసికొనిపోయి అల్లరిచేయించుచు వాడు దుడుకుపనులు చేయుచున్నాడని యనుచున్నారు. సరే ఇంక మా కృష్ణుని మీ యింటికి రా నీయనులెండు" నని వారికి చెప్పి పంపివైచెను.

కుఱ్ఱవానిని మందలించెదనని చెప్పితిమిగాని యీ మా తప్పు దానికే కోపపడి మా యిండ్లకు రాకుండ జేయుదురాయేమి పోనీ మేమే సహించెదములే" అని మూతి ముక్కు తిప్పుకొనుచు ఇలికి గోపికలు ఎవరిండ్లకు వారు పోయిరి.

ఇంతలో బలరాముడును గొల్ల బా రును వచ్చి "కృష్ణుడు మన్ను తిన్నాడని, చెప్పిరి. ఇదివరకే గోపికలు వచ్చి చెప్పిన మాటలు శోదకుఁ చికాకుఁ గలిగించెను. పైగా గొల్లబాలుబ

వచ్చి కృష్ణుడు మన్ను తినెనని చెప్పుటతో ఇదివరకటి చిరాకు కృష్ణునిమీద ప్రేమ, మన్ను తినిన కృష్ణుని కేమి హానియగునో యను భయము ఇవన్నియు ఆమె మనసును కలత పరచెను. మెల్ల మెల్లగా కృష్ణుడు వారి వెనుక వచ్చుచుండెను. ఆ కృష్ణుని నడక వాని మొగము యశోద చూచినది. "ఏమిరా కృష్ణా మన్ను తిన్నావటరా, తినుట కింకేమియు లేవా?" అను పలుకులు యప్రయత్నముగా ఆమె నోటనుండి వెలువడెను. "అమ్మా! నేను మన్ను ఎందుకు తిందునే, చూడు ఇదిగో" నని కృష్ణుడు పలుకుచు నోరు తెరచెను. చిరునవ్వుతో గూడిన యమాయకమగు కృష్ణుని మొగము చూచుటతో వెనుకటి చిరాకు భయము మరచిపోయినది కృష్ణుని చిన్ని మొగములోని తెల్లని పలువరుస కాంతులు నక్షత్ర కాంతులయ్యెను. కృష్ణుని నోటిలోని చిన్ని యాకాశము విశాల ప్రేమతో నిండిన యశోదకు వమస్త నదీ పర్వతసముద్ర లోకములను దనలో నిముడ్చుకొనిన విశాలాకాశమయ్యెను. ఎఱ్ఱని చిరు పెదవులతో "ఇదిగో చూడు" అన్నప్పటి గుండ్రనియా నోరు ఆమెకు బ్రహ్మాండ ఖాండమయ్యెను. ఆ యశోదకు బాలుని నోటిలో సర్వ ప్రపంచము కనిపించెను. ప్రేమకు దోఁపని వస్తువేమున్నది? ప్రేమ ఎన్నిటిని భావింపలేదు; ఏమి చేయలేదు. ప్రేమయందు ఈ సమస్త విశ్వము ఎంతటిది? ఆ కృష్ణుని యశోద సర్వాత్ముండగు విష్ణువుగా భావించినది ప్రేమచేఁ గృష్ణుని విష్ణువుగా భావించి కృష్ణుడు సర్వ వ్యాపియైన విష్ణువను యశస్సును గృష్ణునికి దానము చేసినందున జనని యశోదయినది. అంత ఆ చిన్ని కృష్ణుని నెత్తికొని అర్ధనిమీలిత నేత్రములతో ముద్దాడుచు తన యింటిలోనికి దీసికొని పోయెను.

శ్రీకృష్ణుడు తమ యింటిలోని వెన్నమీగడలను దల్లికి తెలియకుండఁ దోడి బాలురకుఁ బెట్టుచుఁ దినునట్లుగనే యితరుల యిండ్లలోని వెన్న మీగడలను దెచ్చి తినుట సహింపలేక యిట్లు గోపికలు వచ్చి యశోదతో జెప్పిరి పెరుగు తరచి వెన్నను గ్రహించునట్లు సంసారమును దరచి దైవత్వము గ్రహింపవలయునని శ్రీకృష్ణుడు బోధించుచున్నట్లు ఆధ్యాత్మికవిదులు తలచిరి. ఆ చిన్న బాలునికి ఇది తమ యిల్లూ ఇది ఇతరుల యిల్లు అను భేదము తెలియదు, వసుధయంతను ఏకకుటుంబముగాఁ గల పరమాత్మ యాత్మ యతనిలో ప్రతిఫలించుచుండెను. వెన్న పాలు పెరుగులు అమ్ముకొనిజీవించు గోపికలకు ఆచిన్ని కృష్ణుని మీఁద ఎంతటి ప్రేమ యున్నను వెన్నమీఁగడలు అయిపోవుట జూచి సహింపలేకపోయిరి.

ఒకనాఁడు యశోద కుండలో మీగడ పెరుగు పోసి కవ్వముతోఁ దఱచసాగెను. అంతలోఁ జిన్నికృష్ణుఁడు పాలిమ్మని తల్లి చేతిలోని కవ్వము పట్టుకొని వేధించఁదొడఁగెను. అప్పుడు యశోద కృష్ణునికిఁ బాలిచ్చుచు ఇంటిలోని పాలుపొంగి పొయ్యిలో పడిన వాసనవచ్చుట చూచి తటాలునఁ గృష్ణుని అక్కడ దిగవిడచి పాలుదింప త్వరగా నింటిలోనికిఁ బోయెను. పాలు ఇచ్చుచు సగములో దిగవిడిచి పోవుట కృష్ణునికిఁ గోపకారణమయ్యెను. అపుడు కాళ్ళు చేతులు ఆడించుచు అక్కడనున్న రాతితో ఆ తఱచుచున్న కుండను బగులఁగొట్టి యందులోని వెన్నను తినుచు దల్లి వచ్చుచుండుట చూచి వట్టి బుడిబుడి యేడ్పులు ఏడ్వసాగెను. తనయెదుట కుండ పగిలియుండుట పెరుగు ఒలికియుండుట యశోద చూచినది. అసలె గోపికలు

చెప్పిన నేరములచే జికాకుపడియుండెను. ఆమె యింక ఊరు కొనలేక పోయినది. దగ్గఱనే రోలొకటి బడియుండెను. అంత ఆ కవ్వపు త్రాడుతో వీరెవ్వరు? శ్రీకృష్ణులుగారా? వెన్నయంటే యేమో తెలియదంట దొంగతనమంటే ఏమియు తెలియదట ఇట్టి నియతులు జగతిలో గలరా? అని పలుకుచు కృష్ణునిఁగట్ట యత్నించెను. ఒకమూల ప్రేమ: ఇంకొక ప్రక్క కోపము ఇంకొక ప్రక్క కృష్ణుని కొంటెతనము ఇంకొక ప్రక్క భగవత్తత్త్వము ఇవన్ని కలిసి ఆ త్రాడు కృష్ణుని నడుమునకు సరిపడకుండఁ జేసెను. చివరకు యశోద ఆ కృష్ణుని ఱోలికి గట్టివైచి యింకెక్కడకుఁ గృష్ణుఁడు వెళ్ళలేఁడని తలచి యింటిలోనికి వెళ్ళెను అంతట స్వేచ్ఛగా సంచరించు చిన్నికృష్ణుఁడు ఆ నిర్బంధమును ఎట్లు సైపగలఁడు? స్వేచ్ఛకుఁ గలిగిన నిర్బంధము ముందు రోలు బరువు బరువుగా దోఁపలేదు. తల్లి యింటిలోనికి బోవుటచూచి యిదేసందని ఆ ఱోలును కృష్ణుడు ఈడ్చుకొనిపోయెను. చైతన్య శక్తిముందు జడమగు ప్రకృతిశక్తి యెంతటిది? శ్రీకృష్ణుడు ఆ ఱోలిని దారిలోనున్న రెండుచిన్న మద్దిచెట్లగుండ ఈడ్చుకొనిపోయి వాటిని గూల్చివైచి వాటి జడత్వమును గంధర్వుల శాపమును బోఁగొట్టి వాటి ఉత్తమగతికిఁ గారణమయ్యెను. ఆ చెట్లుపడిన ధ్వనికి నందుఁడు మొదలయినవారు వచ్చి ఱోలుతోనున్న బాలుని సురక్షితుఁడై యుండుట చూచి సంతసించి అది వసుదేవుఁడు చెప్పిన యుత్పాతముగా దలఁచి యా కృష్ణుని విడిపించి యెత్తుకొనిరి.

ఇట్టి యుత్పాతముల నుండి తప్పించుకొనుటకు నందాదులు బృందావనమునకుఁ బ్రయాణమైపోయిరి ఆ బృందా

వనములో రోహిణీ యశోదల కుమారులు బలరామకృష్ణులు గోపకులతో ఆల మందలతోఁ దిరుగుచు దూడలను గాచుచుఁ బిల్లనఁగోవు లూదుచు వనములలో విహరింపఁ దొడఁగిరి. బలరామకృష్ణులు చిన్నవారలయ్యుఁ గోమాతలను బుజ్జగించుచుఁ గోడెలను పరిగ నాడించుచుఁ బొగరు వృషభంబులను లొంగఁ దీయుచు గోపబాలురకు నాయకులయి యందు అనేక క్రీడల నాడఁదొడగిరి. ఇటులుండ నొకనాఁడు ఒక పొగకోడె బాలునిపై బడెను, అది క్రూరుఁడయిన కంసుని మాయచే వచ్చిన వత్సాసురుఁడు అపుడు వానిని జంపి లోక క్షేమము గూర్చెను.

ఇట్లు బకాసురుని అఘాసురుని ధేనుకాసురుని చంపెను. మహిమల ద్వారాగాని దైవత్వమును దెలిసికొనలేని సామాన్య మానవులకై పౌరాణికులు పూతనాదులను రాక్షసులుగను ఆధ్యాత్మిక విదులు ఉత్తమ పురుషునిఁ బాడుచేయు కామక్రోధాదులుగను వర్ణించిరి. అయిదారు ఏండ్ల వయసులోనె యిట్టి పనులు చేసిన కృష్ణుని గొల్లలు అందరు మెచ్చుకొనఁ దొడఁగిరి వనదేవతలు పుష్ప వర్షములు కురిపించిరి.

ఇట్లు కృష్ణుడు గొల్లబాలురతో వనములందుఁ దిరుగుచుండెను. ఒక్కొక్కప్పుడు అందరుకలసి చల్దులారగింతురు. ఒక్కొక్కప్పుడు జలములందేలియాడుచుందురు. ఒకరి కంచములో నొకరు దినుచు అభేదముగా నుందురు. గోవులతోను గోపబాలురతోను సకల సృష్టితో దాను ఏకమై యానందములఁ దేలియాడుచు శ్రీకృష్ణుఁడిట్లు తనబాల్యమును గడుపుచుండెను. ఒకప్పుడు తాము ఆటలతో మునిగియుండ గోవులు మాయమై కనిపించకపోఁగా తానుమరల సృష్టించెను. అంతటికి బ్రహ్మ

దేవుఁడే కారణమని తలచు గొల్లలకు ఇది బ్రహ్మమాయగ దోచెను. గోవులను దమకు మరల తెచ్చినందుకు గోపబాలురు అతనిని మెచ్చుకొనిరి.

ఇట్లుండ నొకనాఁడు కృష్ణుఁడు గోపబాలురతోఁ గూడి కాళిందీ నదిదగ్గఱకు ఆవులమందలకు మేపఁబోయెను. అక్కడ కాళియసర్పమనుపేర నొకపెద్ద సర్పముఁగలదని అది చాల మందిని చంపెనని వాడుకయుండుటచే గోపబాలురెవ్వరును అటువైపు పోయెడివారు గాదు. శ్రీకృష్ణుడు భయమనుమాట నెఱుఁగడు. భయమె బాధలకు మూలము. నిర్భయమె ఆనందములకు మూలముకదా! అంత గోపబాలురు వారించినను మానక వారిని తీసికొని యటకుఁబోయెను. అక్కడనున్న యొక కదంబవృక్షముఁ నెక్కి గోపబాలురతో కృష్ణుడు ఆడుచుండెను. అంత నాకాళియసర్పము బయలువెడలెను. దానిని జూచి భయపడవలదని తోడిబాలురకుఁ జెప్పి దానిమదమడఁచి యాప్రదేశము నిర్భయ మొనరించెను. దీనినె యాధ్యాత్మికవిదులు సంసారమనెడి కాళియహ్రదములో కామక్రోధాదులనెడి వేయి తలల సర్పమును లొంగఁదీసుకొన్న కృష్ణునిబరమాత్మునిగా దలతురు. ఆ కామ క్రోధాది సర్పముల విషమే సంసార హ్రదములో వ్యాపించి అందుఁజొచ్చిన జనులందఱను జంపుచున్నది. కానఁ బరమాత్ముని శరణుజొచ్చినచో దానిబారినుండి రక్షణ దొరుకునని జనులు గ్రహించవలయును. ఒకసారి వనములో గోపబాలురతో శ్రీకృష్ణుడు గోవులను మేపుచు వుండగా వనమును దావాగ్ని కాల్ప దొడగెను. అప్పుడు శ్రీకృష్ణుడు గోపకులను గోవులను తన శక్తితో దావాగ్ని బారినుండి రక్షించెను. గోపవేషముతోనున్న ప్రలంబుడను రాక్షసుని బల

రాముడు చంపెను. ఇట్లు బలరామకృష్ణులు అనేకమైన యుత్పాతములనుండి గోవులను రక్షించుచుండిరి. సకల ప్రాణులను సమానముగజూచి వారికి రక్షణ కల్పించవల్లయు నని తలంచిన వారయ్యు దుష్టులు చేయు పనులకు తదితర ప్రాణులకు గష్టంబులు గలుగుచుండగగని దుష్టులను జంపుట ద్వారా తదితరులకు సుఖమును ఆ దుష్టులకు స్వర్గసౌఖ్యమును గూర్చుచు బలరామకృష్ణులు క్రీడింపదొడగిరి.

ఆ చిన్నతనములో ప్రతిబాలునికి సహజమయిన దైవత్వము సర్వప్రాణి సమానత్వము ఆ చిన్నికృష్ణునిలో మరియు భాసిల్లి యుండెను. ఇతరబాలురు తల్లితండ్రులకు పెద్దలకుం దమ ఇరుగుపొరుగువారికి లోంబడి తాము సహజమయిన దైవ గుణములను బోగొట్టుకొనుచుందురు. శ్రీకృష్ణుడు దైవ తత్త్వమునకుంగాక మఱి దేనికి భయపడువాడుగాడు. అయిదా రేండ్లుదాటి ఎనిమిది యేండ్లలోపు వాడుగా నున్నప్పుడు తల్లి కొడుకునకు మంచిమంచి దుస్తులు కట్టబెట్టుచుండెడిది. స్వేచ్ఛగా ఆడు చిన్నికృష్ణునికి అవి బంధముగా నుండెడివి. అవి విప్పి పారవేసెడివాడు. సమస్తసృష్టిలోను వేనికి దుస్తులులేవే ఈ మనుష్యునికి ఒక్కనికిమాత్రము ఎందుకుండవలెనో కృష్ణునికి అర్థముగాలేదు. చిన్నప్పుడు తాను వివసనుడుగనే తిరిగెను. చిన్నపిల్లలు ఇప్పటికిని వివసనలుగనే యుందురు. శ్రీకృష్ణుని నవ్వులు ఆటలుపాటలు మురళీగానము రుచిచూచి గోపికలు శ్రీకృష్ణుని విడిచి యుండలేకపోయెడివారు. చిన్నప్పుడు శ్రీకృష్ణుడు వెళ్ళని యిల్లుగాని ఎత్తికొని యాడించని గోపిక గాని లేదు. స్త్రీలు వివస్త్రలయి స్నానముచేయునప్పుడు స్నానములు చేసి కొనునప్పుడు ఎప్పుడయినను చిన్నికృష్ణునికి అడ్డు అను

వది లేనే లేదు. శ్రీకృష్ణుడు పురుషులలో పురుషుడుగను స్త్రీలలో స్త్రీగను మెలిగెడివాడు. ఆ చిన్నికృష్ణుని యభేదదృష్టి తెలిసి కొనలేని గోపికలకు చిన్నికృష్ణుని పనులు కొంటె పనులుగ దోచెడివి. అయినను ఆ గోపికలు కృష్ణుని ప్రేమింపలేకపోలేదు. తనమీద తన తల్లి యశోదతో నాడు చెప్పిన నేరములకు శ్రీకృష్ణునికి గోపికలపై గోపము గలుగలేదు. పైగా వారి తెలివి తక్కువకు ఇంకను నవ్వుకొనుచు ఆనందముతో గేరింతలు కొట్టువాడు.

ఒకనాఁడు గోపికలు యమునానదికిబోయి విజన ప్రదేశమున వలువలువిడిచి జలంబులజొచ్చి క్రీడలం దేలుచుండిరి. అప్పుడు చిన్నికృష్ణుడు అక్కడికిఁబోయి "వలువల రంగులు వేరైనను శరీరముఁలొకటే యయినను శరీరములు వేరయినను ఆత్మ యొక్కటే యనియు, ఈ వలువలు శరీరములకు కృత్రిమములనియు, ఒకవేళ ధరించినను వానివిషయమై మోహపడరాదనియు, దెలుపుటకు వారి వలువలన్నియుఁ బ్రోగు జేసి తీసికొనిపోయి చెట్టునెక్కి కూర్చుండెను. అది చూచి "కృష్ణా నీవు మా హృదయములనె దొంగిలించుకొనిపోతివి. ఇంక మా వలువలతో బనేమి! మేము నీవారముఁగదా?" అని పలుకుచు వలువలమ్మని వేడికొనిరి. అప్పుడు చిన్నికృష్ణుడు నవ్వుచు "నేను మీ యిండ్లలో దిరిగెడి వాడనుగదా అప్పుడు లేనిసిగ్గు మీకిప్పుడెందులకు? నేను మీలో నెప్పుడు నున్నవాఁడనేగదా లోకములో నేను చూడని మర్మము గలదా? కృత్రిమ వేషములచే వ్యామోహము కలిగించుటెందులకు? ఈ మాయ వలువలతో మీకు బనేమి? లెండు రండు. అంతగా మాయవలువలె కావలసి

యున్నచో వచ్చి మీ మీ వలువలు తీసికొనుఁడు" అని పలికి వారి వలువలు వారికిచ్చివైచెను. పదేండ్లయిన నీఁడని ఇంత చిన్నతనములో శ్రీకృష్ణుడుచేసిన యీగోపికావస్త్రాపహరణము లోని భావమును సరిగా అర్థము చేసికొనలేక లోకులు కాకులయి యెవరిష్టము వచ్చినట్లు వారు చెప్పుకొనిరి. లోకులలోని మాయను ఇట్టి దేవుడు తొలగించుననని యాధ్యాత్మిక విదులు తలతురు. క్రమముగా గృష్ణుఁడు పదునాల్గేండ్ల వాడయ్యెను. నందాదులు మేఘాధిపతియయిన యింద్రునికిష్టము గలుగు టకై ఇంద్రయాగముచేయు నాచారము గలదు. కృష్ణుఁడు దానిని మానిపించి కర్మవశమ్మునసే యన్నియు జరుగునని చెప్పి బ్రాహ్మణోత్తములకు అనాథులకు శునకాదులకు భోజన ములు పెట్టించి సకలప్రాణులను దృప్తిపఱచె. ఒకనాఁడు ఇంద్రు నికి గోపము వచ్చెనెమో యన్నట్లు మేఘములుగ్రమ్మి బోరున పెనుగాలితో వర్షము గురియదొడఁగెను. అంతట బృందా వనములోని కుటీరములన్నియుఁ బడిపోయెను. నిలువనీడలేక పసువులు గోవులు నానా కష్టములకుఁ బాలయిరి. శ్రీకృష్ణుడు అంతట గోవులను వర్దిలఁజేయుచు ఆధారమైయుండు గోవర్ధన పర్వతము నెత్తిరక్షించెను.

ఒకనాడు వరుణుభటుడు నందుని గొల్లపల్లెనుండి దొంగి లించుకొనిపోవ వెదికి వరుణుని దగ్గరనుండి మరలఁదీసికొని వచ్చెను క్రమముగా శ్రీకృష్ణుఁడిట్లు అన్ని విధముల సహాయము చేయుచుండ అందరు అతని ప్రేమింపదొడగిరి. గోపికలు శ్రీకృష్ణుని చిన్నప్పటినుండి యెత్తుకొని యాడించిన వారగుచు అతనితో నాడుచుపాడుచు రాసక్రీడలాడుచు ఒడలుమఱచి యానంద వీచికలం దేలుచు గాలక్షేపము చేయుచుండిరి. ఒక

క్షణము కృష్ణునిఁ చూడనిచో దారు ప్రాణములేని శరీరముల వలె వారు నిలువలేక యుండురు. ఇట్లుండి శ్రీకృష్ణుడు సుదర్శనమను సర్పము నందుని బట్టుకోగా చంపి నందుని గాచెను. శంఖచూడుఁడను గుహ్యకుని వృషభాసురుని, కేసి, వ్యోమాసురులను జంపి గోవులకు సుఖము గూర్చెను.

ఈ విధముగ అనేక రాక్షసులను చంపి గోపాలురను రక్షించు కృష్ణుని సంగతి అంతటను వ్యాపించెను. అసలే ఎక్కడో తన్నుఁ జంప నొకబాలుడు పెరుగుచున్నాఁడని విన్న కంసునికి ఈ వార్త భయాందోళనలకు గారణమయ్యెను. ఒక నాఁడు నారదుఁడు వచ్చి యతనికి బలరామకృష్ణుల సంగతి చెప్పిపోయెను. అపుడు కంసుడు "ధనుర్యాగము చూడరం" డని చెప్పి బలరామకృష్ణులను దోడి తెమ్మని అక్రూరుని పంపెను. అక్రూరుఁడు దైవభక్తుడు కంసుని కెదురాడ వెఱచి రథమెక్కి బలరామకృష్ణులఁ దీసికొని వచ్చుటకు నందునిపల్లెకుఁ బోయెను. వసుదేవుఁడు దేవకి తన్ను మోసగించిరని భావించి కంసుఁడు మరల వారిని కారాగారము నందుంచెను.

అక్రూరుఁడు బలరామకృష్ణుల సంగతి విని వారిని జూడఁ గల్గినందులకుఁ దన యదృష్టమును గొనియాడుకొనెను. బృందావనములో పదునారేండ్ల వయస్సులోనున్న బలరామకృష్ణులను జూచి అక్రూరుఁడు తన జన్మ ధన్యమైనదని తలఁచెను. నందుఁడు అక్రూరునికి సగౌరవముఁగా నాతిథ్యమిచ్చి వసుదేవాదుల క్షేమాదుల నడిగి అతఁడు వచ్చిన కారణమడిగెను. తాను వచ్చిన కారణమును బలరామకృష్ణులతోడను నందుని

తోను అక్రూరుఁను చెప్పెను. అది విని కంసుని క్రూరకృత్యములను అది వఱకేవిన్న బలరామకృష్ణులు అక్రూరునివల్ల తమ జన్మాంశములను గూడ దెలిసి నెయ్యి పెరుగు మొదలగు కానుకలతో యజ్ఞముఁజూడ తమ సమ్మతి దెలిపిరి. బలరామ కృష్ణుల మాటకు ప్రతిచెప్పక కంసుని క్రూరకృత్యములను దెలిసిన వారయ్యు నందాదులు తాము ముందుగనే బయలు దేరిరి. శ్రీకృష్ణునితో గలిసిమెలిసి యొక్కటిగా విహరించిన గోపగోపాంగనల గుండెలో రాయిపడెను. "అయ్యో మన కృష్ణుఁడు మధురకుఁ బోవుచున్నాఁడు ఇంక మన బ్రతుకెట్లు" అని ప్రాణములన్నిటిని కళ్ళలోనికి తెచ్చుకొని కృష్ణునిపైపు గోపికలు చూడసాగిరి. "ఇంతకాలము మనతో నుండి మధుర నుండి యక్రూరుఁడనువాఁడెవ్వఁడో వచ్చి పిలిచినంతనె కృష్ణుఁడు పోవుచున్నాఁడు వీఁడు గ్రూరుఁడుగాక యక్రూరుడా! అయ్యో మనకింకేమి గతి మనమింక బ్రతుకగలమే" యని గోపికలందరువచ్చి కృష్ణునిపైపు ప్రాణములు పీడిన దేహముల వలెఁ జూచుచుండ నేను త్వరలో వచ్చెదను మిమ్ము విడిచి నేను మాత్రము ఉండగలనా? నాలో మీరున్నారు మీలో నేనున్నవాఁడనె యని కృష్ణుఁడోదార్చి యక్రూరునితో రథమెక్కి మధురకు చనెను. గోపికలు బెంగతో ధైర్యంతో రథము పోయినదిక్కే చూచుచు నిలఁబడిపోయిరి.

బలరామకృష్ణులు మధుర ప్రవేశించిరని విని పౌర సుందరులు తమ కన్నుల కఱవు తీర చూడఁదొడగిరి. బలరామ కృష్ణుల లీలలు చెప్పుకొనుచు ముత్యాల సేసలు చల్లిరి. కంసునికై రజకులు వస్త్రములను తీసికొనిపోవుచుండ వారిని యడిగిన

వారీయక నిందింప బలరామకృష్ణులు వారిని జంపి వస్త్రములను గైకొనిరి. కొన్ని నెచ్చెలులకిడి తాము ధరించిరి. సుదాముని నడిగి మాలలు గైకొని యొక కుబ్జ యిచ్చిన సుగంధముల నందుకొని కంసుని దుర్గంబు ప్రవేశించిరి. మఱి యందుఁగల యాయుధాగారమునుండి యాయుధములు కంసుడు పంపఁగా తమ్ముఁ జంపవచ్చిన కువలయాపీడ గజమునుజంపి మల్లయుద్ధమునఁ జాణూరముష్టికులను వధించిరి. నిండుసభలోనికివచ్చు బలరామకృష్ణులను జూచి వారిని జంప నాజ్ఞాపించు క్రూరుడయిన కంసునిజంపి కారాగారమునగల తమ తల్లితండ్రులను విడిపించి నమస్కరించిరి. దుష్టశిక్షణ శిష్టరక్షణము తన కర్తవ్యముగా నెంచు శ్రీకృష్ణుడు రాజ్యాధికారము కోరక యుగ్రసేనునికి బట్టాభిషేకముగట్టి కంసుని భయముచే విదేశములకుఁబోయిన తమ బంధుపులను రావించి వారివారి నివాసంబులందుండ నియోగించె. "కన్న తల్లిదండ్రులనుచూడక మీరే తల్లిదండ్రులని యుంటిమి. వీరిని సంతోషపరచి వచ్చెద" మని యొడబఱచి కనుల నీరునించెడి నందుని గొల్లపల్లెకు గృష్ణుడు పంపెను.

"దేవకీ వసుదేవులు క్షత్రియ కులోచితముగ బలరామకృష్ణులకు ఉపనయనము గావించి వేద వేదాంగ విద్యలు నేర్వ సాందీపని యను గురువు దగ్గరకు గురు కులమునకు బంపిరి. అంత వారు సాందీపనియొద్ద సకల విద్యలు నేర్చిరి. ఒకనాడు ప్రభాసతీర్థమున స్నానముచేయుచు అందుఁబడిపోయి యమపురికిపోయినట్టి గురుపుత్రుని రక్షించి గురుకులమును వీడదలచిన బలరామకృష్ణులు ఆ గురువు పుత్రునినె

గురుదక్షిణగా నర్పించిరి. పిదప గురువు సంతోషింపఁగా విద్య చాలించి వారిరువురు మధురకు వచ్చిరి.

మధురకు వచ్చిన పిదపఁ దన్నుఁగన్న దల్లిదండ్రుల వలెఁ బెంచిన నందయశోదలను తమతోపాటు ఆటపాటలలో మైమరచి తనకై వెంగగొన్న గోపగోపికలను ఓదార్ప నుదవుని బంపెను. తిరుగ వారు పంపిన ప్రేమ సందేశమునువిని కానుకలను గ్రహించెను.

ఇంక అట తండ్రియైన పాండురాజు చనిపోఁగా హస్తినాపురము చేరిన యాత్మబంధువులయిన పాండవుల యోగక్షేమము అక్రూరునిద్వారా తెలిసికొనెను.

ఇట్లుండ కంసుని భార్యలయిన అస్తిప్రాస్తి యను వారిరువురు తండ్రియగు జరాసంధుఁడు కృష్ణుని జంప మధుర మీఁదికి దండెత్తి వచ్చెను. కాని కృష్ణునితో యుద్ధము చేసి యోడిపోయెను. అట్లు యోడిపోయినను జరాసంధుఁడు సమయముచూచి రాజులను గూర్చుకొని మాటిమాటికి గృష్ణుని మీఁదకు యుద్ధమునకువచ్చి యోడిపోవుచుండెను. మాటిమాటికి జరాసంధుఁడు వచ్చుచుండుటచే దన ప్రజలకుఁ గష్టము గల్గునని తలఁచి కృష్ణుడు సముద్రతీరమున ద్వారకయను పట్టణమును నిర్మింపజేసి యందు దన బం పరివారముతో నివసింపసాగెను.

బాండవులనేక కష్టముల పాలగుచుండ మాటిమాటికి కృష్ణుడు వారిని కాపాడుచుండువాడు. ఒకమారు ధర్మరాజు దిగ్విజయము చేసి రాజసూయమను యాగమును గావించెను. అందు భీష్ముని ప్రేరణచే ధర్మరాజు పురుషోత్తముడగు శ్రీకృష్ణుని బూజించెను. అందుకు సహింపలేక శిశుపాలుడు శ్రీకృష్ణుని నిందింపఁగా ఎంతయో యోర్పు వహించెను. కాని శిశుపాలుడు తన దౌష్ట్యమును మానకపోవుటచే శ్రీకృష్ణుడు శిశుపాలుని జంపెను. మరియు నిట్లే దుష్టులగు దంతవక్త్రాదులను సంహరించి లోకక్షేమము చేసెను. తన భక్తుడు బాల్యస్నేహితుఁడునగు కుచేలుని నాదరించి సకల సంపదలిచ్చి యాతని దారిద్ర్యమును బాపెను.

ఇట్లుండఁ గౌరవులు ధర్మరాజును జూదమునకుఁ బిలిచిరి. పిలిచినప్పుడు వెళ్ళకపోవుట తప్పని తలఁచి ధర్మరాజు దుర్యోధనాదులతో ద్యూతమాడెను. అంత ధర్మరాజు కౌరవులు చేసిన యన్యాయ ద్యూతములో తమ తండ్రి భాగమగు రాజ్యమువెగాక తన సోదరులను, తన్నును, భార్య ద్రౌపదిని ఒడ్డి ఓడిపోయెను. అప్పుడు కౌరవులు నిండు సభలో ద్రౌపదిని జుట్టు పట్టికొని లాగి తీసికొనివచ్చి యవమానపఱచిరి. పిదపఁ బాండవుల పెదతండ్రి ధృతరాష్ట్రుఁడు వారి రాజ్యము వారికిచ్చివేయఁగా ఊరుకొనక కౌరవులు మరల జూదమునకుఁ బిలిచి పాండవుల నోడించిరి. ఓడినచోఁ బండ్రెండు సంవత్సరములు అరణ్యవాసమును, ఒకయేడు అజ్ఞాతవాసమును చేయవలెనని షరతుపెట్టిరి. ఆ షరతు ప్రకారము పాండవులు అరణ్యవాసమును ఒకయేడు అజ్ఞాతవాసమును గడిపి తమ రాజ్యము

తమకిష్టవలసినదిగా సంజయాదులచే రాయబారమంపిరి. దుర్యోధనుడు అందుకంగీకరింపలేదు. ధృతరాష్ట్రుడు తన పెద్దకొడుకు మాట నతిక్రమింపలేకపోయెను. పాండవులు ఇక యుద్ధము తప్పదని నిశ్చయించుకొనిరి. ఇరుపక్షములవారు తమకిష్టమైన రాజుల సాయము కోరి సేనలను ప్రోగుచేయఁ దొడఁగిరి. తన సాయము కోరవచ్చిన దుర్యోధనునికి శ్రీకృష్ణుఁడు అనేకమగువేల సైన్యమున అతను కోరిన ప్రకార మిచ్చెను. తాను యుద్ధము చేయనని శ్రీకృష్ణుడు చెప్పినను తమ పక్షమున నుండి సలహాలు మాత్రము చెప్పిన చాలునని యర్జునుఁడు యుద్ధముచేయని శ్రీకృష్ణునినే కోరుకొనెను. ఇతర మగు రాయబారములు విఫలమగుటచేఁ జివరకు శ్రీకృష్ణుని రాయబారమంపిరి. కౌరవులు సంధికి ఒప్పుకొనరని తలఁచియుఁ దన కర్తవ్యము నెఱవేర్పఁదలఁచి శ్రీకృష్ణుడు రాయబారమునకై కౌరవుల దగ్గఱకు వెళ్ళెను.

శ్రీకృష్ణుడు హస్తినాపురము వెళ్ళి తనయులు కోడలు పడు నిడుములకు దుఃఖించు కుంతి నోదార్చి విదురుని యింట విడిసెను. పిదప దుర్యోధనాదులతోడను, ధృతరాష్ట్రునితోడను పాండవులకు పగపాలు ఇమ్మని చెప్పెను. చివరకుఁ బోని యైదుగ్రామము లయినను ఇచ్చి రణమువలన గలుగు జన నాశమును వారింపుఁడని నయముగఁ జెప్పెను. సూదిమోపిన మేరయయిన నీయనని దుర్యోధనుఁ డనెను. ధృతరాష్ట్రుడు దన కొడుకు మాటను గాదనలేకపోయెను. చివరకు రాయబారియై వచ్చిన శ్రీకృష్ణుని బంధించుటకు మూర్ఖులగు కౌరవులు సిద్ధమైరి. కాని శ్రీకృష్ణుని ముందు వారి యాటలు సాగలేదు.

అపుడు ధృతరాష్ట్రునికి తన విశ్వరూపము చూపెను. అంత శ్రీకృష్ణుఁడు "పరేకానిండు. నేనిక చేయునది లేదు. కానున్నది కాకమానదు. నా కర్తవ్యమును నెఱవేర్చితిని." అని చివరిసారిగ ధృతరాష్ట్రాదులతోఁ బలికి యటనుండి పాండవుల దగ్గరకు వచ్చి జరిగిన సంగతి చెప్పెను.

కౌరవులకుఁ బాండవులకు సంసారమున దుర్గుణములకు సద్గుణములకువలె యుద్ధము ప్రారంభమయ్యెను. పాండవుల పక్షమున ఏడు అక్షౌహిణులు కౌరవుల పక్షమున పదునొకండు అక్షౌహిణులును సైన్యము చేరెను. రెండు పక్షములవారును ధర్మక్షేత్రమయిన కురుక్షేత్రమున యుద్ధసన్నద్ధులై యుండిరి. శ్రీకృష్ణుడు తెల్లని గుఱ్ఱములు గట్టిన రథముపై ఇంద్రియములను చేతఁబట్టుకొన్న యాత్మవలె పగ్గములు పట్టుకొని కూర్చుండెను. అర్జునుఁడు తన రథమును ఇరుసైన్యముల మధ్యను నడపమని బావయగు కృష్ణునితో ననెను. రథము రెండు సేనలమధ్యకు వచ్చెను.

అర్జునుఁడు రెండు సేనలను పరికించెను. తన యెదుట తమకు అన్యాయముచేసిన దుర్యోధనాదులే గాక తనకు ఆత్యంతాప్తులైన గురువులు, తాతలు, బంధువులు గనిపించిరి. అర్జునుఁడు అనేక యుద్ధములు చేసి యనేకులను చంపినవాఁడే కౌరవులను జయించుటకుఁ దపస్సుచేసి అనేక శస్త్రాస్త్రములను సంపాదించినవాఁడే ఎప్పుడు యుద్ధము వచ్చునా, ఎప్పుడు దుర్యోధనాదులపై బగ దీర్చుకొందునా అని కాచిపెట్టుకొని యున్నవాఁడే అయినను గురువులను, తాతలను, బంధువులను జూచుటతోడనే వారిని జంపినఁగాని శత్రువులపై బగఁదీర్చు

కొనుట సంభవింపదని తోఁచినది. తమ పొట్టకూటికోసము ఇంతమంది యాప్తులను జంపవలయునే అని తట్టినది. తత్కాలమున విరాగ ముదయించినది. ఈ రక్తపుఁ గూడు నాకక్కర లేదు, ముష్టియైన నెత్తుకొందును. కాని యుద్ధములో వీరిని జంపలేను. నాకీ యుద్ధము వలదు". అని పలుకుచు ఆయుధములు క్రిందఁ బారవైచి రథముపైఁ గూలఁబడెను. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునుని తాత్కాలిక వైరాగ్యమునకు నవ్వుచు ఇట్లు పలికెను. "ఓ యర్జునా! ఇన్ని ప్రయత్నములు చేసి తీరా సమయము వచ్చినప్పటికి నేను యుద్ధము చేయను అన్నచో నీ శత్రువులు నిన్నేమనుకొందురు? పిఱికిపందవని యనుకొనరా! నీవు క్షత్రియుఁడవు క్షణిక వైరాగ్యము పొందకుము. బంధువులను జంపవలసివచ్చునని కర్తవ్యమూఢుఁడవు గాకుము. శరీర మెన్నటికైనను నశించునదే. ఆత్మయే శాశ్వతమైనది. పాతబట్టలు విడిచి క్రొత్తబట్టలు మనుష్యుఁడు ధరించినట్లు ఈయాత్మ పాత శరీరములను విడిచి క్రొత్తశరీరములను ధరించును. ఫలాశ లేకుండ నీకర్తవ్యము చేయుము కర్మచేయుటే నీకర్తవ్యము. ఫలము నీయధీనములో లేదు. నన్ను నమ్ముము. అధర్మము చేయరాదు. ధర్మకార్యము చేయునపుడు వీరిని జంపవలయునే యని శోకము పొందకుము. నీకర్తవ్యము నెఱవేర్చుము." అని యిట్లు శ్రీకృష్ణుఁడు-అర్జునునకు పదునెనిమిది యధ్యాయములుగల భగవద్గీతను ఉపదేశించెను. అర్జునునకు ధర్మోపదేశము చేయుటలో శ్రీకృష్ణుడు తాను శరీరధారియనుమాటను మరచిపోయెను. అతనిలో భగవత్తత్త్వము నిండియుండెను. నిండుటయేమి. అతఁడు భగవం

తుఁడే. ఆ ధర్మోపదేశము శ్రీకృష్ణగీతగాదు. భగవద్గీతయే. శ్రీకృష్ణుఁడు ఒక్కమాటు ప్రత్యక్షముగా విశ్వరూపమును (విశ్వము యొక్క రూపమును) జూపెను. లోకములో ఎందరుపుట్టి మరణించుటలేదు. ఇకముందు ఎందరుపుట్టి మరణింపరు. ఇందులో నీవు నిమిత్తమాత్రము అగుదువు అంతే. నీవు చంపక పోయినను వారెట్లును చచ్చువారె చూడవలసినది యొక్కటే. తాము చేయునది ధర్మమా అధర్మమా అని మాత్రమే. తాను ధర్మము చేయుచున్నాఁడా? అందులో ఎన్ని ప్రాణులు నశించినను ఆ ప్రాణులు ఆత్మీయులయినను గాకపోయినను అధర్మ కర్తవ్యము నుండి విముఖుఁడు గారాదు అని కృష్ణుఁడు చెప్పెను. ఇంతలో అర్జునునకు జ్ఞానోపదేశమయ్యెను. ఆతనికున్న పిఱికి తనము పోయెను ధర్మమగు తనకర్తవ్యమును జేయుటలో బద్ధుఁడయ్యెను. భగవంతుని శరణుపొందెను. శ్రీకృష్ణుఁడు చెప్పినట్లు చేయనంగీకరించెను.

యుద్ధము పదునెనిమిదిదినములు జరిగెను. దైవస్వరూపుఁడగు శ్రీకృష్ణుఁడున్న పాండవ పక్షము జయించెను. కృష్ణుఁడు బంధుమరణంబుచే దుఃఖించు ధర్మరాజాదులను, గాంధారీ ధృతరాష్ట్రులను ఓదార్చి వారికి తత్త్వ జ్ఞానము నుపదేశించెను. జీవుఁడు ఆత్మయును గలిసి యేకమైనట్లు బావమఱఁది మిత్రుఁడు శిష్యుఁడునయిన అర్జునుఁడును శ్రీకృష్ణుఁడును గలిసి మెలిసి యేకమై యానందమునఁ దేలియాడిరి. ఇంక నిక్కడఁ దన కర్తవ్యము ముగియఁగా శ్రీకృష్ణుఁడు తన తల్లిదండ్రులను చూడ ద్వారకకుఁ బ్రయాణ మయ్యెను. అందుఁ గొంతకాలముండి ధర్మరాజు చేయు నశ్వమేధ యాగంబునకు వచ్చెను. అంతతో పాండవుల యెడఁ జేయవలసిన కర్తవ్యములు ముగియఁగా మరల ద్వారకకువచ్చెను.

ఇట్లు శ్రీకృష్ణుఁడు తనకు రాజ్యాధిపత్యాదులు అక్కఱలేక పోయినను లోకసంగ్రహమునకై తగుకార్యములు చేయుచు

రాజులచేత మహర్షులచేత పూజింపఁబడుచు భగవద్రూపుఁడై యుండెను. ఇట్లుండఁ గొంత కాలమునకు యాదవులలో అంతః కలహములు బయలు దేఱెను. వారు మధ్యపాన మత్తులై యొ డలు తెలియక యొండరులఁ జంపుకొనిరి. యాదవ కులము అంత మయ్యెను. బలరాముఁడు తనశరీరమును జాలించెను. ఇదంతయు శ్రీకృష్ణుఁడు చూచుచు నిశ్చింతుడై యుండెను.

ఒకనాఁడు శ్రీకృష్ణుఁడు వనమధ్యమందు ధ్యాననిమ గ్నుడై వరుండి కాలిపై కాలుంచి కాలుఅడించుచుండెను. అంత నొకవేటకాఁడు ఆ కాలును దూరము నుండి చూచి దానిని లేఁడి గాఁ దలఁచి బాణము వదలెను. అది శ్రీకృష్ణుని కాలికిఁ దగి లెను. అప్పుడా వేఁటకాఁడు దగ్గఱకు వచ్చి యక్కడ శ్రీకృష్ణు నిగాంచి నిర్ఘాంతపోయి తాను చేసిన పనికిఁ బశ్చాత్తాపపడుచు కృష్ణునికాళ్ళమీదఁబడి విలపింప సాగెను. అంతశ్రీకష్ణుఁడు అతని నోదార్చి, "ఇది భగవదిచ్ఛ, దీనిని దప్పింప నెవరి తరము: నేను దైవముతోఁ గలిసిపోవ నీవు కారణమవైతివి, విచారించకుము". అని వానికిఁ దెలియఁజెప్పి ఇదివఱకే యా త్మతో నైక్యముపొందిన భగవంతుఁడే అయియున్న శ్రీకృష్ణుఁ డు శరీరధారులందఱు ఇట్లే కావయునని తెలుపుటకు భౌతికదేహ ముతోఁ గూడ నాత్మతో నైక్యము పొందెను.

రుక్మిణి మొదలయిన వారందఱు అగ్నిప్రవేశము చేసిరి.

శ్రీకృష్ణుండు ఇట్లు లోకసంగ్రహమునకై శరీరమును ధరించి నిర్యాణము పొందునప్పటికి నూటయిరువదియైదు వత్సరముల వయస్సు వాఁడయి యుండెను. ఆ కృష్ణపర మాత్మ బోధించిన భగవద్గీతనాఁటినుండి భారతీయులకు శిరో ధార్య మైనది. భారతీయులకేగాదు, శరీరధారులందఱకు శిరో ధార్యము కావలసినదే. దాని ప్రకారము అందఱు నడచుకొని యాత్మైక్యము పొంది యానందనిమగ్నులగుదురు గాక!

తొలి నారాయణుఁ డాత్మరూపమున నెందున్ క్షీర
మట్లొప్పి, లీలలకై అపయి పాలమీఁగడయటుల్
వ్యక్తాకృతిన్ బొంది, నిర్మల మాకాశము, నందుఁ గాలి
జ్వలనంబాపై నటన్ నీరు, నందిల, యన్నంబయి
జీవియై వెలుఁగు నాయీశున్ సదా మ్రొక్కెదన్.

వైదిక సంహితాటవుల బాటలుదీరిచి యజ్ఞశాలలన్
వేదికలాశ్రమాలమృతవీధులు చక్కఁగదిద్ది యందులో
పాదములుంచలేని జనపాళికి మేడలు పూవుఁదోఁట ల
ష్టాదశరీతి నంతరులు సల్పినశిల్పిని వ్యాసు మ్రొక్కెదన్.

నారాయణున్ గురున్ దేవున్
దండిన్ మ్రొక్కి వినమ్రతన్
తెన్గింతున్ భగవద్గీత
నే గణపతి నాముఁడన్.

ఉపనిషత్తులు గోవుల్;

పిదుకువాఁడు కృష్ణుడు;

పార్థుండు దూడ;

జ్ఞానిసా భోక్త;

గీతమె క్షీరముల్.

# శ్రీ భగవద్గీత

ధృతరాష్ట్ర ఉవాచ :

ధర్మక్షేత్రే కురుక్షేత్రే. సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ. కిమకుర్వత సంజయ ! 1

ధృతరాష్ట్రుఁ డనియె :

ధర్మంబునకు క్షేత్రంబౌ. కురుక్షేత్రము. పోరుకై
చేరి నావారు పాండవు లేమి చేసిరి సంజయా?

విన :- కురుక్షేత్రము – కురుక్షేత్రమను చోటు. కర్మక్షేత్రమగు దేహమును. నావారు – నా కుమారులు. నాది అను భావము అహంభావముగల రాజస తామస గుణము లును. పాండవులు – పాండురాజు తనయులు. పాండు వర్ణముగల సాత్త్విక గుణము లును,

సంజయ ఉవాచ:

దృష్ట్వాతు పాండవానీకం, వ్యూఢందుర్యోధన స్తదా
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. 2

సంజయుఁ డనియె :

వ్యూహంబులుగఁ బన్నిన. పాండవసేన గన్గొని
దుర్యోధన మహారాజు. గురువుం జేరి యిట్లనెన్

దుర్యోధన ఉవాచ

పశ్యైతాం పాండుపుత్రాణాం ఆచార్య; మహతీం చమూం
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా. 3

దుర్యోధనుఁ డనియె :

నీ శిష్యుండును ధీముండు. ద్రుపదజుండు పన్నిన
యీ పాండవమహాసైన్య. మాచార్య! యిదె చూఁడుమీ,

అత్ర శూరా మహేష్వాసా. భీమార్జునసమా యుధి
యుయుధానో విరాటశ్చ. ద్రుపదశ్చ మహారథః. 4

ఇందు విల్కాండ్రు శూరులు, పోరన్ భీమార్జునోపముల్
యుయుధానుండు విరాటుం డాద్రుపదుల్ మహారథుల్

వివ: పదివేలయోధులతో యుద్ధము చేయువాఁడు మహారథుఁడు

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్
పురుజిత్కుంతి భోజశ్చ. శైబ్యశ్చ నరపుఙ్గవః 5

ధృష్టకేతు చేకితానుల్ వీరుఁడౌ కాశిరాజును
పురుజిత్కుంతిభోజులు. నరశ్రేష్ఠుఁడు శైబ్యుఁడున్

వివ: ధృష్టకేతువు-శిశుపాలుని కొడుకు,చేకితానుఁడుయాదవుఁడు

యుధామన్యుశ్చ విక్రాంత, ఉత్తమౌజాశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయాశ్చ, సర్వ ఏవ మహారథాః 6

విక్రాంతుఁడు యుధామన్యుఁ. డుత్తమౌజుఁడు శూరుఁడు
ద్రౌవదేయు. లభిమన్యుఁ డీయందఱు మహారథుల్.

వివ : యుధామన్యువు ఉత్తమౌజుఁడు - పాంచాలురు అర్జున
రథచక్ర రక్షకులు, దౌపదేయులు - ద్రౌపది కొడుకులు
ప్రతివిందాదులు.

అస్మాకం తు విశిష్టాయే, తాన్నిబోధ ద్విజోత్తమ!
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థంతాన్ బ్రవీమితే తే 7
మనలో ఘను లెవ్వరో, వారిఁ జూడు ద్విజోత్తమా !
నాసేనాపతు లందఱు, నీవు గుర్తిడఁ దెల్పెదన్.

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ, కృపశ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణశ్చ సోమదత్తి స్తథైవచ. 8
నీవు, భీష్ముండు, కర్ణుండు జయశాలి కృపుండును
అశ్వత్థామ వికర్ణుండు, నాభూరిశ్రవ సైంధవుల్.

వివ: వికర్ణుఁడు - ధృతరాష్ట్రసుతుఁడు
అన్యేచ బహవశ్శూరాః, మదర్థే త్యక్త జీవితాః
నానా శస్త్ర ప్రహరణాః. సర్వే యుద్ధవిశారదాః. 9
నాకై ప్రాణము లర్పించు శూరులుండి రనేకులున్
వారు నానాయుధధరుల్, వారెల్ల యుద్ధకోవిదుల్.

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితం 10
భీష్ముండు నడవు మన సైన్యముల్ లెక్కలేనివి
భీముండు నడుపు పాండవ. సేనల్ లెక్కింపఁదగ్గవి.

అయనేషు చ సర్వేషు, యథాభాగ మవస్థితా
భీష్మమేవాభిరక్షంతు. భవంత స్సర్వ ఏవ హి 11

సకలస్థానములందున్. మీమీ చోటుల నుండియే
భీష్మునినే యింక మీల్. జాగ్రత్తఁగాచుచుండుఁడీ

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్ 12
తాతయు కురువృద్ధుండు, ధీరుండౌ భీష్ముఁడప్పుడు
గర్జించి శంఖమూఁదుచు వానికిఁ గూర్చె మోదమున్

తత శ్శంఖాశ్చ భేర్యశ్చ, పణవానక గోముఖాః
సహసై వాభ్యహన్యంత, స శబ్ద స్తుములోఽభవత్. 13
అంత భేరులు శంఖంబుల్, డోళ్ళు బాకలు, మద్దెలల్
వాయింప బడె నప్పు డా, శబ్దంబు నిండె నెల్లెడన్.

తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవశ్చైవ, దివ్యౌశంఖౌ ప్రదధ్మతుః. 14
తెల్లగుఱ్ఱాలు కట్టిన, దివ్యమౌ రథ మెక్కియున్
శ్రీకృష్ణార్జును లంతట, నూఁదిరి దివ్యశంఖముల్.

పాంచజన్యం హృషీకేశో, దేవదత్తం ధనంజయః
పౌండ్రం దధ్మౌ మహాశంఖం, భీమకర్మా వృకోదరః 15
కృష్ణుండు పాంచజన్యంబున్, దేవదత్తంబు పార్థుఁడున్
భయంకరుఁడు భీముండు పౌండ్రశంఖంబు నూఁదెను.

అనంత విజయం రాజా, కుంతీపుత్రో యుధిష్ఠిరః
నకుల స్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ. 16
ధర్మజుం డూఁదె నసంత, విజయం బనుశంఖమున్
ఆ నకుల సహదేవుల్, సుఘోష మణిపుష్పముల్.

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః 17
గొప్పవిల్కాఁడు కాశ్యుండు, మహారథి శిఖండియున్
ధృష్టద్యుమ్న విరాటులున్, విజయి యైనసాత్యకి.

ద్రుపదో ద్రౌపదేయాశ్చ, సర్వశః పృథివీపతే
సౌభద్రశ్చ మహాభాహుః శంఖాన్దధ్ముః పృథక్పృథక్ 18
ద్రుపదుండు ద్రౌపదేయుల్, మహాభాహాభిమన్యుఁడున్
రాజా! వేర్వేఱ శంఖంబుల్, పూరించి రంత సెల్లెడన్.

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీం చైవ, తుములో వ్యనునాదయన్. 19
ఆకాశంబున భువియందున్, బ్రతిధ్వను లొనర్చుచున్
ఆధ్వని ధార్తరాష్ట్రుల గుండెల్ బ్రద్దలు చేసెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః 20
అంతఁ బోరికి సిద్ధంబౌ ధార్తరాష్ట్రులఁ గన్గొని
బాణముల్ వేయుకాలంబు, రాఁగా విల్లెత్తి పార్థుఁడు

హృషీకేశం తదావాక్యం, ఇద మాహ మహీపతే
కృష్ణునితోడ నీమాటల్, వచియించె మహీపతీ!

అర్జున ఉవాచ

సేనయో రుభయోర్మధ్యే, రథంస్థాపయ మేఽచ్యుత 21

అర్జునుఁ డనియె,
ఇరుసైన్యంబుల మధ్యన్, గృష్ణా! నా రథ ముంచుమీ.

యావదేతాన్ నిరీక్షేఽహం, యోద్ధుకామా నవస్థితాన్
కైర్మయా సహ యోద్ధవ్యం, అస్మిన్ రణసముద్యమే 22
యుద్ధంబు చేయుకోర్కెతో, వచ్చిన వీరిఁ గాంచెదన్
ఈయుద్ధభూమి వేరితో, నేను యుద్ధ మొనర్తునో.

యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధే ప్రియ చికీర్షవః 23
దుష్టుం డౌదుర్యోధనున, కాజిన్ బ్రియంబు చేయఁగా
వచ్చి యుద్ధము గావింపఁ బోయెడివారిఁ జూచెదన్

సంజయ ఉవాచ :
సంజయుఁ డనియె :

ఏవ ముక్తో హృషీకేశో, గుడాకేశేన భారత !
సేనయో రుభయోర్మధ్యే, స్థాపయిత్వా రథోత్తమమ్ 24
భారతాన్వయ ! యీరీతి ! పార్థుండు కృష్ణుఁబల్కఁగా
రెండుసైన్యంబుల మధ్యన్, దివ్యరథంబు నిల్పియున్

భీష్మ ద్రోణ ప్రముఖతః, సర్వేషాంచ మహీక్షితామ్.
ఉవాచ పార్థ పశ్యైతాన్, సమవేతాన్ కురూనితి 25
భీష్మద్రోణులయెదుటన్ రాజు లందఱ ముందఱన్
కృష్ణుఁ డిట్లనె "నర్జునా ! చేరినవీరి (డుమీ"
తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః, పితౄ నథ పితామహాన్
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్
పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా 26

అందు తండ్రుల తాతలన్, గురులన్, మామ యన్నలన్
పుత్రపౌత్రుల మిత్రులన్, బార్థుఁడంతటఁ గన్గొనెన్

శ్వశురాన్ సుహృదశ్చైవ, సేనయో రుభయో రపి
తాన్ సమీక్ష్య స కౌన్తేయః సర్వాన్బంధూ నవస్థితాన్ 27

ఇరు సైన్యంబులలోనన్, మామగార్లను మిత్రులన్
ఇంకన్ వచ్చిన బంధులఁ జూచి యర్జునుఁ డప్పుడు.

కృపయా పరయావిష్టో, విషీద న్నిద మబ్రవీత్.

అర్జున ఉవాచ :

జాలిన్ నిండినమదితో విచారించుచు నిట్లనెన్
దృష్ట్వేమం స్వజనం కృష్ణ, యుయుత్సుం సముపస్థితం 28

అర్జునుఁ డనియె :

కృష్ణా! పోరికి వచ్చిన యీనావారిని చూడఁగ.

సీదంతి మమ గాత్రాణి, ముఖంచ పరిశుష్యతి
వేపథుశ్చ శరీరేమే, రోమహర్ష శ్చ జాయతే. 29

నా యంగంబులు సడలెన్ మోమును వాడిపోయెను
ఒడ లంతయు వడఁకున్, గగుర్పాటు జనించెను.

గాండీవం స్రంసతే హస్తాత్, త్వక్చైవ పరిదహ్యతే
నచ శక్నో మ్యవస్థాతుం. భ్రమతీవ చ మే మనః 30

గాండీవము చెయిజాఱెన్, మే నెల్లఁ దగులంబడున్
క్షణమున్ నిలువం జాల, నా మనస్సు భ్రమించెను.

నిమిత్తాని చ వక్ష్యామి విపరీతాని కేశవ।
నచ శ్రేయోఽనుపశ్యామి, హత్వా స్వజన మాహవే. 31
ఎన్నో యపశకునంబుల్, గాంచు చుంటిని మాధవా !
యుద్ధములో మనవారిన్, జంపుట మంచి యెట్లగున్.

న కాంక్షే విజయం కృష్ణ!, న చ రాజ్యం సుఖానిచ
కిం నో రాజ్యేన గోవింద!, కింభోగై ర్జీవితేన వా? 32
కృష్ణా! విజయమున్ గోర, గోరన్ రాజ్యము సౌఖ్యమున్
ఏలా రాజ్యము భోగంబుల్, జీవితం బిది యేటికిన్.

యేషా మర్థేకాంక్షితం నో. రాజ్యం భోగాస్సుఖాని చ
త ఇమేఽవస్థితా యుద్ధే, ప్రాణాం స్త్యక్త్వాధనాని న 33
రాజ్యమున్ భోగముల్ సౌఖ్య, మేరికై కోరుచుంటిమో
వారిదే ప్రాణ ధనాశల్, వీడివచ్చిరి పోరుకై

ఆచార్యాః పితరః పుత్రాః తథైవచ పితామహాః
మాతులాశ్శ్వశురాః పౌత్రాః స్యాలాస్సంబంధిన స్తథా 34
గురుపుల్ తండ్రుల్ పుత్రుల్, తాతలు మేనమామలున్
మామగార్లును బౌత్రులు, బావల్ బంధులు వీరుగో.

ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోపి మధుసూధన !
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కింను మహీకృతే! 35
పైఁబడి చంపుచు నున్నన్, స్వర్గరాజ్యంబుకోసమున్
వీరిఁ జంప, నీభువికా, నేను జంపెద మాధవా !

నిహత్య ధార్తరాష్ట్రాన్నః, కా ప్రీతి స్స్యా జ్జనార్దన!
పాపమే వాశ్రయే దస్మాన్. హత్వైతా నాతతాయినః 36

ధార్తరాష్ట్రులఁ జంపినన్ మనకుం బ్రీతి యెట్లగున్
క్రూరులైనన్ వీరిఁ జంపఁ బాపంబె మన కంటును.

తస్మా న్నార్హా వయం హంతుం,
ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్
స్వజనం హి కథం హత్వా,
సుఖిన స్స్యామ మాధవ ! 37

కావున ధార్తరాష్ట్రులన్, బంధులఁ జంపఁ గూడదు
మనవారిఁ జంపియెట్టుల్, సౌఖ్య మందెద మచ్యుతా!

యద్య ప్యేతే న పశ్యంతి, లోభోపహత చేతసః
కులక్షయకృతం దోషం. మిత్రద్రోహేచ పాతకం. 38

వీరో యాసన్ మతిచెడి, వంశమున్ జంపుదోషమున్
మిత్రద్రోహపు బాపంబున్. వీక్షింపరుగదా మదిన్.

కథం న జ్ఞేయ మస్మాభిః, పాపా దస్మా న్నివర్తితుమ్
కులక్షయకృతం దోషం, ప్రపశ్యద్భి ర్జనార్దన! 39

వంశమున్ జంపుదోషంబు, వీక్షించు మన మైనను
ఈ పాప మంటిరా దంచు, నెఱుంగవలదే యిఁకన్.

కులక్షయే ప్రణశ్యంతి, కులధర్మా స్సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్నం అధర్మోఽభిభవత్యుత. 40

వంశనాశమునన్ బోవున్, బ్రాచీనకులధర్మముల్
ధర్మంబు పోవ నధర్మ, మెదుర్చు నెల్లవంశమున్.

అధర్మాభిభవా త్కృష్ణ!, ప్రదుష్యన్తి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ, జాయతే వర్ణసంకరః 41

అధర్మంబెదుర్పఁ గృష్ణా, స్త్రీలు పాడయి పోదురు
స్త్రీలు పాడయి పోవఁగా, సంకరంబగు వర్ణముల్.

సంకరో నరకాయైవ. కులఘ్నానాం కులస్యచ
పతంతి పితరో హ్యేషాం, లుప్తపిండోదక క్రియాః, 42
సంకరంబె నరకాగ్నిన్, గూల్చున్ గుల, కులఘ్నులన్
పిండోదకముల్ లోపించ భ్రష్టులౌదురు తత్పితల్.

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకర కారకైః
ఉత్సాద్యంతే జాతి ధర్మాః కుల ధర్మాశ్చ శాశ్వతాః 43
వివ: కులఘ్నులు – కులము నశింపఁజేసినవారు.
వర్ణసంకర మొందించు, కులఘ్నుల కుకర్మలన్
శాశ్వత కుల ధర్మంబుల్, వర్ణ ధర్మంబు పోవును,

ఉత్పన్న కుల ధర్మాణాం, మనుష్యాణాం, జనార్దన !
నరకే నియతం వాసో, భవతీ త్యనుశుశ్రుమ 44
వర్ణధర్మాలు పోయినన్, మనుజుల్ నరకంబులోఁ
దప్పక వసింతు రంచున్, వింటిమిగాదె మాధవా!

అహో! బత! మహత్పాతం కర్తుం వ్యవసితా వయమ్!
యద్రాజ్య సుఖలోభేన, హంతుం స్వజన ముద్యతాః 45
రాజ్యసౌఖ్యములం దాశన్, మావారిం జంపఁ బూని మే
మయ్యో! యెంత మహాపాప మాచరింపఁగ నుంటిమి

యది మా మప్రతీకారం. అశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యుః, తన్మే క్షేమతరం భవేత్ 46
పగయున్ శస్త్రముల్ వీడి యున్న నన్నొకవేళ నీ
ధార్తరాష్ట్రులు శస్త్రంబుల్. పూని చంపిన మంచిదే

సంజయ ఉవాచ :

ఏవముక్త్వాఽర్జున స్సంఙ్ఖ్యే, రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం, శోక సంవిగ్న మానసః 47

సంజయుఁ డనియె :

పార్థుఁ డిట్లని యాజిలో, నెక్కుడు విల్లు వీడియే
చింతస్ మతి చెడిపోవన్ గూలంబడె రథంబుపై.

ఇతి శ్రీమద్వేదవ్యాస రచిత భగవద్గీతాసు
ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
అర్జునవిషాదయోగో నామ
ప్రథమోఽధ్యాయః

ఇది

శ్రీమద్వేదవ్యాసమహర్షిరచిత భగవద్గీతలందు నుపనిషత్తులందు
బ్రహ్మవిద్య యందు, యోగశాస్త్రమందు, శ్రీకృష్ణార్జున
సంవాదమందు జనక గురువర చర్ల నారాయణశాస్త్రి
కరుణాలబ్ధ విద్యుఁడును, వెంకమాంబా
పుత్రుఁడునగు గణపతిశాస్త్రిచే దెనిగింప
బడిన తెనుఁగు గీత యందు
అర్జున విషాదయోగమను
మొదటి అధ్యాయము.

— () —

# శ్రీమద్భగవద్గీతా

ద్వితీయోఽధ్యాయః

సాంఖ్యయోగః

# తెనుఁగు గీత

రెండవ అధ్యాయము

సాంఖ్యయోగము

సంజయ ఉవాచ :

తం తథాకృపయావిష్టం, అశ్రుపూర్ణాకులేక్షణమ్
విషీదంత మిదం వాక్యం, ఉవాచ మధుసూదనః. 1

సంజయుఁడనియె :

ఇట్లు దైన్యంబు పైకొనఁ గన్నీళ్ళునిండు కండ్లతో
దుఃఖించుచున్న యర్జునుఁ, జూచి శ్రీకృష్ణు డిట్లనెన్.

వివ:- జీవబ్రహ్మల యైక్యమును దానిని బోధించు శ్రవణాదు లును సంఖ్యానించఁబడును. వివరింపఁబడును గాన సాంఖ్య మని వ్యుత్పత్తి.

శ్రీ భగవానువాచ :

కుత స్త్వాకశ్మల మిదం విషమే సముపస్థితం
అనార్యజుష్ట మస్వర్గ్యం, అకీర్తికరమర్జున ! 2

విషమవేళ మోహంబు, పొందెదవేటికర్జునా!
ఆర్యుల్ మెచ్చరు స్వర్గమా, రా, దిది కీర్తిగూర్చదు.

క్లైబ్యం మాస్మగమః పార్థ, నైతత్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం, త్వక్త్వోత్తిష్ఠ పరంతప 3

బేల్లపై పోకు; మియ్యది, నీకుఁ గూడదు నీచమౌ
మనోదౌర్భల్యమున్ వీడి, పార్థ! వేగమె లెమ్మికన్

అర్జున ఉవాచ :

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హౌ వరిసూదన! 4

అర్జునుఁ డనియె :

భీష్మద్రోణుల్ కడు పూజ్యుల్, యుద్ధములోన వారలన్
వాఁడియౌ బాణములతో, వెట్లు గొట్టుదుఁ గేశవా!

గురూ న హత్వాహి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష మపీహ లోకే
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్. 5

ఈ మహాత్ము లౌ గురుల వధించకుండ
నవని బిచ్చమెత్తి తినుటయైన మేలు
ఎన్నొ యాశల్‌గల గురుల నిందె చంపి
బొక్కుదున నెత్తుటందోగు భోగములను.

నచైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః
యానేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః 6

ఏది శ్రేష్ఠమైనదియొ మే మెఱుఁగ మిందు
ఏము గెల్తుమొ వారె జయింతురొక్కొ
ఎవరిఁ జంపి జీవింప వాంఛింప దలఁప
మట్టిధార్తరాష్ట్రులు వీరె యిందు గలరు.

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం. 7

దైన్యమున నా స్వభావమౌ ధైర్యమడఁగె
జడుఁడనై ధర్మమెఱుఁగక యడుగుచుంటి
ఏది మంచిదొ యిట నిశ్చయించి చెపుమి
యాశ్రయించితి శిష్యుండ నానతిమ్ము.

న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణాం
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యం. 8

ఏకఛత్రాధిపత్యంబున్, స్వర్గరాజ్యముఁ బొందినన్
మర్మముల్ చీల్చు నీబాధ, పోవునా యెఱుఁగన్గదా.

సంజయ ఉవాచ :

ఏవ ముక్త్వా హృషీకేశం, గుడాకేశః పరంతప
న యోత్స్య ఇతి గోవిందం, ఉక్త్వా తూష్ణీంబభూవహ 9

సంజయుఁ డనియె :

ఇట్లు శ్రీకృష్ణునిం బల్కి, శత్రులన్ జంపు పార్థుఁడున్
అంత యుద్ధంబు నేఁజేయ, నని కూర్చుండె నూరకే.

త మువాచ హృషీకేశః ప్రహస న్నివ భారత !
సేనయో రుభయో ర్మధ్యే, విషీదంత మిదం వచః 10

భారతాన్వయ! యీరీతి, రెండు సేనలమధ్యలో
దుఃఖించు పార్థుఁ గన్గొని, నవ్వుచుం గృష్ణుడిట్లనెన్

శ్రీభగవా నువాచ :

అశోచ్యానన్వశోచస్త్వం, ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ నగతాసూం శ్చ, నానుశోచంతిపణ్డితాః 11

శ్రీ భగవానుఁడనియె :

దుఃఖింపరానివారికై, కుందెదు; బోధ చేసెదు
ఉన్నవారిన్ జన్నవారి, సెంచి కుందరు పండితుల్.

నత్వే వాహం జాతునాసం, న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామః, సర్వే వయ మతః పరం 12

నీవు, నేఁ పేరాజు లెప్డున్, కానివారము కా మిలన్.
మన మందర మింక ముం దుండకపోము ఫల్గునా!

దేహినోఽస్మిన్ యథాదేహే, కౌమారం యౌవనం జరా
తథా దేహాంరత ప్రాప్తిః, ధీర స్తత్ర న ముహ్యతి.. 13

బాల్య యౌవన వార్ధక్యా, లీమేన నాత్మ పొందు వ
ట్లైన్నొ మేనుల్ గనున్, దీన మోహ మొందండు ధీరుడు

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ! శీతోష్ణ సుఖదుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యాః, తాం స్తితిక్షస్వ భారత !
విషయేంద్రియ సంసక్తిన్, శీతోష్ణసుఖదుఃఖముల్
గల్గు: నివి వచ్చుంబోవు, ననిత్య మివి సైచుమీ

యం హి న వ్యథయంత్యేతే, పురుషం పురుషర్షభ !
సమదుఃఖసుఖం ధీరం, సోమృతత్వాయ కల్పతే. 15
సుఖంబున్ దుఃఖంబున్ గూడ సమానంబుగ జూచుచు
శీతాది బాధ పొందని, వారే మోక్షంబు గాంతురు.

నాసతో విద్యతే భావో, నాఽభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః 16
లేనిది యుండదెప్పుడు, నున్నది పోవదెన్నండున్
తత్త్వ వేత్తలె యీ రెంటి, నిశ్చయించిరి యిట్టులన్.

అవినాశి తు తద్విద్ధి, యేన సర్వ మిదం తతం
వినాశ మవ్యయస్యాస్య, న కశ్చి త్కర్తు మర్హతి. 17
ఎల్లెడన్ గలయాత్మకు, నాశంబులేదు చూడుమీ
నాశంబులేని దినిని, జంపగాజాలడెవ్వడున్

అన్తవంత ఇమే దేహా, నిత్యస్యోక్తాశ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య, తస్మా ద్యుధ్యస్వ భారత! 18
ప్రమాణంబులకందక, నాశంబులేక నిత్యమై
దేహయాత్మకున్ మేనె, నశించుం గానం బోరుమీ.

యఏనం వేత్తి హంతారం, యశ్చైనం మన్యతే హతం
ఉభౌ తౌ న విజానీతో, నాయం హంతి న హన్యతే. 19

"ఈ యాత్మ చంపఁబడును, ఈ యాత్మ చంపు" నన్న యీ
యిద్దఱెఱుంగ, రాయాత్మ చంపబడదు చావదు.

న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. 20

పుట్టదది చావదది యెప్పుడును గూడ
పుట్టి యింక ముందు లేకయుండఁబోదు మరల
పుట్టనిది నిత్యము, స్థిరంబు, ముప్పటియది
చావదది యీ శరీరంబు చంపఁబడిన.

వేదాఽవినాశినం నిత్యం. య ఏన మజ మవ్యయం
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హన్తికం 21

"ఆత్మ పోనిది నిత్యంబు, పుట్టదు మార్పులేనిది"
యని యెఱుంగు మర్త్యుండు, చంపుఁ జంపించు నెవ్వనిన్

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ. 22

ఎట్టులు నరుండు చిరిగిన బట్టలూడ్చి
తగిన సరిక్రొత్త బట్టలు దాల్చుచుండు

అట్లె యీ యాత్మ జీర్ణదేహముల విడిచి
తగిన సరిక్రొత్త దేహముల్ దాల్చుచుండు.

నైనం ఛిందంతి శస్త్రాణి, నైనం దహతి పావకః
నచైనం క్లేదయంత్యాపో, నశోషయతి మారుతః 23

అస్త్రంబుల్ చీల్చలేవాత్మన్, గాల్పలే దగ్ని యాత్మను
ఆత్మన్ నీళ్ళు తడుపలే, వార్పగాలేవు గాలులున్.

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయుం
అక్లేద్యోఽశోష్య ఏవ చ
నిత్య స్సర్వగతః స్థాణుః
అచలోఽయం సనాతనః. 24

చీల్పరాక, కాల్పరాక, తడ్పరా, కార్పరాకయున్
నిత్య మెల్లెడ నున్నదై, నిశ్చలమాత్మ స్థాణువౌ.

అవ్యక్తోఽయ మచింత్యోఽయం
అవికార్యోఽయ ముచ్యతే
తస్మాదేవం విదిత్వైనం
నానుశోచితు మర్హసి. 25

ఆత్మ స్పష్టంబు గానిది, భావన కందరానిది
మార్పు లేని దనంబడుఁ, దెలిసి చింత యేటికిన్.

అథచైనం నిత్యజాతం, నిత్యం వా మన్యతే మృతం
తథాపి త్వం మహాబాహో! నైనం శోచితు మర్హసి 26

పోని యీ యాత్మ యెప్పుడున్ బుట్టుచు, నెప్డు చచ్చుచున్
ఉండు నని తలంతువే, నట్లయ్యుఁ జింత యేటికిన్.

జాతస్య హి ధ్రువో మృత్యుః, ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యేఽర్థే, న త్వం శోచితు మర్హసి. 27

పుట్టినవాడు చచ్చుట, చచ్చినవాఁడు పుట్టుట
తప్పదు, కానఁ దప్పని, దీనికై చింత యేటికిన్

అవ్యక్తాదీని భూతాని, వ్యక్తమధ్యాని భారత
అవ్యక్త నిధనా న్యేవ, తత్ర కా పరిదేవనా? 28

పుట్టిన ముస్పెందున్నదో, చచ్చిన నెందు నుండునో
ప్రాణిం బుట్టిననే చూతు, మిందుకై చింత యేటికిన్.

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేనం
ఆశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవ చ్చైన మన్యః శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్. 29

వింతవలె దీనినొక్కడు వేడ్కఁజూచు
వింతవలె దీనినొక్కడు వేడ్క పలుకు
వింతవలె దీని నొక్కఁడు వేడ్క వినును
వినియు దీని నొక్కడు దెల్పికొనఁగ లేఁడు.

దేహీ నిత్య మవధ్యోఽయం, దేహే సర్వస్య భారత
తస్మా త్సర్వాణి భూతాని, న త్వం శోచితు మర్హసి. 30

అందఱ మేనులందున్న, యీ యాత్మ చంపరానిది
కాన నెల్ల ప్రాణులకై, దుఃఖింపదగదర్జునా!

స్వధర్మ మపి చావేక్ష్య, న వికంపితు మర్హసి
ధర్మ్యాద్ధియుద్ధా చ్ఛ్రేయోఽన్యత్, క్షత్రియస్య
నవిద్యతే. 31

స్వధర్మ మరసి యైనన్, చలింపకుంట యుక్తము
ధర్మయుద్ధంబుకంటెను, మేలేది క్షత్రియాళికిన్.

యదృచ్ఛయా చోపపన్నం, స్వర్గద్వార మపావృతమ్
సుఖినః క్షత్రియాః పార్థా!, లభంతే యుద్ధమీదృశమ్. 32

కోరకె వచ్చు యుద్ధంబు, తెరవఁబడ్డ స్వర్గమే.
అట్టిదానిని గాంతురు, భాగ్యవంతులు క్షత్రియుల్.

అథచేత్త్వ మిమం ధర్మ్యం, సంగ్రామం న కరిష్యసి
తతః స్వధర్మం కీర్తించ, హిత్వా పాప మవాప్స్యసి. 33

వివ:_స్వధర్మ మనఁగా స్వవర్ణధర్మ మనిపూర్వులు తనకు స్వభావ
సిద్ధమగు ధర్మ మని నవీనులు.

మఱి నీవీధర్మ్యయుద్ధ, మొనరింపక యుంటివా
యింక స్వధర్మమున్ గీర్తిన్, వీడి గాంతువు పాపమున్

అకీర్తిం చాపి భూతాని, కథయిష్యంతి తేఽవ్యయాం
సంభావితస్యా చాఽకీర్తిః, మరణా దతిరిచ్యతే. 34

లోకంబుల్ నీకపకీర్తిన్, వచించున్ శాశ్వతంబుగా
మానఘని కపకీర్తి, కంటెను జావె మేలగున్.

భయా ద్రణా దుపరతం
మన్యంతేత్వాం మహారథాః
యేషాం చ త్వం బహుమతో
భూత్వా యాస్యసి లాఘవం. 35

భీతిన్ యుద్ధము మానితి, వనుకొంద్రు మహారథుల్
వేరి మన్నన లందితో, వారికిన్ జుల్కనౌదువు.

అవాచ్యవాదాం శ్చ బహూన్, వదిష్యంతి తవాఽహితాః
నిందంత స్తవసామర్థ్యం, తతో దుఃఖతరం ను కిం? 36
నీ శక్తిన్ నిరసించుచు, నీ శత్రుల్ మాటలెన్ని యో
యనరాని పందుౕ, దీనిన్ మించిన దుఃఖమున్న దే.

హతో వా ప్రాప్స్యసి స్వర్గం, జిత్వా వా భోక్ష్యసేమహీం
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ, యుద్ధాయ కృతనిశ్చయః 37
చత్తువా స్వర్గమెందెదు. గెల్తువా రాజ్యమేలెదు
కాన నర్జున! లేవోయి, యుద్ధంబుచేయు పూన్కితో.

సుఖదుఃఖే సమేకృత్వా, లాభాఽలాభౌ జయా_జయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ, నైవం పాపమవాప్స్యసి 38

వివ :- యుద్ధము చేయుము. పోరుమని చెప్పినచోటనెల్ల స్వ
ధర్మమైనయుద్ధములో నిష్కామముగా నీవిధి కృత్యము
చేయుమని యర్థము గ్రహించుకొనవలెను.

ఓటమి గెల్పు లాభంబు, నష్టంబు సుఖదుఃఖముల్
సమముగా నెంచి పోరు, మంటదు పాపమిట్టిదో

ఏషా తేఽభిహితా సాంఖ్యే, బుద్ధి ర్యోగేత్విమాం శృణు
బుద్ధ్యాయుక్తో యయాపార్థ, కర్మబంధం ప్రహాస్యసి. 39
సాంఖ్యబుద్ధినిజెప్పితి, యోగబుద్ధిని విన్మంకన్
ఆబుద్ధితోడఁ గూడినఁ గర్మబంధంబు లంటవు

వివ :- సాంఖ్యబుద్ధి=తత్త్వవివేకజ్ఞానము: యోగబుద్ధిని తత్త్వ
వివేకజ్ఞానప్రాప్తికి ఉపాయమయిన కర్మాచరణజ్ఞానము

నేహాభిక్రమ నాశో஽స్తి, ప్రత్యవాయో నవిద్యతే
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్ 40
యోగసాధన వృధగా, దిందేమిలేదు దోషమున్
యోగధర్మంబు సుతైన, నెంతటిభీతిఁ గాంచును.

వ్యవసాయాత్మికా బుద్ధిః, ఏకేహ కురునందన
బహుశాఖా హ్యనన్తాశ్చ, బుద్ధయో஽వ్యవసాయినాం. 41
నిశ్చయబుద్ధి యొక్కటె, యీ యోగ ముందు నిల్పమీ
నిశ్చయ శూన్యమూఢుల, బుద్ధులెన్నొ యనంతముల్

యా మిమాం పుష్పితాం వాచం, ప్రవదంత్యవివశ్చితః
వేదవాదరతాః పార్థ!, నాన్యదస్తీతి వాదినః 42
వేదార్థవాదముల్ నమ్మి, స్వర్గాది ఫలకర్మలే
తక్క వేరెవ్వి లేవంచు, వాదింతు తీయగా జడుల్

వివ:- వేదార్థ వాదములను =కర్మకాండయెగాని వేటే జ్ఞాన కాండము లేదనిచెప్పు వేదమందలి యర్థవాదములను.

కామాత్మాన స్స్వర్గపరాః జన్మకర్మఫల ప్రదాం
క్రియావిశేష బహులాం, భోగైశ్వర్యగతిం ప్రతి. 33
కాములై స్వర్గపరులై, కర్మఫలంబు స్వర్గమున్
భోగైశ్వర్యము లొసంగు కర్మనె మెత్తు రా జడుల్

భోగైశ్వర్య ప్రసక్తానాం, తయా஽పహృత చేతసాం
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే. 44
భోగైశ్వర్యములన్ జిక్కి కర్మాసక్తిన్ బుద్ధిపోయిన
మూఢుల మదిఁ గొంచెమున్, నిశ్చయబుద్ధియుండదు.

వివ :- కర్మోక్తిని = కర్మవిశేషములతో నిండిన వాక్కుచే

త్రైగుణ్యవిషయా వేదాః, నిస్త్రైగుణ్యో భవాఽర్జున!
నిర్ద్వంద్వో నిత్యసత్త్వ, నిర్యోగక్షేమ ఆత్మవాన్. 45

వేదంబుల్ త్రిగుణాత్మంబుల్, గుణాతీతుడవై సదా
సత్త్వమొంది జతల్దాటి, మేన్చూడ కాత్మఁ గాంచుమీ

వివ:- త్రిగుణాత్మములు=సత్త్వ రజ స్తమోగుణ మయ మగు
ప్రపంచమునుగూర్చి తెలుపునని, జతలు=సుఖ దుఃఖాది
ద్వంద్వములు.

యావా నర్థ ఉదపానే, సర్వతః సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు, బ్రాహ్మణస్య విజానతః 46

ఎల్లెడ నిండినీరుండ, నూతు లెం తువయోగమో
అంతే ప్రయోజనం బెల్ల వేదంబుల్ బ్రహ్మవేత్తకున్.

వివ:- స్వల్పానందములు బ్రహ్మానందములోని భాగములే గాని
బ్రహ్మానంద వేత్తకు స్వల్పానంద మిచ్చు కామ్య కర్మ
లను దెలుపు వేదములందు స్వల్ప ప్రయోజనమే కలుగును
గాన బ్రహ్మానందమునకై నిష్కామబుద్ధితోం గర్మ చేయవల
యునని భావము.

కర్మణ్యే వాధికార స్తే, మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూః, మాతేసంగోఽస్త్వ కర్మణి. 47

కర్మ చేయుటె నీ హక్కు, హక్కులేదు ఫలేచ్ఛకున్
కర్మఫల హేతు గాకు, మట్లని కర్మ మానకు.

వివ :_ కర్మఫల హేతువు = కర్మఫలమగు జన్మకు కారణము.

యోగస్థః కురు కర్మాణి, సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోః సమోభూత్వా, సమత్వం యోగ ఉచ్యతే 48
సిద్ధి యైనను గాకున్నన్, సముండవై యవాంఛతో
యోగివై కర్మచేయుము, యోగం బన సమత్వము.

దూరేణ హ్యవరం కర్మ, బుద్ధియోగా ద్ధనంజయ!
బుద్ధౌ శరణ మన్విచ్ఛ, కృపణాః ఫలహేతవః 49
సమబుద్ధి కర్మకంటెన్, ఫలకర్మలు నీచముల్
సమబుద్ధి నాశ్రయించు, దీనుల్ కర్మఫల ప్రియుల్.

బుద్ధియుక్తో జహా తీహ, ఉభే సుకృత దుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వ, యోగః కర్మసు కౌశలమ్ 50
సమబుద్ధి గలవాని, ముట్టవు పాపపుణ్యముల్
యోగ మూనుము, సమత్వ కర్మల నేర్పు యోగము

కర్మజం బుద్ధియుక్తా హి ఫలంత్యక్త్వా మనీషిణః
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛ న్త్యనామయమ్. 51
సమ బుద్ధిగల ప్రాజ్ఞుల్, కర్మఫలంబు గోరక
జన్మబంధంబులం ద్రెంచి, కాంతు రక్లేశ మోక్షమున్.

వివ:_ అక్లేష = రాగద్వేషాది క్లేశములు లేని.

యదా తే మోహకలిలం, బుద్ధి ర్వ్యతి తరిష్యతి
తదా గంతాసి నిర్వేదం, శ్రోతవ్యస్య శ్రుతస్యచ. 52
మోహపంకంబు నేనాఁడు, నీ బుద్ధి దాటిపోవునో
ఆనాఁడు విన్నది వినన్, దగ్గదిలేదు నీ కిలన్.

శ్రుతివిప్రతిపన్నా తే, యదా స్థాస్యతి నిశ్చలా
సమాధా వచలా బుద్ధిః తదా యోగ మవాప్స్యసి. 53

అది యిది వినిచెడి, నీ బుద్ధి యెపుడాత్మలోఁ
జలింపక యచలమౌనాఁడె, పొందెదు యోగమున్.

అర్జున ఉవాచ :

స్థితప్రజ్ఞస్య కా భాషా, సమాధిస్థస్య కేశవ !
స్థితధీః కిం ప్రభాషేత ? కి మాసీత వ్రజేత కిమ్ ? 54

అర్జునుఁ డనియె :

ఏవి సమాధిలోనున్న, స్థితప్రజ్ఞుని గుర్తులు
స్థితప్రజ్ఞుం డెటు వల్కున్, గూర్చుండు నెట్లు నడ్చునుః

శ్రీ భగవా నువాచ :

ప్రజహాతి యదా కామాన్, సర్వాన్‌పార్థ ! మనోగతాన్
ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. 55

శ్రీ భగవానుఁ డనియె :

ఎల్లకోర్కెల వర్జించి, యాత్మయందునె యాత్మచే
ఆనందమొందు నాతండె, స్థితప్రజ్ఞుఁడు ఫల్గునా !

దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః
వీత రాగ భయ క్రోధః. స్థితధీ ర్ముని రుచ్యతే. 56

దుఃఖంబులందుఁ గుందక, సౌఖ్యమం దిచ్ఛలేకయున్
వెతల్ కోర్కెల్ వగల్‌లేని, మౌనియె స్థిరబుద్ధియౌ.

యః సర్వ త్రానభిస్నేహః, తత్తత్ ప్రాప్య శుభాశుభం
నాభినందతి న ద్వేష్టి, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 57

ఎల్లెడన్ వాంఛలన్ వీడి, శుభాశుభంబు లొందియున్
లోనుబ్బక ద్వేషింపని, వానిప్రజ్ఞ స్థిరంబగున్.

యదా సంహరతే చాయం, కూర్మోఽంగా నీవ సర్వశః
ఇంద్రియా ణీంద్రియా ర్థేభ్యః, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా 58

తాఁబే లంగాల్ ముడుచునట్లు, లింద్రియంబుల నెల్లెడన్
తోర్కెలనుండి మళ్లించు, వానికోర్కె స్థిరంబగున్.

విషయా వినివర్తంతే, నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య, పరం దృష్ట్వా నివర్తతే. 59

తిండి తినని దేహిని. చేరవు విషయావళుల్
వాంఛయే యుండు నద్దియున్, బోవుంజూచి పరాత్పరున్

విష:- విహయావళులు - శబ్ద, స్పర్శాది విషయములు.

యతతో హ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని, హరంతి ప్రసభం మనః 60

ఎంత యత్నించుచుండినన్, ప్రాజ్ఞుని ఇంద్రియంబులు
క్షోభపెట్టుచు బలిమిన్, మనస్సున్ లాగు నర్జునా!

తాని సర్వాణి సంయమ్య, యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేన్ద్రియాణి, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 61

శ్రద్ధతో వానిన్ బంధించి, నన్ నమ్మి యుండఁగావలెన్
వేని కింద్రియముల్ లొంగున్, వానిప్రజ్ఞ స్థిరంబగున్

ధ్యాయతో విషయాన్ పుంసః
సంగస్తేషూపజాయతే
సంగాత్ సంజాయతే కామః
కామాత్ క్రోధోఽభిజాయతే. 62

విషయంబుల ధ్యానించు, ప్రాణుల కందె ప్రీతియా
ప్రీతిచేఁ గోర్కె పుట్టును, గోర్కెచేఁ బుట్టుఁ గ్రోధమున్.
వివ: - క్రోధము = అధికాభినివేశము.

క్రోధా ద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశః, బుద్ధినాశాత్ ప్రణశ్యతి. 63

క్రోధంబుచేత మోహం బౌ, మోహంబుచే స్మృతుల్ చనున్
స్మృతి పోవన్ మతి పోవున్, మతి పోవ క్షయంబెయా.

రాగద్వేషవియుక్తైస్తు, విషయా నింద్రియై శ్చరన్
ఆత్మవశ్యై ర్విధేయాత్మా, ప్రసాద మధిగచ్ఛతి. 64

రాగద్వేషములన్ వీడి, లొంగిన యింద్రియాళితో
విషయాళిన్ జరించుచు, జితాత్ముఁ డొందు శాంతమున్.

ప్రసాదే సర్వ దుఃఖానాం; హాని రస్యోపజాయతే
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. 65

శాంతి యేర్పడ నీ జ్ఞాని, బాధలెల్ల నశించును
వేగన్ నిర్మల చిత్తుని, బుద్ధియు నిశ్చలం బగున్.

నాస్తి బుద్ధి రయుక్తస్య, న చాయుక్తస్య భావనా
న చాభావయత శ్శాంతిః, అశాంతస్య కుతస్సుఖమ్ 66

శ్రద్ధాశూన్యున్ విడున్ బుద్ధి, నిర్బుద్ధిన్ విడు భావనల్
భావశూన్యున్ విడున్శాంతి, యశాంతున్ విడు సౌఖ్యముల్

ఇంద్రియాణాం హి చరతాం, యన్మనోఽనువిధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం, వాయుర్నావ మివాంభసి 67

ఇంద్రియంబుల్ విషయాళిఁ, జరింప నుండు చిత్తమే
నావన్ నీట గాలివలెన్, వాని ప్రజ్ఞ హరించును.

తస్మాద్యస్య మహాబాహో!, నిగృహీతాని సర్వశః
ఇంద్రియా ణీంద్రియార్థేభ్యః, తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా 68

కాన నర్జున! యెవాఁడు, విషయంబులనుండి తా
నింద్రియంబుల్ నియమించున్, వాని ప్రజ్ఞ స్థిరంబగున్.

యా నిశా సర్వభూతానాం, తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని, సా నిశా పశ్యతో మునేః 69

సర్వప్రాణి కెదిరాత్రో, యందే సంయమి మేల్కొనున్
ప్రాణి మేల్కొంచు కాలంబే, రాత్రియాఁ జూచు మౌనికిన్

ఆపూర్వమాణ మచల ప్రతిష్ఠమ్
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్
తద్వ త్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి న కామ కామీ. 70

మిగుల నిండియుఁ గదలక మెదలకుండు
నంబుధిని జొచ్చి నదు లైక్య మందు నట్టుల
నెల్లకోర్కెలు తనలోన నిలుపువాఁడు
శాంతిఁ గనుఁ గోర్కె గలవాఁడు శాంతి గనఁడు.

విహాయకామాన్ యస్సర్వాన్, పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి. 71

కోర్కెలెల్లను వర్జించి, స్పృహలేక చరించుచున్
నాది నేనులు వీడినవాఁడె, శాంతి బొందును.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ!, నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి, బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. 72

ఇదే బ్రహ్మమొందు రీతి, దీనిఁ గాంచ భ్రమల్ చనున్
ఇందున్నఁ జివరినాఁడున్ బ్రహ్మనిర్వాణమే గమన్.

ఇతి శ్రీమద్వేదవ్యాస రచిత భగవద్గీతాసు
ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
సాంఖ్య యోగో నామ
ద్వితీయోఽధ్యాయః

ఇది

శ్రీమద్వేదవ్యాసమహర్షిరచిత భగవద్గీతలందు నుపనిషత్తులందు
బ్రహ్మవిద్య యందు, యోగశాస్త్రమందు, శ్రీకృష్ణార్జున
సంవాదమందు జనక గురువర చర్ల నారాయణశాస్త్రి
కరుణాలబ్ధ విద్యుఁడును, వెంకమాంబా
పుత్రుఁడునగు గణపతిశాస్త్రిచే దెనిగింప
బడిన తెనుఁగు గీత యందు
సాంఖ్య యోగమను
రెండవ అధ్యాయము.

— () —

# శ్రీమద్భగవద్గీతా

## తృతీయోఽధ్యాయః

## కర్మయోగః

# తెనుఁగుగీత

## మూడవ అధ్యాయము

## కర్మయోగము

అర్జున ఉవాచ :

జ్యాయసీ చే త్కర్మణ స్తే, మతా బుద్ధి ర్జనార్దన!
త త్కిం కర్మణి ఘోరే మాం, నియోజయసి కేశవ! 1

అర్జునుఁ డనియె :

కర్మకంటెను జ్ఞానంబు, నీవు మేలంచు నెంచితే
మఱి యీ ఘోరపుఁ గర్మన్, ద్రోయుదువేల మాధవా! 1

వ్యామిశ్రే ణేవ వాక్యేన, బుద్ధిం మోహయ సీవ మే
తదేకం వదనిశ్చిత్య, యేన శ్రేయోఽహ మాప్నుయాం. 2

కంగారుపెట్టు మాటల, నా బుద్ధిన్ మోహ పెట్టిద
విందేది మేలు గూర్చునో, నిశ్చయించి వచింపుమీ.

శ్రీ భగవా నువాచ :

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ
జ్ఞానయోగేన సాంఖ్యానాం, కర్మయోగేన యోగినామ్.

శ్రీ భగవానుఁ డనియె :

జ్ఞానయోగముచే సాంఖ్యుల్, కర్మయోగాన యోగులున్
సిద్ధిపొంద భువిన్ మున్ను, చెప్పితిన్ రెండు పద్ధతుల్.

వివ:- బ్రహ్మచర్యము నుండియే జ్ఞానముచే సిద్ధి పొందుట మొదటి పద్ధతి. బ్రహ్మచర్యము పిదప గార్హస్థ్యాది కర్మలు చేయుచు సిద్ధి పొందుట రెండవ పద్ధతి యని శంకరాచార్యులు.

న కర్మణా మనారంభాత్, నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
న చ సన్న్యసనా దేవ, సిద్ధిం సమధిగచ్ఛతి. 4

కర్మలు చేయని మాత్రనె, ప్రాణి నిష్కర్మి కాఁడిలన్
కర్మల్ త్యజించినన్‌గూడ, సిద్ధిని బొందఁ డర్జునా!

న హి కశ్చిత్ క్షణ మపి, జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ, సర్వః ప్రకృతిజై ర్గుణైః. 5

క్షణమున్ కర్మ చేయని, పూరుషుఁ డుండఁ డెప్పుడున్
ప్రకృతి గుణ వశులై, కర్మ చేయుదు రెల్లరున్.

కర్మేంద్రియాణి సంయమ్య, య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా, మిథ్యాచారస్స ఉచ్యతే. 6

ఇంద్రియంబులు బంధించి, విషయంబుల్ మనస్సుచే
ధ్యానించుచుండు మూఢుండు, మిథ్యాచారుఁ డనంబడున్.

య స్త్వింద్రియాణి మనసా, నియ మ్యారభతేఽర్జున!
కర్మేంద్రియైః కర్మయోగం, అసక్త స్స విశిష్యతే. 7

ఇంద్రియంబుల్ మనస్సుచే, బంధించి కర్మయోగమున్
కర్మేంద్రియంబులం జేయఁ బూనువాఁడె ఘనుండగున్.

నియతం కురు తర్మత్వం, కర్మ జ్యాయోహ్య కర్మణః
శరీరయాత్రాపి చ తే, న ప్రసిద్ధ్యే దకర్మణః 8
కర్మల్ తప్పక చేయుమి, మానుటకంటెఁ జేయుటే
మే, లిట్లు కర్మ వీడినన్, వెళ్ళదు దేహయాత్రయున్.

యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర, లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మకౌంతేయ, ముక్తసంగ స్సమాచర. 9
యజ్ఞార్థముకాని కర్మల్, లోకంబులకు బంధముల్
యజ్ఞార్థమై యనాసక్తిన్, కర్మలన్ జేయు మర్జునా.
వివ:- యజ్ఞ మన ఈశ్వరుఁడని శంకరుడు, దీనజన సేవయు
పరోపకార జ్ఞానాదులును.

సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా, పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వం, ఏషవోఽస్త్విష్టకామధుక్. 10
యజ్ఞంబుతోఁ బ్రజన్ జేసి, దీనిచే వర్ధిలుం డిదే.
మీ కోర్కెల కామధేను, వని విధాత మున్నెనెన్.

దేవాన్ భావయ తానేన, తే దేవా భావయంతు వః
పరస్పరం భావయన్తః, శ్రేయః పర మవాప్స్యథ. 11
దీనిచే దేవులన్ బెంచుఁ, డాదేవుల్ మిముఁ బెంతురు
ఇట్లొండొరుఁ బెంచుకొంచున్, గొప్ప శ్రేయస్సు లందుఁడీ.

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా, దాస్యంతే యజ్ఞభావితాః
తైర్దత్తా నప్రదాయైభ్యో, యోభుంక్తే స్తేన ఏవ సః 12
యజ్ఞ వంతృప్తులా దేవుల్, మీకిత్తురిష్టభోగముల్
వారికీయ కవి తానే, భుజించువాడు దొంగయా.

యజ్ఞశిష్టాశిన స్సంతో, ముచ్యంతే సర్వకిల్బిషైః
భుంజతే తేత్వఘం పాపాః, యేవచం త్యాత్మకారణాత్. 13
యజ్ఞశేషంబు భక్షించు, వారి నేపాప మంటదు
తా మొక్కరె వండి మ్రింగు, పాపుల్ పాపమె తిందురు'

అన్నాద్భవంతి భూతాని, పర్జన్యా దన్న సంభవః
యజ్ఞాద్భవంతి పర్జన్యో, యజ్ఞకర్మః సముద్భవః 14
ప్రాణులన్నంబుచేఁ బుట్టు నన్నంబు మబ్బుచే నగున్
మబ్బు యజ్ఞంబుచేఁ బుట్టు యజ్ఞంబు కర్మచే నగున్.

అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్య ముపతిష్ఠతే
ఆదిత్యా జ్జాయతే వృష్టిః, వృష్టె రన్నం తతః ప్రజాః.
(అని మనుస్మృతి)

వివ :- అగ్నియందు వేల్వఁబడిన యాహుతి సూర్యుని బొందుననియు, సూర్యునివల్ల వర్షము, వర్షమువల్ల ఆహారము, అహారమువల్ల ప్రాణులు గలుగునని మనుస్మృతి.

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం
తస్మాత్సర్వగతం బ్రహ్మ, నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. 15
కర్మ బ్రహ్మంబుచేఁ బుట్టు, బ్రహ్మ మక్షరుచే నగున్
కాన నెల్లెడ నా బ్రహ్మ, మెప్పుడు యజ్ఞమం దగున్.

ఏవం ప్రవర్తితం చక్రం, నానువర్తయ తీహ యః
అఘాయు రింద్రియారామో, మోఘం పార్థ! స జీవతి. 16
ఎవం డిట్లు ప్రవర్తిల్లు లోకచక్రము త్రిప్పఁడో
యా పాపి యింద్రియాశితోః, గీడించి బ్రతుకున్ వృథా.

యస్త్వాత్మరతి రేవ స్యాత్, ఆత్మతృప్తశ్చ మానవః
ఆత్మన్యేవ చ సంతుష్టః తస్యకార్యం న విద్యతే. 17
ఆత్మయందే విహరించి, ఆత్మలోఁ దృప్తి పొందుచున్
ఆత్మయందే చొక్కువాఁడు, చేయుకార్యము లే దికన్.

నైవతస్య కృతేనార్థో, నాఽకృతే నేహ కశ్చన
న చాస్య సర్వభూతేషు, కశ్చి దర్థ వ్యపాశ్రయః 18
కర్మలోఁ బనిలేదింక, మానిన లేదు దోషమున్
ఏ ప్రాణి నాశ్రయించెడు, పని వీనికి లేదిఁకన్

తస్మాదసక్త స్సతతం, కార్యం కర్మ సమాచర
అసక్తోహ్యాచరన్ కర్మ, పర మాప్నోతి పూరుషః 19
కాన నీవు డనాశక్తిన్, చేయదగ్గది చేయుమీ
అవాంఛఁ గర్మలంజేయు, నరుండు మోక్షమొందును.

వివ :- అవాంఛగా =నిష్కామబుద్ధితో.

కర్మణైవ హి సంసిద్ధిం, ఆస్థితా జనకాదయః
లోకసంగ్రహ మేవాపి, సంపశ్యన్ కర్తుమర్హసి 20
కర్మచేతనె మోక్షంబు గాంచిరి జనకాదులు
లోకసంగ్రహమునకేన్, గర్మ చేయుట న్యాయమౌ.

యద్యదాచరతి శ్రేష్ఠః, తత్తదే వేతరో జనః
స యత్ప్రమాణం కురుతే, లోక స్తదను వర్తతే. 21
పెద్ద లేదేది చేయుదు, రదే నేయుదు రన్యులన్
వారి కేది ప్రమాణంబో, లోకమచాని గైకొనున్.

నమే పార్థాస్తి కర్తవ్యం, త్రిషు లోకేషు కించన
నా నవాప్తమవాప్తవ్యం, వర్త ఏవ చ కర్మణి 22

ముల్లోకంబుల నేనేమి, చేయఁదగ్గది లేదు, నేఁ
బొందనిది బొందునది, లే; దైననుంటిఁ గర్మలో.

యది హ్యహం న వర్తేయం, జాతుకర్మ ణ్యతంద్రితః
మమ వర్త్మానువర్తంతే, మనుష్యాః పార్థ! సర్వశః 23
నేనే గనుకఁ గర్మలో, జాగ్రత్త నుండకున్నచో
నాదారిబె పడిపోదు, రెల్లెడమర్త్య లర్జునా.

ఉత్సీదేయు రిమేలోకాః, న కుర్యాం కర్మచే దహం
సంకరస్య చ కర్తా స్యామ్, ఉపహన్యా మిమాః ప్రజాః24
నేనే కర్మ చేయకున్న, నీ లోకాలు నశించును
సంకరంబు చేసియుందు, నీప్రజలన్ జంపియుందును.

సక్తాః కర్మ ణ్యవిద్వాంసో, యథా కుర్వంతి భారత
కుర్యా ద్విద్వాం స్తదాసక్తః చికీర్షు ర్లోకసంగ్రహం 25
పార్థ! మూర్ఖులెటుల్ కర్మ, వాంఛతోఁ జేతురో యటుల్
ప్రాజ్ఞుల్ లోక సంగ్రహార్థ మవాంఛఁ జేయఁగాఁదగున్.

న బుద్ధిభేదం జనయేత్, అజ్ఞానాం కర్మసంగినాం
జోషయేత్, సర్వకర్మాణి, విద్వాన్ యుక్తస్సమాచరన్ 26
కర్మలన్ నమ్ము మూడుల, బుద్ధిన్ గంగారుపెట్టక
నముడై జ్ఞానిచేయుచుఁ జేయిఁపవలెఁ గర్మలన్.

వివ:- కర్మలనునమ్మి సగముతెలిసిన వారికి సర్వముబ్రహ్మమె యని తెలుపరాదు. అట్లుతెలిసినచో వాఁడు బ్రహ్మమును తెలిసికొనలేఁడు. కర్మలనా చేయఁడు. కాన వానిని కంగారు పెట్టక కర్మలను జేయింప వలయునని భావము.

ప్రకృతేః క్రియమాణాని, గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా, కర్తాఽహ మితిమన్యతే 27
ప్రకృతి గుణములచే, జరుగున్ గర్మ లెల్లెడన్
అహంకార జడాత్ముండు "వానికిన్ గర్తనే" ననున్

తత్వవిత్తుమహాబాహో, గుణకర్మ విభాగయోః
గుణా గుణేషు వర్తంత, ఇతి మత్వా న సజ్జతే. 28
గుణ కర్మ విభాగంపుఁ, దత్త్వమెఱుఁగు ధీరుఁడో.
యింద్రియంబుల్ విషయాళిఁ, జేరు నని యశక్తుఁడౌ.

ప్రకృతే ర్గుణసమ్మూఢాః, సజ్జంతే గుణకర్మసు
తా నకృత్స్న విదో మందాన్, కృత్స్న విన్న విచాలయేత్ 29
ప్రకృతిగుణమోహితు, లాశింత్రు గుణకర్మలన్
అల్పజ్ఞులను సర్వజ్ఞుల్, కంగారు పెట్టఁగూడదు.

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా
నిరాశీ ర్నిర్మమో భూత్వా, యుధ్యస్వ విగతజ్వరః 30
సర్వకర్మలు నాయందె, యుంచి యధ్యాత్మబుద్ధితో
ఆశ, మమత్వము, చింతల్, వర్జించి పోరు మర్జునా

యే మే మత మిదం నిత్యం అనుతిష్ఠంతి మానవాః
శ్రద్ధావన్తోఽనసూయన్తో, ముచ్యంతే తేపి కర్మభిః 31
ఈ నా మతంబు నేమర్త్యు లసూయలేక శ్రద్ధతో
నెల్లప్పుడాచరింతురో, వారలన్ గర్మలంటవు.

యే త్వేత దభ్యసూయన్తో, నానుతిష్ఠంతి మే మతమ్
సర్వజ్ఞాన విమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః 32

అసూయతోడ నెవ్వరీ, నామత మాచరింపరో
వా రజ్ఞానుల్ మతిహీనుల్, నశింతు రని యెంచుమీ.

సదృశం చేష్టతే స్వస్యాః, ప్రకృతే ర్జ్ఞానవానపి
ప్రకృతిం యాని భూతాని, నిగ్రహః కిం కరిష్యతిః 33
స్వస్వప్రకృతిఁబట్టియే, చేయుచుండును జ్ఞానియున్
ప్రాణుల్ ప్రకృతినె పొందున్, నిగ్రహమేమి చేయున్.

వివ: నిగ్రహము=ప్రకృతిని పొందనను పట్టుదలలేక ఇంద్రియ నిగ్రహము. ఇది ప్రకృతి ముందర పనికిరాదని భావము

ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే, రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయో ర్న వశ మాగచ్ఛేత్, తౌ హ్యస్య పరిపంథినౌ 34
ఇంద్రియాళికి కోర్కెలం, దుండున్ రాగంబు ద్వేషమున్
వాని వశంబు గాఁగూడ, దవే వానికి శత్రుపుల్.

శ్రేయాన్ స్వధర్మో విగుణః, పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః 35
సరిగాఁ జేయఁబడిన, పరధర్మంబు కంటెను
విగుణంబుగఁ దోఁచియు, స్వధర్మమదె శ్రేష్ఠము.

వివ:- స్వధర్మము=స్వస్వవర్ణాశ్రమ విహితధర్మమని పూర్వులు స్వస్వభావ నియతమైన ధర్మమని నవీనులు.

స్వధర్మమాచరించెడి, తతిన్ చావైన శ్రేష్ఠము
అన్య ధర్మంబు మంచిదై, తోఁచియున్ భీకరంబగున్.

వివ:- దీనినిబట్టి స్వస్వమతావలంబులై యుండవలయునేగాని యన్యమతావలంబనము చేయరాదని తెలియుచున్నది ఇది సర్వమత సమత్వమును దెలుపు చున్నది.

అర్జున ఉవాచ:

అథ కేన ప్రయుక్తోఽయం, పాపం చరతి పూరుషః
అనిచ్ఛ న్నపి వార్ష్ణేయ, బలాదివ నియోజితః ౩౬

అర్జునుం డనియె :

అయినన్ మఱి వేనిచేఁ, బ్రేరేపఁబడి వీఁ డెటుల్
విధి లేక బంటుపోలెన్ చోరకె చేయుఁ బాపముల్.

శ్రీ భగవా నువాచ:

కామ ఏష క్రోధ ఏష, రజోగుణ సముద్భవః
మహాఽశనో మహాపాప్మా, విద్ధ్యేన మిహవైరిణం. ౩౭

శ్రీ భగవానుఁ డనియె.

రజో గుణంబునం బుట్టు, కామక్రోధాలె రేపెడున్
వీటియాఁకలి కంతులే, దివి పాపులు శత్రులున్.

ధూమే నావ్రియతే వహ్నిః, యథాఽఽ దర్శో మలేన చ
యథోల్బే నావృతో గర్భః, తథాతేనేద మావృతం. ౩౮

నిప్పున్ బొగ గ్రమ్మినట్లు, దు మ్మద్ద మంటినట్టులున్
గర్భమున్ మావిచుట్టిన, ట్లన్నింటిఁ గ్రమ్ముఁ గామము

ఆవృతం జ్ఞాన మేతేన, జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ, దుష్పూరే ణానలేన చ. ౩౯

జ్ఞానికిన్ నిత్యశత్రుపై, చింతల నిండియున్నదై
తృప్తియే లేని కామంబె, జ్ఞానమున్ గప్పునర్జునా.

ఇంద్రియాణి మనో బుద్ధిః, అస్యాధిష్ఠాన ముచ్యతే
ఏతై ర్విమోహయ త్యేష, జ్ఞాన మావృత్య దేహినం. 40
ఇంద్రియంబుల్ మనోబుద్ధుల్, దీనికాశ్రయమయ్యెడున్
జ్ఞాన మిదె గప్పి, దేహిన్, వానిచే మోహపెట్టును.

తస్మా త్త్వమింద్రియా ణ్యాదౌ, నియమ్య భరతర్షభ!
పాప్మానం ప్రజహి హ్యేనం, జ్ఞాన విజ్ఞాన నాశినం. 41
కాన నీ నింద్రియంబులన్, మున్మందె నిగ్రహించి యా
జ్ఞాన విజ్ఞానముల్ చంపు, నీ పాపిఁ జంపు మర్జునా.

ఇంద్రియాణి పరా ణ్యాహుః, ఇంద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు తః 42
గొప్ప వింద్రియముల్ వాని, కంచెఁ జిత్తంబు గొప్పది
దానికంటె బుద్ధి గొప్ప, దాబుద్ధిన్ మించు నాత్మయున్.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా, సంస్తభ్యాత్మానమాత్మనా
జహి శత్రుం మహాబాహో, కామరూపం దురాసదం. 43
ఇట్లు బుద్ధిన్ మించు నాత్మన్, గాంచి యాత్మను నాత్మచేఁ
జక్కఁజేసి గెల్వరాని, కామవైరిని జంపుమీ.

ఇది

మూఁడవ అధ్యాయము

(((o)))

# తెనుఁగు గీత

## నాల్గవ అధ్యాయము

## కర్మ యజ్ఞ విభాగము

శ్రీ భగవా నువాచ:

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయం
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్. 1

శ్రీ భగవానుఁ డతియె :

ఈ నశింపని యోగంబు, సూర్యున కేను జెప్పితిన్
సూర్యుండు మనువు, కాంత డిక్ష్వాకునకుఁ జెప్పెను,

ఏవం పరంపరా ప్రాప్తం ఇమం రాజర్షయో విదుః
స కాలే నేహ మహతా యోగో నష్టః పరన్తప ! 2

ఈగతి వచ్చిన దీనిన్, రాజర్షులు గ్రహించితి
చాల కాలంబున కిది యిందే నశించె నర్జునా !

సఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః
భక్తోసి మే సఖాచేతి రహస్యంహ్యేత దుత్తమమ్. 3

భక్తుండ వాప్తుఁడ వని, యా ప్రాచీనపు యోగమే
నీ కిప్డు డేను చెప్పితి, నది గూఢము శ్రేష్ఠమున్.

అర్జున ఉవాచ

అపరం భవతో జన్మ పరంజన్మ వివస్వతః
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి. 4

అర్జును డనియె :

నీ జన్మ మిప్పటిది; యే, నాఁటిదొ సూర్యజన్మమున్
నీ వాదిఁ జెప్పితి వంచు, నేనిది యెట్లు నమ్ముదున్.

శ్రీ భగవా నువాచ :

బహూని మే వ్యతీతాని, జన్మాని తవ చార్జున!
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప! 5

నాకును నీకును చాలా, జన్మల్ గడచె నర్జునా!
నే నవన్ని యెఱుంగుదు, నీ వెఱుంగవు వానినిన్.

శ్రీ భగవానుఁ డనియె :

అజోఽపి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్
ప్రకృతింస్వా మధిష్ఠాయ, సమ్భవామ్యాత్మ మాయయా. 6

చావుఁ బుట్టులు లేకుండి, భూతేశునిగ నుండియున్
నా ప్రకృతి నధిష్ఠించి, నా మాయచేత పుట్టుదున్.

యదా యదా హి ధర్మస్య, గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య, త దాత్మానం సృజామ్యహమ్. 7

ఎప్పుడెప్పుడు ధర్మంబు, పోయి యధర్మ మెచ్చునో
అప్పుడు నేనె నన్నిందు, పుట్టించుకొందు నర్జునా!

పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ, సమ్భవామి యుగేయుగే. 8

సజ్జనులను రక్షింపన్, శిక్షింపన్ దుర్జనంబులన్
ధర్మ సంస్థాపనార్థంబు, ప్రతి యుగానఁ బుట్టుదున్.

జన్మ కర్మ చ మే దివ్యం, ఏవం యో వేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ, నైతి మా మేతి సోఽర్జున! 9

దివ్యమైనట్టి యీ నాదు, జన్మ కర్మల తత్త్వమున్
గాంచువాఁడు పునర్జన్మ, లేక నన్జేరు నర్జునా!

వీత రాగ భయ క్రోధా మన్మయా మా ముపాశ్రితాః
బహవో జ్ఞానతపసా, పూతా మద్భావ మాగతాః. 10

వెతల్ గోర్కెల్ పగల్ వీడి, నన్గాంచి యాశ్రయించుచో
జ్ఞానతపః పవిత్రులై, గాంత్రు మదైక్య మెందఱో.

యే యథా మాం ప్రపద్యన్తే, తాం స్తథైవ భజామ్యహం
మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః. 11

న న్నెవ్వ రెట్లు గొల్తురో, వారి నట్లె భజించెదన్
పార్థ! అన్ని విధాల నా, దారి ద్రొక్కెద రీ నరుల్.

కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా. 12

కర్మఫల మిటన్ గోరి, యజింత్రు దేవతావళిన్
తత్కర్మల ఫలితంబో, వేగ నీ లోకమం దగున్.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగశః
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. 13

గుణకర్మలఁబట్టి నేఁ, జేసితి నాల్గు వర్ణముల్
తత్కర్త నయ్యు నన్నెంచు, మవ్యయుఁగ నకర్తగన్.

వివ:- పరమేశ్వరుఁడు సూర్యునివలెఁ గర్తృత్వాభిమానము
లేనివాఁడు గానఁ గర్తయైనను గర్త గాఁడని భావము.

న మాం కర్మాణి లింపంతి న మే కర్మ ఫలే స్పృహా
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే. 14

నన్ గర్మలంటవు; నాకున్, లేదు తత్ఫలవాంఛయున్
అని నన్నెఱుంగువానిన్, బంధింపలేవు గర్మముల్.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వై రపి ముముక్షుభిః
కురు కర్మైవతస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. 15

ముక్తిఁగోరి యిటుల్ పూర్వుల్, తెల్సి చేసిరి కర్మలన్
కావునఁ బూర్వు లెప్పుడో, చేసిన కర్మ చేయుమీ.

కిం కర్మ కి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 16

కర్మయేం, దకర్మ యేదో, మోహమొందిరి ప్రాజ్ఞులున్
అశుభంబునుండి ముక్తిన్, గూర్చు నాకర్మ చెప్పెదన్.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణ శ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. 17

కర్మను దెల్సికోవలె, వికర్మన్ దెల్సికోవలెన్
అకర్మను దెల్సికోవలెఁ, గర్మగతుల్ నిగూఢముల్.

వివ:- కర్మ=శాస్త్ర విహిత కర్మ, వికర్మ = శాస్త్ర విరుద్ధ కర్మ, అకర్మ = కర్తృత్వాభిమాన రహిత మైన కర్మ యని శంకరాదులు.

* సామాన్యమైనది కర్మ, వికర్మ యనగా హృదయపూర్వకముగాఁ జేయఁబడిన కర్మ విశేష కర్మ. అట్టి కర్మ వికర్మతోఁ జేసినచో అకర్మ యగునని వినోబా.

కర్మ ణ్యకర్మ యః పశ్యేత్, అకర్మణిచ కర్మ యః
స బుద్ధిమా న్మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్. 18

ఎవ్వఁ డకర్మఁ గర్మలోఁ, గర్మ నకర్మలోఁ గనున్
వాఁడె ధీమంతుఁ, డాతఁడె, యోగియుఁ గర్మయోగియున్.

వివ:- కర్తృత్వాభిమానము లేనిచోఁ జేయకుండినను చేయువాఁ డగును. చేయుచున్నను చేయనివాఁ డగును. అట్టివాఁడె కర్మయోగి యని భావము.

యస్య సర్వే సమారమ్భాః, కామ సంకల్ప వర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం త మాహుః పండితం బుధాః. 19

ఎవ్వాని కర్మ లన్నియుఁ గామసంకల్ప శూన్యమై
జ్ఞానాగ్ని వ్రేల్వఁగాఁబడున్ వానిన్ బండితుఁ డందురు.

వివ:- వ్రేల్వఁగాఁబడునో = హోమము చేయఁబడునో.

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః 20

ఫలేచ్ఛ వీడి నిత్యంబు, తృప్తి నాశ్రయ శూన్యుఁడై
కర్మలో బ్రవర్తించియు, నేమీచేయని వాఁ డగున్.

వివ:- ఆశ్రయశూన్యుఁడై = దేహేంద్రియాద్యభిమాన శూన్యుడై

నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషం. 21

ఆశ లేక, మనస్సాఁడల్, బంధించి, సర్వభోగముల్
వీడి, దైహికకర్మలె, చేయుచున్ బాప మొందఁడు.

వివ:- దైహికకర్మలు = దేహము నిలుచుటకు మాత్రము చేయు కర్మలు.

యదృచ్ఛా లాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే. 22
లభించినంతలోఁ దృప్తి, పొంది, జంట కతీతుఁడై
సిద్ధ్యసిద్ధులఁ దుల్యుండై, బంధ మొందఁడు చేయుచున్

వివ:- జంట=సుఖదుఃఖాది ద్వంద్వము.

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః
యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే 23
ఆసక్తి వీడి ముక్తుఁడై, జ్ఞాన మొందు మనస్సుతో
యజ్ఞార్థంబై కర్మచేయు, వాని కర్మ క్షయం బగున్.

వివ:- యజ్ఞార్థము=ఈశ్వరుని కొఱకు దీనజనసేవ కొఱకును.

బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా 24
బ్రహ్మకై బ్రహ్మహవిసున్ బ్రహ్మాగ్నిన్ బ్రహ్మవేల్చెడున్,
బ్రహ్మత్మ బుద్ధిచేవాడు, పొందు తాను బ్రహ్మమే.

దైవ మే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి. 25
యోగుల్ కొంద ఱుపాసింత్రు, దైవ యజ్ఞంచే మదిన్
మఱి కొందఱు బ్రహ్మాగ్నిన్. వేల్చెద రిష్టినిష్టిచే

వివ:- దైవయజ్ఞము=ఇంద్రాదులకు హవిస్సు మొదలగు
నవి అర్పించుచుఁ జేయు యజ్ఞము. ఇష్టి=యజ్ఞము.

శ్రోత్రాదీ నింద్రియాణ్యన్యే ఇంద్రియాగ్నిషు జుహ్వతి.
శబ్దాదీ న్విషయానన్యే ఇంద్రియాగ్నిషు జుహ్వతి. 26

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞ క్షపిత కల్మషాః 30

మితాహారులు కొందఱు, ప్రాణాగ్నిన్ వ్రేల్తురు ప్రాణముల్
ఈ యజ్ఞవేత్తలందఱు. యజ్ఞాలఁ గూల్తురు పాపముస్

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనం
నాయంలోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ 31

యజ్ఞ శేషామృతంబును. త్రావువా రాద్యుఁ గాంతురు
యజ్ఞశూన్యున కీలోక, మగు నిహంబె లేనిచో

వివ:- యజ్ఞాదులను జేసినపిదప మిగిలిన కాలములోచేయు ధర్మ సహితమగు కర్మ యమృతము.

యజ్ఞము చేయగా మిగిలిన యన్నమును దినువారు ఆద్యుఁడగు నీశ్వరుని జూతురని భావము.

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే
కర్మజాన్విద్ధి తాన్సర్వాన్ ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే 23

యజ్ఞంబు నిట్లనేకంబుల్, శ్రుతులం జెప్పఁగాఁ బడెన్
అవెల్లఁ గర్మజన్మంబు, లిట్లెంచి ముక్తిఁ గాంతువు.

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే. 33

ద్రవ్య యజ్ఞంబు కంటెను, జ్ఞానయజ్ఞంబు శ్రేష్ఠము
పవిత్ర కర్మ లన్నియు, జ్ఞానమందె లయించును.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. 34

సాష్టాంగపడి, ప్రశ్నించి, కొల్చి యది యెఱుంగుమీ
తత్త్వమెఱింగిన జ్ఞాను, లుపదేశింతుర్ జ్ఞానమున్

యద్జ్ఞాత్వానపున ర్మోహం ఏవం యాస్యసి పాండవ
యేనభూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి 35
అజ్ఞానంబున్ గన నిట్లు, మోహ మొంద విఁకెప్పుడున్
దానఁ బూర్తిగఁ గాంతువు, ప్రాణుల్ నాలోన నాత్మలో.

అపి చే దసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి- 36
ఎల్లపాపంబుల కంటెన్ గొప్పపాపంబు చేసియున్
ఆ పాపపు సముద్రంబు, దాటెదు జ్ఞాననావచే.

యథై ధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్కురుతేఽర్జున!
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. 37
బాగుగ మండునిప్పెటుల్,కట్టెల్ భస్మము చేయునో
యట్టులే సర్వ కర్మల, జ్ఞానాగ్ని భస్మవేయును.

న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే
త త్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విన్దతి 38
జ్ఞానముతో సమానమౌ, పవిత్ర వస్తు లేదిలన్
తమంతన్ యోగనిష్ఠాతుల్, దానిన్ వేళకుఁ గాంతురు.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయ తేన్ద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిం అచిరే ణాధిగచ్ఛతి. 39
జితేంద్రియులు శ్రద్ధాళుల్, తత్పరుల్ గాంత్రు జ్ఞానమున్
జ్ఞాన మొంది మహాశాంతు, లౌదురు వెనువెంటనే.

అజ్ఞ శ్చాశ్రద్ధధాన శ్చ సంశయాత్మా వినశ్యతి
నాయం లోకోఽస్తిన పరో న సుఖం సంశయాత్మనః 40

శ్రద్ధా శూన్యులు, నజ్ఞానుల్, సంశయాత్ముల్ నశింతురు
ఇహమున్ బరమున్ లేదు, లేదు సౌఖ్యము వారికిన్.

యోగసన్న్యస్త కర్మాణం జ్ఞానసంఛిన్న సంశయం
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయః 41

కర్మల్ యోగముచే వీడి, జ్ఞానాసిన్ సంశయంబులు
ఛేదించి, యుపశ్రిమత్తుండౌ, జ్ఞానినంటవు కర్మముల్.

తస్మాదజ్ఞాన సంభూతం హృత్‌స్థం జ్ఞానాసి నాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగం ఆతిష్ఠోత్తిష్ఠ భారత! 42

కాన నజ్ఞాన జన్యమౌ, లోనున్న సంశయంబులు
జ్ఞానాసిన్ గోసి, యోగము, పొందుము లెమ్ము ఫల్గునా

ఇది శ్రీ ........ గణపతిశాస్త్రిచేఁ దెనిగింపబడిన
తెనుఁగు గీతయందుఁ గర్మయజ్ఞ విభాగ
యోగమను నాల్గవ యధ్యాయము.

— 0 —

# తెనుంగు గీత

## అయిదవ యధ్యాయము

## సంన్యాస యోగము

అర్జున ఉవాచ :

సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితం. 1

అర్జునుండనియె :

కర్మ సన్న్యాసమటెద, వందువు కర్మయోగమున్
రెంటిలో నేది శ్రేష్ఠమొ, నిశ్చితంబుగఁ దెల్పుమీ.

శ్రీ భగవా నువాచ :

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ,
తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే. 2

శ్రీ భగవానుఁ డనియె.

సంన్యాసము కర్మయోగ, మీ రెండు మోక్షకారులే
కర్మ సంన్యాసముకంటెన్, గర్మయోగంబె శ్రేష్ఠమౌ.

వివ:- సంన్యాసము = కర్మలను విడచుట, కర్మయోగము =
ఈశ్వరార్పణ బుద్ధితోఁ గర్మలు చేయుట.

జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి
నిర్ద్వంద్వోహి మహాబాహో సుఖం బంధా త్ప్రముచ్యతే. 3

ఎవ్వఁడల్గఁడొ కోరఁడో, నిత్య సంన్యాసి యాతఁడు
రాగద్వేషాది శూన్యుండు, సులువుగా బంధముక్తుఁడౌ.

సాంఖ్య యోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏకమ ప్యాస్థిత స్సమ్యక్ ఉభయో ర్విన్దతే ఫలమ్. 4

సాంఖ్యము యోగము మూర్ఖుల్, వేఱందురు: చెప్పరార్యులు
బాగుగా నేది చేసినన్, రెండింటి ఫలమున్ గనున్.

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే,
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి. 5

సాంఖ్యుల కేపద మబ్బు, నదే యోగులకబ్బును
సాంఖ్యయోగా లొకటిగాఁ జూచెడువాఁడె చూచును.

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః
యోగయుక్తో ముని ర్బ్రహ్మ న చిరే ణాధిగచ్ఛతి. 6

యోగంబులేక సంన్యాస, మొందుట కష్ట మర్జునా!
యోగయుక్తుండగు మౌని, త్వరలో బ్రహ్మ మొందును.

వివ :— యోగము = కర్మయోగము.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. 7

మేని నింద్రియముల్ గెల్చి, యోగియై శుద్ధసత్త్వుఁడై
సర్వప్రాణులకాత్మయై, యంటడు కర్మచేయుచున్.

నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్
స్వపన్ శ్వసన్. 8

చూచుచు వించు ముట్టుచుఁ, దించు మూర్కొంచు పెళ్ళుచున్
సోలు చూర్చుచుఁ బ్రేలుచున్, విడుచుచుఁగొంచుఁ దీయుచున్

ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్నపి
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. 9

మాయుచునింద్రియంబులు, విషయంబుల నుండుటన్
లోనెంచి యోగి, తత్త్వజ్ఞుఁ డేమీచేయుట లేదనున్.

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న సపాపేన పద్మపత్ర మివాంభసా. 10

కర్మల్ బ్రహ్మార్పణ చేసి, యెవ్వఁ డవాంఛఁ జేయునో
వాని నంటవు పాపంబుల్, తామరాకున్ జలం బటుల్.

కాయేన మనసా బుధ్యా కేవలై రింద్రియై రపి
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మ శుద్ధయే. 11

మేనిచే మదిచే బుద్ధిన్, గేవల మింద్రియాళిచే
యోగుల్ కోర్కెవిడి కర్మల్, చేసెద రాత్మశుద్ధికై.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీం
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. 12

యోగి ఫలాశ వర్జించి, నైష్ఠికశాంతి నొందును
అయోగి కోర్కెలు రేపన్, ఫలాశఁ జిక్కి బద్ధుఁడౌ.

వివ :- నైష్ఠికశాంతి = సంపూర్ణశాంతి, అయోగి = యోగి కానివాఁడు.

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహీనైవ కుర్వ న్నకారయన్. 13

నవ ద్వారపురిన్ దేహి, చేయింపకయుఁ, జేయక
సర్వకర్మల్ మదిన్ వీడి, జితాత్ముఁడై సుఖుండగున్

వివ:- నవద్వారపురి-తొమ్మిది ద్వారములుగల పట్టణము శరీరము, కండ్లు. చెవులు. ముక్కులు. నోరు. మూత్ర పురీష ద్వారములు మొత్తము తొమ్మిది

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే. 14

కర్తృత్వ మేని కర్మలేన్, తత్కర్మఫలసంగ మేన్
ప్రాణి కీశుండు సృజింపఁ, డా ప్రకృతే ప్రవర్తిలున్.

నాదత్తే కస్యచి త్పాపం నచైవ సుకృతం విభుః
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః. 15

వేనిపాపముఁ బుణ్యంబున్, గైకొనఁ డీశుఁ డర్జునా!
జ్ఞానమున్ గప్పె నజ్ఞాన, మిదె మోహించుఁ బ్రాణులన్.

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. 16

ఏప్రాణుల యాత్మజ్ఞాన, మా యజ్ఞానముఁ గూల్చెనో
సూర్యుఁ డట్టు లాజ్ఞానము, దీపింపఁజేయు నీశ్వరున్,

తద్బుద్ధయ స్తదాత్మానః తన్నిష్ఠా స్తత్పరాయణాః
గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాన నిర్ధూతకల్మషాః. 17

బ్రహ్మ బుద్ధుల్, బ్రహ్మపరుల్, బ్రహ్మాత్ముల్ బ్రహ్మనిష్ఠులన్
జ్ఞానాగ్ని పూతపాపులై. పొందరు జన్మబంధముల్.

వివ: - బ్రహ్మబుద్ధులు - బ్రహ్మమందు బుద్ధిగలవారు, బ్రహ్మ
పరులు - బ్రహ్మమం దాసక్తిగలవారు.

విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హ స్తిని
శునిచైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః. 18
విద్యావినయముల్ గల్గు, బ్రాహ్మణు, నావు, నేనుఁగున్
కుక్కన్ జఁడాలునైనను సమతఁ జూతురు పండితుల్.

ఇహైవ తైర్జితః స్వర్గో యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తేస్థితాః 19
మనస్సు సమమౌ ప్రాణుల్. గెల్చు నీభువి జన్మమున్;
బ్రహ్మ, నిర్దోష మొక్కటే; కాన వారుంద్రు బ్రహ్మలో

నప్రహృష్యేత్ప్రియం ప్రాప్యనోద్విజే త్ప్రాప్యచాప్రియం
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః 20
హర్షింపఁడు ప్రియమొ్మంది. దుఃఖింపఁడార్తి పొందియున్
స్థిరబుద్ధిన్ మోహ మేఁగన్. బ్రహ్మజ్ఞుఁడుండు బ్రహ్మలో

బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విందత్యాత్మని య త్సుఖమ్
స బ్రహ్మయోగ యుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే. 21
పైపై కోర్కెల్ త్యజించువాఁ డేసుఖ మాత్మలోఁ గనున్
వాఁడు బ్రహ్మసమాధిలో, నక్షయసౌఖ్య మొందును.

యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే
ఆద్యంత వన్తః కౌన్తేయ ! న తేషు రమతే బుధః 22
సంపర్గంబునఁ బుట్టెడు. భోగంబుల్ దుఃఖహేతువుల్
వాని కాద్యంతముల్ గల్గున్, జ్ఞాని క్రీడింపఁడందులో

శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం సయుక్తస్స సుఖీ నరః 23

మేను వీడుటకున్ మున్నే, కామ క్రోధాల వేగమున్
సైపంగలఁడె వండిందే, వాఁడెయోగి సుఖాత్ముఁడున్.

యోఽంతస్సుఖోఽ న్తరారామ, తథాంతర్జ్యోతిరేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి, 24

లోలోఁజొక్కుచు లోలోనఁ. గ్రీడించి. లోనిజోతితో
మించుయోగియు బ్రహ్మమై, బ్రహ్మనిర్వృతిఁ గాంచును

లభంతే బ్రహ్మనిర్వాణం ఋషయః క్షీణకర్మషాః
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః 25

క్షీణపాపుల్, జితేంద్రియుల్, జ్ఞానాసిచ్ఛిన్న సంశయుల్
సర్వభూత హితుల్ మౌనుల్. గాంతురు బ్రహ్మనిర్వృతిన్.

వివ:- బ్రహ్మనిర్వృతి- బ్రహ్మనందము.

కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనామ్ 26

కామంబు క్రోధముఁన్‌లేక చిత్తంబున్‌గెల్చి, యాత్మమున్
దర్శించుమౌనుల చుట్టున్, బ్రహ్మనందము వర్తిలున్.

స్పర్శాన్‌కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తర చారిణౌ 27

బాహ్యస్పర్శల్ వెలిపైచి, భ్రూమధ్య నిల్పి కన్నులన్
ప్రాణాపానాలు సరిగా, ముక్కులో సంచరింపఁగన్.

వివ:- బాహ్యస్పర్శలు_ బాహ్యమైన శబ్దస్పర్శాది విషయములు

యతేంద్రియ మనోబుద్ధిః మునిర్మోక్షపరాయణః
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః. 28

ఇంద్రియంబుల్ మనోబుద్ధుల్. బంధించి మోక్షమగ్నుఁడై
భయక్రోధేచ్ఛలన్ విడ్చు, వాఁడెప్డు ముక్తుఁడే యగున్

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్
సుహృదంసర్వభూతానాం జ్ఞాత్వా మాంశాంతి మృచ్ఛతి

యజ్ఞ తపస్సులన్ ఁదించు, సర్వలోకంబు లేలుచున్
భూతహితంబుసేయు, నన్ దెలియన్, శాంతి గల్గును

ఇది శ్రీ ........................ గణపతిశాస్త్రిచేఁ దెనిఁగిఁపబడిన
తెనుఁగు గీతయందు కర్మసన్యాస యోగమను
అయిదవ యధ్యాయము.

(((o)))

# తెనుఁగు గీత

## ఆఱవ యధ్యాయము

## ధ్యానయోగము

శ్రీ భగవానువాచ :

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతి యః
స సన్యాసీ చ యోగీచ న నిరగ్ని ర్నచాఽక్రియః. 1

ఫలంబు గోరకెవ్వండు, చేయందగ్గది చేయునో
వాఁడెసంన్యాసి యోగియుఁ, గాఁ డనగ్ని యకర్మియున్

వివ:– అనగ్ని – అగ్నిహోత్రాది కర్మలు చేయనివాఁడు.
అకర్మి – కర్మలు చేయనివాఁడు

యం సన్న్యాస మితిప్రాహుః యోగం తంవిద్ధి పాండవ
నహ్యసన్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన. 2

దేనిన్ సన్యాస మందురో, యదే యోగ మనఁబడున్
సంకల్పముల్ సన్యసింప, కెవ్వండు యోగి కాఁడిలన్

ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మకారణ ముచ్యతే.
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే . 3

యోగంబు పొందఁగోరెడు, మౌనికిఁ గర్మ హేతువౌ.
యోగ మొందిన మౌనికె, శమంబు సాధనం బగున్.

యదా హి చేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే
సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. 4

విషయంబులఁ గర్మల, నెప్డు చిక్కక, సర్వమౌ
సంకల్పముల్ విడువాఁడు, యోగారూఢుఁ డనంబడున్.

ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః. 5
ఆత్మచే నాత్మఁ బోషింపు, మాత్మన్ భ్రష్ట మొనర్పకు
మాత్మయే బంధు వాత్మకు, నాత్మయే శత్రు వాత్మకున్.

బంధు రాత్మాత్మన స్తస్య యేనాత్మైనాత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్ 6
ఆత్మచే నాత్మఁ గెల్చిన, యాత్మ యాత్మకు బంధువు
ఆత్మచే నాత్మఁ గెల్వని, యాత్మ యాత్మకు శత్రువు.

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావ మానయోః 7
మదిన్ గెల్చు ప్రశాంతుని, యాత్మ, మానావ మానముల్
శీతోష్ణ సుఖదుఃఖంబుల్, సమానంబుగఁ జూచును.

జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః 8
వశియై బెడ్డలున్ రాళ్ళు, బంగార మొకటిగాఁ గని
జ్ఞాన విజ్ఞాన తృప్తుండౌ, ధీరుండు, యోగి నాఁబడున్.

వివ:- జ్ఞానము = శాస్త్రాదిజ్ఞానము : విజ్ఞానము= ఆ జ్ఞానము నను భవములోనికిఁ దెచ్చుకొనుట.

సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు
సాధు ష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే. 9
సుహృదున్ మిత్రునిన్ శత్రు, నుదాసీనుఁ దటస్థునిన్
ద్వేష్యున్ సాధున్ హితున్ బాపిన్, సమంబచూడ శ్రేష్ఠుఁడౌ

యోగీ యుంజీత సతతం ఆత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః 10
మనస్సు మేను బంధించి, యీయాఁ గైకోక, కోరక
ఏకాంతముండి, యొంటియై ధ్యానింపవలె నాత్మమున్.

శుచౌదేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజిన కుశోత్తరమ్. 11
దర్భలు తోలువస్త్రంబు, పైచి యంతెత్తుఁ బల్లమున్
గాని స్థిరాసనంబును, శుద్ధమౌచోట పైచియున్.

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యాత్ యోగ మాత్మ విశుద్ధయే 12
ఆసనంబునఁ గూర్చుండి, నిల్పి చిత్తేంద్రియ క్రియల్
యోగమొందవలె నాత్మ, శుద్ధికేకాగ్రచిత్తుఁడై.

సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్. 13
మేచిన్, దలన్, మెడన్ సమం, మొనరించి చలింప
దిక్కుల్ చూడక స్థిరుఁడై స్వనాసాగ్రంబు చూచుచు

ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః 14
ప్రశాంతుడై నిర్భయుఁడై, బ్రహ్మచర్యవ్రతస్థుఁడై
మచ్చిత్తుండై మనస్సాపి నన్ నమ్మి యుండగావలెన్.

యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. 15

యోగి యెప్పుడిటుల్ తన్ను బంధించి జితచిత్తుఁడై
మోక్షమే తుదిగానొప్పు నాలోని శాంతినొందుము.

నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః
న చాతి స్వప్న శీలస్య జాగ్రతో నైవచార్జున! 16
అతిగాఁ దిన్నఁ బస్తున్నన్, యోగంబు పుట్ట దెన్నడున్
యోగంబు పుట్ట దతిగా నిద్రింప, నిద్రమానినన్.

యుక్తాహార విహారస్యయుక్తచేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావ బోధస్య యోగోభవతి దుఃఖహా 17
సరిగాఁ దించుఁ దిర్గుచు, సరిగాఁ గర్మ చేయుచున్
సరిగా నిద్రపోవుచున్, లేచు యోగివెతల్ చనున్.

యదావినియతం చిత్తం ఆత్మన్యేవాఽవతిష్ఠతే
నిః స్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. 18
నిగ్రహింపఁబడు చిత్త, మాత్మలో నిల్చునప్పుడు
కోర్కెలన్నిటి వీడిన, వాఁడు యుక్తుఁ డనంబడున్.

యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః 19
గాలిలేని యెడన్ దీవ, మేమి చలింప నట్టులన్
జిత్త మాఁగినయోగికిఁ, జలింప దాత్మయోగమున్.

యతోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా
యత్ర చైవాత్మ నాఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి. 20
యోగసేవన్ మనస్సెప్డు, నిల్వ, శాంతిని బొందువాఁ
డాత్మచే నాత్మఁ జూచు వాఁ, డాత్మలోనన తుష్టుడౌ.

సుఖ మాత్యంతికం యత్తత్ బుద్ధిగ్రాహ్య మతీంద్రియం
వేత్తి యత్ర న చైవాఽయం స్థిత శ్చలతి తత్త్వతః 21
బుద్ధికందు యింద్రియాళి, కందని నిత్యసౌఖ్యమున్
కాంచి ధైర్యముతో నుండఁ, దత్త్వముండి జాఱడు.

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే. 22
దానిఁ బొంది యింకన్ గొప్ప, లాభ మొందఁ దలంపఁడు
అందె యుండి చలింపఁడు, గొప్ప దుఃఖంబు నొందియున్.

తం విద్యా ద్దుఃఖ సంయోగ వియోగం యోగసంజ్ఞితం
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. 23
దుఃఖస్పర్శయె లేకుంట, యోగంబని తలంచుమీ
విసుగే లేని నిశ్చయ బుద్ధితో యోగ మొందుమీ.

సంకల్ప ప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వా నశేషతః
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః 24
సంకల్పంబునఁ బుట్టెడు, నెల్లకోర్కెలు పూర్తిగా
వీడి యింద్రియ సంఘంబు, మదిచే నిల్పి యెల్లెడన్.

శనైః శనై రుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మ సంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్ 25
శాంతింపవలె ధీరంబౌ, బుద్ధితో మెల్ల మెల్లనన్
మనస్సు నాత్మలో నిల్పి, చింతింపఁ దగ దెద్దియున్.

యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరం
తత స్తతో నియ మ్యైతత్ ఆత్మన్యేవ వశం నయేత్. 26

ఎందెందుండి చలచిత్తం, బెటుల్ బయలుదేఱునో
అందందె దాని బంధించి, లోఁబర్చవలె నాత్మలో

ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమం
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్. 27
మానసంబు ప్రశాంతింప, రజస్సేగ, నపాపియై
బ్రహ్మస్వరూపుఁడై యోగి, పొందు నుత్తమ సౌఖ్యమున్.
వివ:- అపాపియై = పాపములేనివాడై.

యుంజన్నేవం సదాత్మానం యోగీ విగత కల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే 28
ఇట్లెప్పు డాత్మఁ జేరుచు, యోగి పాపంబు వీడియున్
లీలగా బ్రహ్మతోఁ గల్సి, పొందు నుత్కృష్టసౌఖ్యమున్.

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః 29
ఎల్లన్ సమంబుగాఁ జూచు, నిర్మలచత్తుఁ డాత్మమున్
సర్వభూతాలలో సర్వ, భూతంబు లాత్మలోఁ గనున్.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి న చ మే నప్రణశ్యతి 30
ఎవ్వఁడన్నిట నన్గాంచు, నాలో నన్నియుఁ గాంచునో
వానికి నేఁ గనిపింతును, నాకున్ వాడు గనంబడున్.

సర్వభూతస్థితం యో భజ త్యేకత్వ మాస్థితః
సర్వథా వర్తమానోఽపి సయోగీ మయి వర్తతే. 31

అన్నిరీతుల నుండియు నైక్యమొందిన యోగి నన్
సర్వభూతాలనుండుట, యెంచి నాలోన వర్తిలున్.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున!
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః 32

దుఃఖంబైనన్ సుఖంబైనన్, తనతోపాటె యన్నిటిన్
సరిగా నెవ్వఁడు గాంచు, నా యోగియె ఘనుండగున్.

అర్జున ఉవాచ :

యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన!
ఏతస్యాహం నపశ్యామి చంచలత్వాత్ స్థితింస్థిరామ్

అర్జునుండనియె :

సమతన్ గృష్ణ! యేయోగ, మీవు చెప్పితొ యయ్యది
స్థిరంబై యుంటఁ జూడను, చిత్తంబు చల మౌటచే.

చంచలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవ ద్దృఢం
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివసుదుష్కరమ్. 34

చిత్తంబు చంచలంబద్ది, బలిష్ఠంబు దృఢంబునై
క్షోభపెట్టున్ గాలిఁబోలెన్, దానినాప నశక్యమౌ.

శ్రీ భగవా నువాచ :

అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహం చలం
అభ్యాసేన తు కౌన్తేయ! వైరాగ్యేణ చ గృహ్యతే. 35

శ్రీ భగవాను డనియె.

నిస్సంశయంబుగాఁ జిత్త, మావరానిది చంచలం
బది యభ్యాసము చేతన్, విరక్తిం గట్టగావలెన్.

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః 36

మది గెల్వక యోగంబు, దుర్లభంబని యెంచెదన్
మది గెల్చియు యత్నింప, సాధన నద్ది లభ్యమౌ.

అర్జున ఉవాచ :

అయతి శ్శ్రద్ధయోపేతో యోగా చ్చలిత మానసః
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ! గచ్ఛతి. 37

అర్జునుం డనియె.

శ్రద్ధయుండి పూన్కి లేమిచే, యోగమునుండి భ్రష్టుఁడై
యోగసిద్ధిన్ గననివాఁ డేగతిఁ బొందు మాధవా.

కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి 38

బ్రహ్మమార్గంబు నొందక, స్థిరత లేక రెంటికిన్
చెడి నశించునో గాదె, చెదరిపోవు మబ్బటుల్.

ఏతం మే సంసయం కృష్ణ! ఛేత్తు మర్హ స్యశేషతః
త్వదన్య స్సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే. 39

నా యీ సంశయ మచ్యుత! తీర్పనే ర్తువు పూర్తిగా
నీవు తక్క నిఁకెవ్వండు, దీనిని దీర్పఁ జాలడు.

శ్రీ భగవా నువాచ :

పార్థ! నై వేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
న హి కళ్యాణకృ త్కశ్చిత్ దుర్గతిం తాత! గచ్ఛతి. 40

శ్రీ భగవాను డనియె.

యోగభ్రష్టుండు నశింపఁ, డిహపరాల నాయనా!
మంచిపని చేయు మర్త్యుం, డెవ్వఁడొందఁడు దుర్గతిన్.

ప్రాప్య పుణ్యకృతాన్ లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. 41

పుణ్యవంతుల లోకంబుల్, పొంది యెన్నేండ్లో నిల్చియున్
శుచు లౌ శ్రీమంతు లిండ్లన్, యోగ భ్రష్టుఁడు పుట్టును.

అథవా యోగినా మేవ కులే భవతి ధీమతాం
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ య దీదృశమ్. 42

పోనీ ధీమంతు లౌయోగు, లిండ్లయందే జనించు; నీ.
లోకమం దిట్టిపుట్టుక, యెంతో దుర్లభమర్జునా

తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికం
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన! 43

ఆ జన్మన్ పూర్వదేహపు, బుద్ధితో యోగమొందియున్
సిద్ధికై మరల నింకన్, చేయున్ మిక్కిలి యత్నముల్.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః
జిజ్ఞాసు రపి యోగస్య శబ్ద బ్రహ్మాతివర్తతే. 44

నేఁడాత్మవశి గాకున్నన్, పూర్వాభ్యాసాన జ్ఞానియౌ
యోగ జిజ్ఞాసువుంగూడ, దాటున్ వేదఫలంబులన్.

వివ:- యోగభ్రష్టుఁడు ఇప్పుడు జ్ఞానప్రతిబంధకములగు భోగ
ములలోనున్నను బూర్వజన్మపు సాధనలచేజ్ఞానియగును
యోగజిజ్ఞాసువు=మోక్షసాధనమును దెలియఁగోరువాఁడు

ఇతఁడును వైదికకర్మ ఫలములను దాటి జ్ఞానాధికారి యగు నని భావము

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః
అనేక జన్మ సంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్. 45

చాల యత్నించు యోగియో, పాపంబుపీడి శుద్ధుఁడై
బహుజన్మలలో సిద్ధిన్, బొంది పొందును సద్గతిన్.

తపస్విభ్యోఽధికో యోగి జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున 46

యోగి తపస్వులకంటెన్, జ్ఞానులకంటె శ్రేష్ఠుఁడు
కర్మిష్ఠులకంటె శ్రేష్ఠుఁ, డందుచేఁ గమ్ము యోగివి.

వివ:- యోగి=తత్త్వజ్ఞానము కలిగిన పిదప మనస్సంకల్పము లను వాసనలను నశింపఁజేసికొన్న వాఁడు.

యోగినామపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం సమేయుక్త తమో మతః 47

అందఱు యోగులలోనన్, నన్నుఁబొందు మనస్సుతో
శ్రద్ధతోఁగొల్చు నెవ్వఁడు, వాఁడే యోగి వరుఁ డగున్.

ఇది శ్రీ ................ గణపతి శాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగు గీతయందు ధ్యాన యోగ మను
ఆఱవ యధ్యాయము.

— 0 —

# తెనుఁగు గీత

## ఏడవ యధ్యాయము

## జ్ఞాన విజ్ఞాన యోగము

శ్రీ భగవా నువాచ :

మయ్యాసక్తమనాః పార్థఃయోగం యుంజన్మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. 1

శ్రీ భగవానుఁ డనియె.

సన్గోరుమరితో యోగ, మొంది నన్నాశ్రయించుచున్
పూర్ణ నన్నెట్లు సరిగాఁ గాంతువో విన్మ ఫల్గునా!

జ్ఞానం తేఽహం సవిజ్ఞానం ఇదం వక్ష్యా మ్యశేషతః
యద్జ్ఞాత్వా నేహభూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే 2

జ్ఞానంబుతోడి విజ్ఞాన, మిదే పూర్తిగఁ జెప్పెదన్
దానిం దెలియనింకేదీ, లేదు తెలియఁ దగ్గది.

వివ :- విజ్ఞానము = అనుభవ జ్ఞానము.

మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః 3

వేలకొలది జనులలో, నొక్కఁడే పూను సిద్ధికై
పూను సిద్ధులలోను నన్, సరిగా నొక్కఁడే గనున్.

భూమి రాపో౽నలో వాయుః ఖం మనోబుద్ధి రేవ చ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా. 4
నేల నీరు నిప్పు గాలి, మిన్ను మనస్సు బుద్ధియున్
అహంకారం బను నాయీ, ప్రకృతి యెన్మిదై తగున్.

అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం
జీవభూతాం మహాబాహో! య యేదం ధార్యతే జగత్. 5
ఇది నీచం బిఁకన్ వేఱొ, నాదు ప్రకృతి గొప్పదై
జీవ రూపంబుగా నుండె, నదే ధరించు నీభువిన్.

వివ:- నీచము=తక్కువది.

ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా. 6
సర్వభూతాల కీరెండు, ప్రకృతుల్ మూలముల్ సుమీ
నేను సర్వజగత్తులఁ, బుట్టింతు నట్లె చంపుదున్.

మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. 7
నాకంటె నింక గొప్పది, యేదియులేదు ఫల్గునా!
నాలోనెల్ల గ్రుచ్చఁబడెన్, దారంబున మణుల్ వలెన్.

రసోహమప్సు కౌంతేయ! ప్రభాస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వవేదేషు శబ్దం ఖే పౌరుషం నృషు. 8
నీట నుండురసం బేను, గాంతిని సూర్యచంద్రులన్
ఓంకార మౌదు వేదాల, మింట ధ్వనిన్, బ్రజన్ ధృతిన్.

పుణ్యో గంధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు. 9

భూమిలో పుణ్య గంధంబన్, వహ్నిలోఁ దేజమయ్యెదన్
భూతాళిన్ జీవనం బౌదుఁ, దపస్విలఁ దపంబను.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థః సనాతనమ్
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్. 10

సర్వ భూతంబులందలి, యనాదిబీజమన్ జుమీ
బుద్ధిమంతులలో బుద్ధిన్, దేజస్విలందుఁ దేజమన్.

బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభః 11

శక్తిమంతులలోఁ గోర్కె, రాగమున్ లేని శక్తిని
ప్రాణిన్ ధర్మ విరుద్ధంబు, గాని కామమ నర్జునా!

యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి. 12

ఏయే సత్త్వ రజస్తమో, భావముల్ భువిఁ గల్గినో
అవ్వి నావల్లనౌ; నందు నేనుండ నవ్వి నాయెడన్.

వివ:_ నాకే అవి యధీనములు, నేను వాని కధీనుండఁగాదని భావము.

త్రిభిర్గుణమయై ర్భావైః ఏభి స్సర్వమిదం జగత్
మోహితం చాభిజానాతి మా మేభ్యః పరమవ్యయమ్. 13

త్రిగుణమయమైన యీ, భావాల మోహమొంది యీ
జగంబెల్ల గుణాతీతు, నవ్యయు నన్నుఁ గాంచదు.

దైవీ హ్యేషా గుణమయీ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే. 14

సగుణంబగు నా దైవ, మాయ దాటఁగ రానిది
న న్నాశ్రయించువారె యీ, మాయ దాటెద రర్జునా.

నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః
మాయయాఽపహృతజ్ఞానాః ఆసురం భావమాశ్రితాః 15

మాయచే జ్ఞానమున్ బోవ రాక్షసభావ మొందియున్
నన్నుఁ బొందరు మూఢులై, పాపులైన నరాధముల్.

చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున !
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభః 16

ఆర్తులు తత్త్వ జిజ్ఞాసుల్ ద్రవ్యార్థుల్ జ్ఞాను లర్జునా
ఈ పుణ్యాత్ములు నల్వురున్, నన్నుఁ బ్రేమింతు రెప్పుడున్

వివ:- ఆర్తులు = ద్రౌపది మొ॥, జిజ్ఞాసులు = జనకుడు మొ॥
ద్రవ్యార్థులు=ధ్రువుడు మొ॥ జ్ఞానులు॥ నారదుఁడు మొ॥
సముచ్చయముచే గోపికలు, ధర్మరాజు, కంసుడు,
శిశుపాలుఁడు మొ॥

తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తి ర్విశిష్యతే
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం అహం స చ మమ ప్రియః 17

శ్రద్ధ నెప్పుడు వర్తిల్చు, జ్ఞాని శ్రేష్ఠుఁడు వారిలో
జ్ఞాని కే నెంతొ యిష్టుండ, నాతండు నాకు నిష్టుఁడౌ.

ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్
ఆస్థిత స్సహి యుక్తాత్మా మామేవా నుత్తమాంగతిమ్ 18
వీరంద ఱుత్తముల్ గానీ, జ్ఞాని నాత్మగ నెంచెదన్
శుద్ధాత్ముఁ డాతఁ డుత్తమ గతియౌ నన్నె పొందును.

బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః 19
ఎన్నో జన్మల చివరన్, "సర్వంబు పరమేశుఁడె"
అంచుజ్ఞానుల్ ననుం గాంతు, రా మహాత్ములు దుర్లభుల్.

కామైస్తై స్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్య దేవతాః
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా 20
ఆయా కోర్కెన్ జ్ఞాన మేఁగన్, స్వస్వప్రకృతి వీడక
యాయా నియమముల్ పొంది, సేవింతు రన్యదేవతల్,

యోయోయాంయాం తనుంభక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి
తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్. 21
ఏయే భక్తుఁడు శ్రద్ధతో, నేరూపు గొల్వఁ గోరునో
వానివానికి నందందే, నిశ్చలభక్తిఁ గూర్చెదన్.

సతయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్హి తాన్ 22
ఆతఁ డాభక్తితోఁ గూడి, భజించు నెల్లదేవులన్
నేనె యిచ్చిన కోర్కెలా, దేవులనుండి పొందును.

అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసామ్
దేవా న్దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి. 23

అల్పబుద్ధుల యీ ఫలం, బింక నశించెడుం జుమీ
దేవభక్తులు దేవులఁ, గాంతుఁ, నా భక్తులున్ ననున్.

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మామబుద్ధయః
పరం భావ మజానంతో మమావ్యయ మనుత్తమం. 24
నాశంబు లేక శ్రేష్ఠమౌ, నాపరతత్త్వ మెంచక
మూఢుల్ రూపంబు లేనిన, న్నెంతురు రూపధారిగన్.

నాహం ప్రకాశ స్సర్వ స్య యోగమాయా సమావృతః
మూఢోఽయంనాభిజానాతి లోకో మామజమవ్యయం. 25
యోగమాయన్ దాగియున్న, నే నందఱకుఁ గన్పడన్
చావుఁబుట్టులు లేని నన్, గాంచ దీమూర్ఖలోకము.

వివ:- 'యోగమాయ=గుణయోగము' అని శంకరులు

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన. 26
మున్పటి విప్పటి వింకన్, రాఁబోవు సర్వభూతముల్
నే నెఱుంగుదు నన్ మాత్రఁ, మవి యెఱుంగ వర్జునా

ఇచ్ఛా ద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప. 27
రాగద్వేషములం బుట్టు, సుఖదుఃఖాదికంబుచే
సృష్టిలో సర్వభూతంబుల్, సంమోహ మొందుఫల్గునా

యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణాం
తే ద్వంద్వ మోహనిర్ముక్తాః భజంతేమాం దృఢవ్రతాః

పుణ్యకర్మలు గావించి, నిష్పాపులౌ దృఢవ్రతుల్
సుఖదుఃఖాదిమోహంబు, వీడి నన్గొల్తు రర్జునా:

జరామరణ మోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే
తేబ్రహ్మతద్విదుఃకృత్స్నం అధ్యాత్మంకర్మచాఖిలం. 29

జరామరణము క్తికై, నన్గొల్వఁ గోరువారలు
ఆ బ్రహ్మ నెల్లయధ్యాత్మ, నెల్లకర్మలఁ గాంతురు.

సాధిభూతాధి దైవం మాం సాధియజ్ఞం చ యే విదుః
ప్రయాణకాలేఽపి చ మాం తే విదు ర్యుక్తచేతసః. 30

అధిభూతాధి దైవాల, నధియజ్ఞాల నున్న నన్
గాంచువా రంత్యవేళను, నన్గాంతు్రి నిర్మలాత్ములై.

ఇది శ్రీ ...................... గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపబడిన
తెనుఁగు గీతయందు జ్ఞాన విజ్ఞాన యోగమను
ఏ డ వ య ధ్యా య ము.

— 0 —

# తెనుఁగు గీత

## ఎనిమిదవ యధ్యాయము

## అక్షర బ్రహ్మ యోగము

అర్జున ఉవాచ :

కింతద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ :
అధిభూతం చ కిం ప్రోక్తం అధిదైవం కిముచ్యతే. 1

అర్జునుం డనియె.

పురుషోత్తమ! బ్రహ్మమే. దధ్యాత్మ మేద, కర్మ యే
దధిభూతం బెది, యేది, యధిదైవ మనం బడున్.

అధియజ్ఞం కథం కోత్ర దేహేస్మిన్ మధుసూదన!
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః. 2

ఈమేన నధియజ్ఞంబు కృష్ణ! యే దెట్టులుండును
అంత్యకాలంబునం దెట్లు. నిన్నుఁ గాంతు్రి జితేంద్రియుల్.

శ్రీ భగవానువాచ :

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే
భూతభావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః

శ్రీ భగవానుఁడనియె.

అక్షరాత్మయె బ్రహ్మంబు, అధ్యాత్మ తత్స్వభావమౌ
భూతసృష్టిని వృద్ధిని, గూర్చు త్యాగంబె కర్మయౌ 3

వివ:- స్వ = బ్రహ్మమె (దేహమందు) భావము = జీవుఁడుగా నుండుట స్వభావము. భూతసృష్టి వృద్ధులను గూర్చి దర్శిహ్యాది త్యాగకర్మ త్యాగమని భావము.

అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతమ్
అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహభృతాం వర ! 4

క్షరంబె యధిభూతంబు, పురుషం డధిదైవము
ఈ దేహమందలి నేనె, యధియజ్ఞంబు ఫల్గునా!

అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేబరం
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్రసంశయః 5

అంత్య కాలంబునన్ నన్నె, యెంచుచు మేను వీడి యే
మర్త్యుఁడేఁగునొ వాఁడు నా, రూపొందు నిశ్చయంబుగన్

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేబరం
తం త మేవైతి కౌంతేయ! సదా తద్భావ భావితః. 6

ఎవ్వఁ డేరూపు నెంచుచుఁ, జివరన్ మేను వీడునో
వాఁడా రూ పెప్డు భావించి, యా యా రూపమె పొందును.

తస్మాత్స ర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్యచ
మయ్యర్పితమనోబుద్ధిః మా మేవై ష్య స్యసంశయః 7

కావున నెల్లవేళల, నన్ స్మరింపుము, పోరుమీ
నాకర్పింప మనోబుద్ధుల్; నన్నుఁ గాంతు వవశ్యమున్.

అభ్యాస యోగ యుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్. 8

అభ్యాసయోగ మొంది యే, చింత లేని మనస్సుతో
ధ్యానించువాఁడు దివ్యుఁడౌ, పూరుషుఁ గాంచు నర్జునా!

కవిం పురాణ మనుశాసితారం
అణోరణీయాంస మనుస్మరే ద్యః!
సర్వస్య ధాతార మచింత్యరూపం
అదిత్యవర్ణం తమసః పరస్తాత్. 9

శాసకునిఁ బూర్వపురుషుని సర్వద్రష్ట
నణువుకంటెను నణువౌచు నలరువాని
నఖిలసృష్టికర్త, నచింతనీయరూపు
సూర్యవర్ణుఁ దమోతీతుఁ జూచు నెవఁడు.

ప్రయాణకాలే మనసాఽ చలేన
భక్త్యా యుక్తో యోగ బలేన చైవ
భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
పతతం వరం పురుష ముపైతి దివ్యం. 10

వాఁడు తుదిప్రయాణపువేళ భక్తితోడ
నిశ్చలమనస్సుతో యోగనియతితోడ
కన్బొమలమధ్య ప్రాణంబు క్రమత నిల్పి
పరిగఁ గన్గొను దివ్యుఁ డౌపరమపురుషు.

యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్యతయో వీతరాగాః
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 11

అందురెద్దాని వేదజ్ఞు లక్షర మని
దేనిఁ జొచ్చెదరు విరాగులైన యతులు
పొందఁగోరి దేనిఁ బ్రహ్మచర్యము చరింత్రొ
యట్టి పరమపదము సంగ్రహము వచింతు.

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణాం 12
ద్వారంబు లెల్ల! ఇంధించి: మనస్సున్ హృది నిల్పియున్
స్వ ప్రాణంబు తలం జొన్చి, యోగంబును ధరించియున్

ఓ మిత్యే కాక్షరం బ్రహ్మవ్యాహరన్ మామనుస్మరన్
యః ప్రయాతి త్యజ న్దేహం సయాతి పరమాగతిం 13
"ఓం" అను నక్షరబ్రహ్మ మెంచుచు నన్ స్మరించుచున్
మేను వీడి యెవం డేగు వాఁడె పొందును సద్గతిన్

అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ ! నిత్యయుక్తస్య యోగినః 14
నిత్య మనన్య చిత్తుండై, నిన్నె ప్వఁడెవ్వ డెంచునో
యా నిత్యశుద్ధుఁడౌయోగి, కేను లభింతునుల్బగా.

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతం
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః. 15
ఉత్తమ సిద్ధిని బొందు, మహాత్ముల్ నన్నుఁ జేరియున్
దుఃఖం పు టిల్లు నశ్వర, మా పునర్జన్మ గాంచరు.

ఆబ్రహ్మ భువనాలోకాః పునరావర్తినోఽర్జున !
మా ముపేత్య తు కౌంతేయ ! పునర్జన్మ న విద్యతే. 16
బ్రహ్మ లోకంబువఱకున్, లోకంబుల్ మాటిమాటికిన్
దిరుగుచుండు నర్జున, జన్మ లేదింక ఫల్గునా !

సహస్రయుగ పర్యంతం అహర్యద్బ్రహ్మణో విదుః
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః 17

వేలయుగంబులే రాత్రి, వేలయుగంబులే పవల్
బ్రహ్మకౌనని కాలజ్ఞుల్, చెప్పుచుండెద రర్జునా !

అవ్యక్తాద్వ్యక్తయ స్సర్వాః ప్రభవం త్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయంతేతత్రైవావ్యక్త సంజ్ఞకే. 18
అవ్యక్తునుండి సర్వమౌ, వ్యక్తుల్ పవలు పుట్టును
రాత్రివేళన్ లయం బొందు, నవ్యక్తమైన బ్రహ్మలో.

భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే
రాత్ర్యాగమేఽవశః పార్థ ! ప్రభవ త్యహరాగమే. 19
ఈ భూతంబులు నాఁటివే. పుట్టి యనిష్టతన్
బ్రహ్మరాత్రిన్ లయం బొందుఁ, బగటియందు జనించును

పరస్తస్మాత్తుభావోఽన్యోఽ, వ్యక్తో వ్యక్త స్సనాతనః
య స్స సర్వేషు భూతేషు నశ్యత్సు నవినశ్యతి 20
బ్రహ్మన్ మించి యింకన్ బ్రాంత, యవ్యక్తభావముండెనా
ప్రాణు లెల్ల నశించినన్; నశింప దది యెన్నఁడున్.

అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిం
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమంమమ. 21
అవ్యక్త మక్షరం బను, దానిన్ సద్గతి యందురు
దేనిఁ బొంది మఱిరారో, యదే నా శ్రేష్ఠధామము.

పురుష స్స పరః పార్థ ! భక్త్యా లభ్యస్త్వనన్యయా
యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ 22
భూతంబుల్ వేనిలో నుండు, ని దెల్ల నిండె నేనిచే
నా పరమ పురుషుండు, ననన్యభక్తి లభ్యుఁడౌ.

యత్ర కాలే త్వనావృత్తిం అవృత్తించైవ యోగినః
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ 23
ఏకాలమందు యోగులు, మరణించి జనించుచున్
జనింపకయు నుందురో. నీ కాకాలము చెప్పెదన్,

అగ్ని ర్జ్యోతి రహః శ్శుక్లః, షణ్మాసా ఉత్తరాయణం
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. 24
అగ్ని జ్యోతి పవల్ శుక్ల, ముత్తరాయణ మార్గమ్మల్
నియందుం జనిపోవు, బ్రహ్మజ్ఞుల్ గాంత్రు బ్రహ్మమున్

వివ:- చనిపోయిన పిదప అగ్నిదేవతను దానినుండి యహర్దేవ
తను శుక్లపక్షదేవతను, దేవలోకదేవతను, వాయులోకదేవ
తను, సూర్యుని, చంద్రుని పై అక్షను వరుణ లోకమును
ఇంద్రలోకమును ప్రజాపతి లోకమును క్రమముగఁజేర్చ
యొక యమానుష పురుషుఁడు జీవులను బ్రహ్మమును
బొందించును. వీరు తిరిగి పుట్టరు" అని శ్రుతి. ఇది అర్చ
రాది దేవయానమ్మార్గము.

ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్
తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే. 25
పొగరేల్ కృష్ణపక్షంబు, దక్షిణాయన మార్గమ్మల్
ఇంచు యోగి చంద్రలోక, మొంది మరలఁ బుట్టును.

వివ:- "ఇందు చనిపోవు కర్మపరులు ధూమమును రాత్రిని కృష్ణ
పక్షదేవతను, సంవత్సర దేవతను, పితృలోకమును ఆకాశ
మును చంద్రునిఁ బొంది యందు భోగము లనుభవించి
పుణ్యము క్షీణింపఁగా భూమికిఁ దిరిగి వత్తురు" అని శ్రుతి
ఇది పితృయాణ మార్గము.

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే
ఏకయా యాత్యనావృత్తిం అన్యయాఽఽవర్తతేపునః 26
శుక్ల కృష్ణాఖ్య పక్షంబుల్, జగతిన్ స్థిర మౌగతుల్
ఒక్కదానన్ జన్మ మొందఁ, డొందున్ రెండవదానిచే.

వివ:- శుక్లపక్షగతి=అర్చిరాదిగతి, ఇది జ్ఞానలభ్యము గాన శుక్ల పక్ష మనఁబడెను. కృష్ణపక్షగతి=ధూమగతి ఇది జ్ఞానహీన లభ్యముగానఁ గృష్ణపక్ష మనఁబడెను.

నైతే సృతీ పార్థ ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున. 27
ఈదార్లు తెలియన్ మోహ, మొందఁడు యోగియెవ్వఁడున్
కానఁ గాలంబులం దెల్ల, యోగివి కమ్ము ఫల్గునా.

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు య త్పుణ్యఫలం ప్రదిష్టమ్
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా యోగీ
పరం స్థాన ముపైతి చాద్యమ్. 28

తపములందు, యజ్ఞముల, వేదములయందు
దానములను బుణ్యఫల మెంతటిది గలదొ
యదె యతీతించు నిది యెల్ల నరయు యోగి
మఱియుఁ బొందును నాద్యమౌ పరమ పదము.

ఇది శ్రీ ............... గణపతి శాస్త్రిచేఁ దెనిఁగిఁపఁబడిన
తెనుఁగు గీతయందు అక్షరబ్రహ్మయోగమను
ఎనిమిదవ యధ్యాయము.

# తెనుఁగు గీత

## తొమ్మిదవ అధ్యాయము.

## రాజవిద్యా రాజగుహ్య యోగము

శ్రీ భగవానువాచ :

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే
జ్ఞానం విజ్ఞాన సహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 1

శ్రీ భగవానుఁ డనియె.

ఈర్ష్యయేలేని నీకిదే, చెప్పెద నతి గూఢమౌ
జ్ఞాన విజ్ఞానముల్ పార్థ: దాన వీడెద వావదల్.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్. 2

రాజవిద్య, రాజగుహ్య, మిది మేలు, పవిత్రమున్
ప్రత్యక్ష జ్ఞేయ, మనాశి: ధర్మ్యంబు సుఖలభ్యమున్.

వివ:- రాజవిద్య=విద్యలలోనెల్ల రాజు. రాజగుహ్యము=రహ
స్యము లన్నిటిలో రాజు. అనాశి=నాశములేనిది.

అశ్రద్దధానాః పురుషాః ధర్మ స్యాస్య పరంతప
అప్రాప్య మాం నివర్తంతే మృత్యు సంసారవర్త్మని. 3

ఈ ధర్మంబున శ్రద్ధను బూనని మర్త్యుఁ డర్జునా
నన్నుఁ బొందకయే మృత్యు, సంసారాంబుధిలోఁబడున్

వివ:- మృత్యుసంసారము=మృత్యువుతో నిండిన సంసారము.

మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా
మత్స్థాని సర్వ భూతాని న చాహం తే ష్వవస్థితః. 4

అవ్యక్తమూర్తినౌ నాచే , నిండె నీజగ మంతయున్
నాలోన సర్వభూతంబు, లుండె; నేలేను వాటిలో.

వివ:- నా స్వరూపముగ నాలో భూతములున్నవి. వాస్తవమునకు నేను వానిలో లేనని భావము.

న చ మత్స్థాని భూతాని పశ్యమే యోగ మైశ్వరమ్
భూతభృన్న చ భూతస్థో మ మాత్మా భూతభావనః. 5

నాయందున్ లేవు భూతంబుల్, చూడు నాదివ్యయోగమున్
భూతముల్ దాల్తు; లేనందు, నాయాత్మ పెంచుభూతముల్

వివ:- సూర్యుఁడు కదలకున్నను జలాది చలనమును బట్టి సూర్యునికిఁ గదలిక కల్పించినట్లు దేవునియం దున్నట్లు కల్పింపఁబడినను వాస్తవమునకు వానిలో భూతములు లేవని భావం.

యథాకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ. 6

మింట నెప్పు డున్న గాలి, యెల్లెడనుండు గొప్పదై
యట్లె నాలోన భూతంబు, లుండు నంచు నెఱుంగుమీ.

సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతిమామికామ్
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్. 7

కల్పాంత మందు బూతంబుల్, నా ప్రకృతిన్ లయించును
కల్పారంభమునన్ వాని, మరలన్ నే సృజించెదన్.

ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః
భూతగ్రామ మిమంకృత్స్న్నం అవశం ప్రకృతేర్వశాత్. 8

నా ప్రకృతిన్ నిగ్రహించి, ప్రకృతి వశమైన యీ
భూతంబు లెల్లఁ బ్రకృతిన్, మఱిన్ మఱి సృజించెదన్.

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ
ఉదాసీనవదాసీనం అసక్తం తేషు కర్మసు. 9

ఆ కర్మలందుఁ జిక్కక, మధ్యస్థువలె నుండిన
నన్నా యాకర్మలెప్పుడున్ బంధింపఁ జాల వర్జునా.

మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సూయ చరాచరమ్
హేతు నానేన కౌంతేయ జగ ద్విపరివర్తతే. 10

సాక్షినై యుండునావల్లఁ, జరాచరజగంబులన్
బుట్టించున్ బ్రకృతే గాన, నీ లోకము భ్రమించును.

అవజానంతిమాం మూఢాః మానుషీం తనుమాశ్రితం
పరం భావ మజానంతో మమ భూత మహేశ్వరం. 11

భూతేశమూర్తినౌనాదు పరతత్త్వ మెఱుంగక
మర్త్యదేహ మూనితి నం చవమానింతురినన్ జడుల్.

మోఘాశా మోఘ కర్మాణో మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీ మాసురిం చైవ ప్రకృతిం మోహినీ శ్రితాః. 12

జ్ఞానంబు కర్మలున్ గోర్కెల్, బుద్ధులు వ్యర్థమై చవన్
మోహపెట్టెడి యాసుర, ప్రకృతిం గొల్తురి మూర్ఖులు.

మహాత్మాన స్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః
భజం త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్. 13

మహాత్ములైననో దైవ, ప్రకృతి నాశ్రయించి నన్
భూతాది నవ్యయుం దెల్సి, గొల్తు రనన్యచిత్తులై.

సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. 14

నన్నెప్పుడు కీర్తించుచుఁ, బూన్కితో దీక్ష పూనియున్
నిత్యంబు భక్తి మ్రొక్కుచు, నుపాసింతురు శ్రద్ధతో.

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖం. 15

జ్ఞానయజ్ఞంబుచేఁ గొంద ఱేకంబుగను వేఱుగా
పల్గతుల విశ్వరూపు, నన్నుపాసింతుర్ గొల్చుచున్.

అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధం
మంత్రోఽహమహమేవాజ్యం అహమగ్నిరహం హుతం. 16

నేను క్రతు, నేను యజ్ఞ, మే నౌషధంబు, నే స్వధన్
మంత్ర మేను, హవి స్సేను నేనగ్ని, నేను హోమమున్.

పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోంకారః ఋక్సామ యజురేవచ. 17

ఈ జగత్తుకుఁ దండ్రిని, దల్లిన్, ద్రష్టను, తాతను
ఓంకారమేను; వేద్యంబన్, ఋక్కున్ సామయజుస్సులన్.

గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసశ్శరణం సుహృత్
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయమ్. 18

గతిన్ భర్తన్ బతిన్ సాక్షిన్, వాసంబు దిక్కుమిత్రుఁడన్
జన్మన్ లయంబు స్థానంబు, రాశి నవ్యయబీజమున్.

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే।
తే పుణ్య మాసాద్య సురేంద్ర లోకం
అశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్. 20

తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామిచ
అమృతం చైవ మృత్యు శ్చ సదస చ్చాహ మర్జున, 19

తపింతున్ వర్ష మాపుదు, వర్షింతు: నేనె మృత్యువన్
అమృతంబేనె, సత్తును నసత్తు నేనె ఫల్గునా !

వైదికులు సోమరస మాని పాప ముడిగి
క్రతుల ననుఁ గొల్చి స్వర్గంబుకై తపింత్రు
వారు పుణ్యమౌ దేవేంద్రపదము నొంది
యచట దివ్యభోగంబుల ననుభవింతురు.

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవం త్రయీ ధర్మ మనుప్రపన్నా
గతా గతం కామకామా లభంతే. 21

ఆ విశాలమౌ స్వర్గంబు ననుభవించి
పుణ్యము నశింప వత్తురు భువికి మరల
ఎపుడు వేదధర్మ మనుసరించి నడుచు
కామపరు లిట్లె రాకపోకలఁ జరింత్రు.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానా యోగక్షేమం వహామ్యహమ్. 22

అనన్యచిత్తులై నన్ను నెంచి కొల్చుచు నిత్యమున్
స్థిరులై యుండువారల యోగక్షేమము పూనెదన్

యే చాన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాఽన్వితాః
తేపి మామేవ కౌంతేయ! యజంత్యవిధి పూర్వకమ్. 23
శ్రద్ధతో నన్యదేవుల, నెవ్వారు భజియింతురో
తెలియకుండ వారలున్, నన్నె యజింతు రర్జునా! ?

అహం హి సర్వ యజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ
నతు మా మభిజానంతి తత్త్వే నాత శ్చ్యవంతి తే. 24
సర్వ యజ్ఞంబుల కేను, భోక్తను ప్రభుండను జుమీ
వారా నన్పరిగాం గాంచ లేక పడెద రందుచే.

యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్ 25
దేవుం గాంతురి దేవభక్తుల్, పితరున్ బితృభక్తులున్
భూతభక్తులు భూతాళిన్, నన్గాంతురి నాదుభక్తులున్

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః. 26
పత్రమో, పుష్పమో, పండో, నీరో భక్తి నెదిచ్చినన్
భక్తిన్ జితాత్ముం డర్పింప, చు దాని దాని భుజించెదన్.

య త్కరోషి య దశ్నాసి య జ్జుహోషి దదాసి యత్
య త్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్. 27
ఏది చేతు, వెది తిందు, వేది వేల్తు వె ఉచ్చెదో
ఏది జపింతు వదెల్ల నా కర్పణమ్మొనరుప్పమీ.

శుభా శుభ ఫలై రేవం మోక్ష్యసే
సన్న్యాసయోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి 28

ఇట్లనచో శుభా శుభ, ఫలంబౌ కర్మబంధముల్
బోవన్; సన్న్యాసయోగివై, ముక్తుఁడవై నన్నుఁ గాంతువు.

నమోఽహం సర్వభూతేషు సమేద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం 29

సర్వభూతాలఁ దుల్యుండ, నాకు లేరు రిపుల్ ప్రియుల్
భక్తితోఁ గొల్చువారిలోఁ, నేనుందు, వారు నాయెడన్,

అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః. 30

కడున్ దుష్టుండె యయ్యు నన్ననన్యభక్తిఁ గొల్చుచో
సాధువే యని యెంచనౌ, సాధునిశ్చయుఁ డాతఁడు.

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి. 31

అంత ధర్మాత్ముఁడై వేగ, శాశ్వతశాంతి నొందును
నిశ్చయం బిది, నాభక్తుఁ డెప్డు నశింపఁ డర్జునా!

మాంహి పార్థ! వ్యపాశ్రిత్యయేఽపిస్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రాః తేఽపి యాంతి పరాంగతిం 32

భక్తులైన స్త్రీలు వైశ్యుల్, శూద్రులు పాప జన్ములున్
నన్నాశ్రయించి యర్జున! కాంతు రుత్తమమౌ గతిన్,

కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యాః భక్తా రాజర్షయ స్తథా
అనిత్య మసుఖం లోకం ఇమం ప్రాప్య భజస్వ మామ్. 33

పుణ్యులౌ బ్రాహ్మణుల్ భక్తుల్, రాజర్షుల్ గాంచ రెట్లిఁకన్
నశ్వరం బార్తిమయ మౌ, నీ జన్మన్ నన్నె గొల్వుమీ.

మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి యుక్త్వైవం ఆత్మానం మత్పరాయణః 34

నన్నె భావింపు నన్గొల్వు నన్ వేల్చు నన్నె మ్రొక్కుమీ
యిట్లాత్మఁ జేరి నన్ గొల్వ, నన్నె పొందెద వర్జునా!

ఇది శ్రీ ......................... గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపబడిన
తెనుఁగు గీతయందు రాజవిద్యా రాజగుహ్యయోగము
తొమ్మిదవ యధ్యాయము.

— 0 —

# తెనుఁగు గీత

## పదవ యధ్యాయము

## విభూతి యోగము

శ్రీ భగవానువాచ :

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః
యత్తేహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా।

శ్రీ భగవానుఁ డనియె.

నామాటల్ విని పొంగెడి, నీకు హితంబు గోరుచున్
ఇంకన్నేఁ జెప్పె నుత్తమ, వాక్యంబుల్ విను ఫల్గునా. 1

న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః.

నాదు జన్మ మెఱుంగరు, దేవతలు మహర్షులున్
అన్ని విధాల నే నాదిన్, మహర్షిదేవతాళికిన్. 2

యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే

పుట్టువాదియు లేనట్టి, లోకేశున్ నన్నెఱింగిన
వాఁడు మర్త్యుల జ్ఞానియై, సర్వపాపంబులన్ విడున్. 3

బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః
సుఖం దుఃఖం భవో భావో భయం చాభయ మేవచ.

బుద్ధి జ్ఞాన మమోహంబు, సత్య, దమ, శమ, క్షమల్
సుఖంబు దుఃఖమున్ భీతి, యభీతి, చావుఁబుట్టుకల్. 4

వివ:- అమోహము = అవివేకముతోఁ బ్రవర్తింపకుండుట, దమము=బహిరింద్రియ నిగ్రహము, శమము=అంతరింద్రియ నిగ్రహము, క్షమ=ఓర్పు.

అహింసా సమతా తుష్టిః, తపోదానం యశోఽయశః
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః. 5

అహింస, సమతా, తృప్తుల్, దాన కీర్త్యపకీర్తులున్
తప స్సనెడి భావంబుల్, వేర్వేఱ నేన గూర్చితిన్.

మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః 6

సప్తర్షుల్, సనకాదులున్, మనువుల్ పదునల్వురున్
మద్భావుల్ మన్మనోజాతుల్, వారి సృష్టియె యీ ప్రజల్

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః. 7

నాయీ విభూతిన్ యోగంబున్, సరిగా వేఁ డెఱుంగునో
వాఁడొందున్ స్థిరమౌ యోగ, మే సందేహము లేదిటన్.

అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః 8

నేనె యంతకు మూలంబు, నాచే నెల్లఁ బ్రవర్తిలున్
అంచు నన్నెంచి కొల్తురు, భావనాయుతులౌ బుధుల్.

మచ్చిత్తా మద్గత ప్రాణా బోధయంతః పరస్పరమ్
కథయంత శ్చ మాం నిత్యం తుష్యంతిచ రమంతిచ. 9

నా కిచ్చి ప్రాణ చిత్తంబుల్, బోధించుకొంచు నొండొటన్
నన్గూరిచ్చి చెప్పుకొం చెప్డు, క్రీడింతుర్, తృప్తి గాంతుఁ.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్
దదామి బుద్ధియోగంతం యేన మా ముపయాంతి తే. 10

నిత్యంబు శ్రద్ధధానులై, ప్రీతిస్ భజించువారికిన్
సద్బుద్ధియోగ మిచ్చెద, వారు నన్గాంతురి దానిచే.

తేషామే వానుకంపార్థం అహ మజ్ఞానజం తమః
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. 11

వారి ననుగ్రహింపఁగా, నే నజ్ఞానాంధకారమున్
బోఁగొట్టుదున్ మదిన్ నిల్చి, భాసించు జ్ఞానదీపికన్.

అర్జున ఉవాచ :

పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్యం ఆదిదేవ మజం విభుమ్. 12

అర్జునుం డనియె :

నీవు పరంధాముఁడవు, శుచివిన్ బరమాత్మవున్
శాశ్వతుఁగఁ బురుషుఁగా, దివ్యుఁగా నాదిదేవుఁగా.

ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే. 13

అజుఁగా విభుఁగా నిన్ను, దేవర్షి నారద దాసితుల్
సర్వర్షుల్ దేవల వ్యాసు, లందుర్; చెప్పెద వీవును.

సత్య మేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ!
న హి తే భగవన్! వ్యక్తిం విదుర్దేవా న దానవాః. 14
నాకుఁ జెప్పిన దంతయు, సత్యం బని తలంచెదన్
భగవానుఁడ! నీ జన్మ, యెఱుంగరు సురాసురుల్.

స్వయమే వాత్మ నాత్మానం, వేత్థ త్వం పురుషోత్తమ!
భూతభావన! భూతేశ! దేవదేవ! జగత్పతే! 15
భూతపోషక! భూతేశ! దేవదేవ! జగత్ప్రభూ!
పురుషోత్తమః యాత్మచేఁ, జూతు వాత్మన్ స్వయంబుగా.

వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మ విభూతయః
యాభిర్విభూతిభి ర్లోకాన్ ఇమాం స్త్వంవ్యాప్య తిష్ఠసి. 16
ఏయే విభూతులతో నీ, లోకంబుల్ నిండియుంటివో
ఆ దివ్యమౌ విభూతుల, జెప్పందగుదు వన్నియున్.

కథం విద్యా మహం యోగిన్ త్వాం సదా పరిచింతయన్
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్మయా. 17
ఓ యోగి! యెట్లు నిన్నెంచి, నేఁ దెల్సికొందు నెప్పుడున్
ఏ భావంబుల ధ్యానింప, దగు దో భగవానుఁడా!

విస్తరే ణాత్మనో యోగం విభూతిం చ జనార్దన!
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్. 18
నీ యోగము నీ విభూతిఁ; బూర్తిగఁ జెప్పు మింక, నీ
వాక్యామృత మెంత విన్న, నాకేమి తృప్తిగల్గదు.
శ్రీ భగవా నువాచ :

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మ విభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నా స్త్యంతో విస్తరస్య మే.

శ్రీ భగవాఁ డనియె.
ఇప్పుడే నీకుఁ జెప్పెద, దివ్యమౌ నావిభూతులన్
ముఖ్యముగ విను పార్థా! వానికి నంతు లేదిలన్.

అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః
అహ మాదిశ్చ మధ్యం చ భూతానామంతఏవచ. 20
సర్వ భూతంబులం దున్న, యాత్మను నేనె యర్జునా!
నేనె ప్రాణుల కాదిని, నేనె మధ్యము నంతమున్.

ఆదిత్యానా మహం విష్ణుః జ్యోతిషాం రవి రంశుమాన్
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ. 21
ఆదిత్యుల విష్ణువేను, జ్యోతులలోన సూర్యుఁడన్
మరుత్తులందు మరీచిన్, నక్షత్రంబులఁ జంద్రుఁడన్.

వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా 22
శ్రుతులన్ సామవేదంబు, దేవతలందు నింద్రుఁడన్
ఇంద్రియంబులఁ జిత్తంబున్, భూతంబులందు జ్ఞానమన్.

రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్షరక్షసాం.
వసూనాం పావకశ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్. 23
రుద్రులలో శంకరుఁడన్, యక్షులలోఁ గుబేరుఁడన్.
వసువులందు వహ్నిని, కొండలం దేను మేరువన్.

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ! బృహస్పతిమ్
సేనానీనా మహం స్కందః సరసా మస్మి సాగరః. 24
పురోహితుల ముఖ్యుఁడౌ, గీష్పతిన్ నేనె ఫల్గునా!
సేనానులందు స్కందుండ, సరస్సుల సముద్రుఁడన్.

మహర్షీణాం భృగురహం గిరా మ స్మ్యేక మక్షరం
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః 25
మహర్షులయందు భృగువే, నోంకార మేను వాక్కులన్
యజ్ఞాల జపయజ్ఞంబ, హిమాద్రిన్ స్థావరంబులన్.

అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీనాంచ నారదః
గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః 26
చెట్లలో రావిచెట్టేను, నారదుండన్ సురర్షులన్
గంధర్వులం జిత్రరథుం, డేఁ గపిలుండ సిద్ధులన్.

ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవం
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్. 27
ఆ యమృతంబుతోఁ బుట్టు, నుచ్చైశ్శ్రవంబ వాజులన్
ఐరావతంబ నేన్గుల నరులందు నరేశుఁడన్.

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్
ప్రజన శ్చాస్మి కందర్పః సర్పాణా మస్మి వాసుకిః 28
ఆయుధంబుల వజ్రంబ గోవులన్ గామధేనువన్
సంతానంబిడు మారుండఁ, బాములం దేను వాసుకిన్.

అనంత శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్
పితౄణా మర్యమాచాస్మి యమ స్సంయమతా మహమ్ 29
అబ్జంతుల వరుణుండన్, నాగులం దే ననంతుఁడన్
పితరులన్ పితృరాజున్, యముఁడన్ సంయుతాత్ములన్

వివ:- అబ్జంతులన్=జలజంతువులలో.

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్
మృగాణాంచ మృగేంద్రోఽహంవైనతేయశ్చ పక్షిణామ్ 30

ప్రహ్లాదుండను దైత్యులం గాలంబున్ గణకాళిలో
జంతులం దేను సింహంబన్, గరుత్మంతుండం బక్షులన్

వి:- గణకాళి= కాలగణన చేయువారు

పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహమ్
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ 31
పావనంబులలో గాలిన్, రాముండ శస్త్రధారులన్
మత్స్యాదుల మకరంబట నదులందును జాహ్నవిన్.

సర్గాణా మాది రంత శ్చ మధ్యం చైవాహ మర్జునా!
అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతా మహం 32
సృష్టుల కేనె యాదిని, నేనె మధ్యము నంతమున్
విద్యలం దాత్మవిద్యను, జల్పకులందు వాదమున్

వివ:- వాదము=యదార్థవిచారము.

అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్యచ
అహమే వాక్షయః కాలో దాతాఽహం విశ్వతోముఖః 33
అక్షరాల నకారంబన్, సమాసంబుల ద్వంద్వమన్
నేనె యక్షయకాలంబన్, సర్వతోముఖకర్తను

మృత్యు స్సర్వహర శ్చాహం ఉద్భవశ్చ భవిష్యతాం
కీర్తిశ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా 34
అన్నిటిం జంపుమృత్యువన్, భావిజన్మకు హేతువన్
స్త్రీలకీర్తిన్ సిరిన్ వాక్కున్ స్మృతిన్మేధన్ధృతిన్ క్షమన్

వివ:- స్త్రీలయొక్క కీర్తి మొదలైనవి నేనె యని భావము.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్
మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః. ౩౫
సామములందు బృహత్సామమ్, గాయత్రిన్ ఛందసంబులన్
మాసాల మార్గశీర్షంబన్, ఋతువులలో వసంతుఁడన్.

ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్. ౩౬
జూదమన్ వంచకులలోఁ దేజస్వులందుఁ దేజమున్
జయం బేను ప్రయత్నంబన్, సాత్త్వికులందు సత్త్వమన్.

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః
మునీనా మ ప్యహం వ్యాసః కవీనా ముశనాః కవిః. ౩౭
యాదవులందుఁ గృష్ణుండఁ, బాండవులందుఁ బార్థుఁడన్
మునులం దేను వ్యాసుండఁ, దత్త్వదర్శుల శుక్రుఁడన్.

దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహం ౩౮
శిక్షించువారిలో శిక్షన్, నీతి నేను జిగీషులన్
గోప్యంబులందు మౌనంబన్, జ్ఞానులం దేను జ్ఞానమున్

య చ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున!
న తదస్తి వినా యత్స్యాత్ మయా భూతం చరాచరం ౩౯
సర్వభూతంబుల కెది, బీజమో నే నదర్జునా
నేను లేని చరాచర, భూతంబు లెందు లేవిలన్

నాంతస్తే మమ దివ్యానాం విభూతీనాం పరంతప!
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. 40

దివ్య మౌనావిభూతుల, కంతంబు లేదు ఫల్గునా!
విభూతివిస్తరం బిది, చెప్పితిన్ సంగ్రహంబుగా

యద్య ద్విభూతిమత్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా
తత్తదే వావగచ్ఛత్వం మమ తేజోఽంశసంభవం. 41

విభూతి గల దేదేదో, యేదేది శుభయుక్తమో
అయ్యై దయ్యదె నాతేజ. నంశం బని యెఱుంగుమీ.

అథ వా బహునై తేన కిం జ్ఞాతేన తవార్జున!
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. 42

పోని వేయేల యిదెల్లన్, దెలియ నేల యర్జునా!
నే నీ సర్వజగ మ్మొక్క, యంశచే నిల్పి యుంటిని.

ఇది శ్రీ ................ గణపతి శాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగు గీత యందు విభూతి యోగమను
ప ద వ య ధ్యా య ము.

— () —

# తెనుఁగు గీత

## పదునొకండవ అధ్యాయము.

## విశ్వరూప దర్శన యోగము

అర్జున ఉవాచ :

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితమ్
యత్త్వయోక్తంవచ స్తేన మోహోఽయంవిగతోమమ 1

అర్జునుం డనియె.

అనుగ్రహింపఁగా నన్ను, గూఢ మౌనాత్మ తత్త్వమున్
గూర్చి యేమేమి చెప్పితో, దాన నామోహ మేగెను.

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా
త్వత్తః కమలపత్త్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్ 2
నీవల్ల విస్తరంబుగా, భూతసృష్టి లయంబులన్
అక్షయంబైన మాహాత్మ్య; మిప్పుడే వింటి మాధవా!

ఏవ మేత ద్యథాత్థ త్వం ఆత్మానం పరమేశ్వర!
ద్రష్టు విచ్ఛామి తే రూపం ఐశ్వరం పురుషోత్తమ! 3
ఆత్మఁ గూర్చి పరమేశా! నీ వన్నట్లిది యంతియే
నీ యీశ్వ రాకృతిన్ జూడఁ, గోరెదఁ బురుషోత్తమా!

మన్యసే యదేత చ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో
యోగేశ్వర! తతోమేత్వం దర్శయాత్మాన మవ్యయమ్. 4

అది నేఁ జూడ శక్యంబౌ! నని నీవు తలంచినన్
యోగేశ్వర! నశింపని, నీ యాత్మ నాకుఁ జూపుమీ.

వివ:- ఈశ్వరుఁడు = జ్ఞానైశ్వర్యశక్తి బలవీర్యతేజ స్సంప న్నుఁడు.

శ్రీ భగవా నువాచ :

పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః
నానావిధాని దివ్యాని నానా వర్ణాకృతీని చ. 5

శ్రీ భగవానుఁ డనియె.

పార్థ! చూడుము వందలు, వేనవేల్ నాదురూపముల్
పలువిధం బవి దివ్యంబు, లనేక వర్ణ రూపముల్.

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా
బహూ న్యదృష్ట పూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత! 6

చూడు మాదిత్యవసులన్, రుద్రాశ్వి మరుత్తులన్
ఎన్నండు నీవు చూడని, పల్వింతల్ చూడు మర్జునా!

ఇహైకస్థం జగ త్కృత్స్నం పశ్యాద్య స చరాచరం
మమ దేహే గుడాకేశ! య చ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి 7

ఈ నా మేనున నొక్కచో, నున్న చరాచరంబులౌ
లోకంబుల్ చూడు మింకేది చూడఁ గోరెద వర్జునా!

న తు మాం శక్యసే ద్రష్టు మనే నైవ స్వచక్షుషా
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరం. 8

నన్ను వీక్షింపఁగాఁ జాల, వీభౌతికపుఁ గంటితో
దివ్యనేత్ర మిత్తుఁ జూడు, నా యీ యైశ్వరయోగముల్.

సంజయ ఉవాచ :

ఏవ ముక్త్వా తతో రాజన్! మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరం. 9

సంజయుఁ డనియె.
రాజా! యిట్లని యా మహా, యోగేశ్వరుఁడు కృష్ణుఁడు
చూపించె నర్జునునకు, నీశ్వరు విశ్వరూపమున్

అనేక వక్త్రనయనం అనేకాద్భుత దర్శనం
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధం. 10

ఎన్నొ మోములు గన్నులు, నెంతొ వింతగు రూపమున్
దివ్యభూషలు వస్త్రంబుల్, గల్గు నాదేవుఁ జూపెను.

దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనం
సర్వాశ్చర్యమయం దేవం అనంతం విశ్వతోముఖం. 11

దివ్య మౌమాలలున్ బట్టల్, మంచిగంధంబు దాల్చిన
సర్వాద్భుతున్ దేవుఁ జూపె ననంతున్ విశ్వతోముఖున్.

దివి సూర్య సహస్రస్య భవే ద్యుగపదుత్థితా
యది భా స్సదృశీ సాస్యాత్ భాస స్తస్య మహాత్మనః. 12

మింటిపై వేయిసూర్యులు, నొక్క మాఱుదయించుచోఁ
గల్గు కాంతియె యావిశ్వ, మూర్తికాంతికిఁ దుల్యమౌ.

తత్రైకస్థం జగ త్కృత్స్నం ప్రవిభక్త మనేకధా
అపశ్య ద్దేవ దేవస్య శరీరే పాండవ స్తదా. 13

ఆ విశ్వరూపముందాల్చు, దేవదేవుని మేనునన్
అనేకం బౌజగం బెల్లః బార్థుఁడొక్కెడనే గనెన్.

తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత. 14

ఆశ్చర్య మొంది ఫల్గునుఁ డంతన్ గగురుపాటుతో
దేవున్ మ్రొక్కి, శిరస్సున, నంజలిఁ గూర్చి యిట్లనెన్.

అర్జున ఉవాచ :

పశ్యామి దేవాం స్తవ దేవ! దేహే
సర్వాం స్తథా భూత విశేష సంఘాన్!
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీం శ్చ సర్వా నురగాం శ్చ దివ్యాన్. 15

అర్జునుం డనియె.

దేవ! నీ మేన సమస్తదేవతలను
వివిధభూత సంఘముల విశ్వేశుఁ డగుచు
పద్మపీఠమునందున్న బ్రహ్మదేవు
మునుల, దివ్యోరగుల, నిదే గనుచు నుంటి.

అనేక బాహూదర వక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్!
నాంతం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప! 16

కండ్లు మోములు పొట్టలు కరము లొప్ప
వెల్లెడ ననంతరూపి వౌనిన్నుఁ గాంతు
విశ్వరూప! విశ్వేశ! యే విధిని నీకు
నంతమును మధ్య, యాదియు నరయ వయ్యె.

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతం!
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతాత్
దీప్తానలార్కద్యుతి మప్రమేయం. 17

గదయు మణికిరీటంబు చక్రమును దాల్చి
తేజపుం బుంజ మెల్లెడ దీప్తు లొలుకఁ
జూడ రాక, యెల్లెడ వెల్గుసూర్యవహ్ని
లటు లెసఁగు నప్రమేయు, నిన్నరయుచుంటి.

త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం విధానం!
త్వ మవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే. 1

ఎఱుఁగఁదగి నాశ మొందని పరుఁడ వీవు
సకల మగు నీజగతికి నాశ్రయమ వీవు
అక్షరుఁడవు శాశ్వత ధర్మ రక్షకుఁడవు
ఆ సనాతన పురుషుండ వని తలంతు.

అనాది మధ్యాంత మనంత వీర్యం
అనంతబాహుం శశి సూర్య నేత్రం!
పశ్యామి త్వాం దీప్తహుతాశ వక్త్రం
స్వతేజసా విశ్వ మిదం తపంతమ్. 19

నడుమ, తుది, మొదల్ లేక యనంతబల, మ
నంతబాహులు, రవిచంద్రు లనెడి కనులు

గలిగి, మోమున నగ్ని యు వెలుఁగ, జగము
నెల్లఁ దేజుచే వెల్గించు నిన్నుఁ గాంతు.

ద్యావా పృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశ శ్చ సర్వాః!
దృష్ట్వాద్భుతం రూప ముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్! 20

ఈ సకల భూనభో మధ్య దేశమందు
నెల్ల దిశల నీ వొకఁడవే నిండి యుంటి
వరయ రాని యీ యద్భుతమైన రూపు
గని త్రిలోకముల్ భీతి నొందెను మహాత్మ!

అమీ హి త్వాం సురసంఘా విశంతి
కేచి ద్భీతాః ప్రాంజలయో గృణంతి!
స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధ సంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః. 21

సురగణంబులు వీరె నిన్ జొచ్చుచుండి
రిదె మఱొకరు భీతిని దోసి లిడి నుతింతుర
స్వస్తి యని మహాఋషి సిద్ధసంఘములును
స్తుతియొనర్చు చుండిరి నిండు స్తుతుల నిన్ను.

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః
విశ్వే౽శ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ!
గన్ధర్వ యక్షాసుర సిద్ధ సంఘాః
వీక్షంతే త్వాం విస్మితా శ్చైవ సర్వే. 22

రుద్రులును, సాధ్యు, లాదిత్యులును వసువులు
విశ్వదేవుల్, మరుత్తు, లశ్వినులు పితరు
లసుర గంధర్వ యక్ష సిద్ధాది గణము
లరయుచున్నారు నిన్నిదే యచ్చెరువున.

రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో! బహుబాహూరుపాదమ్!
బహూదరం బహుదంష్ట్రాకరాలం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్. 23

చాలముఖములు, కన్నులు, కాళ్ళు, తొడలు
బాహువులు, పొట్టలును గల్గి బహుళదంష్ట్ర
లెంతొ భయపెట్ట నీ మహాకృతిని గాంచి
భువనములు నేను వ్యథగాంతు మో మహాత్మ!

నభస్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాల నేత్రమ్!
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో! 24

వెలిఁగి, మిన్నంటి, రంగురంగులను మెఱసి
నోర్లు తెఱచి మండెడి పెన్నసుల వెసఁగు
నినుఁ గనుంగొని; వ్యథ చెందు మనసుతోడ
ధైర్యమొందను, శాంత మొందను ముకుంద!

దంష్ట్రా కరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని

దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ ! జగన్నివాస ! 25

కోరలను గ్రూరమై రయికాలవహ్ని
వోలె నుండెడి నీదు మోములను గాంచి
దిక్కు లెఱుఁగను, సుఖము శాంతియును గాంచ
నన్నుదయఁ జూడు మీశ ! జగన్నివాస !



అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసంఘైః
భీష్మో ద్రోణః సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః. 26



ధరణిపాలురతోపాటు ధార్తరాష్ట్రు
లెల్లరును, భీష్ముఁడును ద్రోణుఁ డింకఁ గర్ణుఁ
డట్టులే మనలోని యోధాగ్రగణ్యు
లెంతొ త్వర పూని నిన్ బ్రవేశింతు రిదిగొ



వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రాకరాళాని భయానకాని
కేచి ద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః 27

వారు దంష్ట్రలఁ గ్రూరమై భయదమౌచు
నొప్పు నీ వక్త్రగుహఁ జొచ్చుచున్నవారు
చూర్ణమగు శిరస్సులతోడఁ జూడఁబడెద
రొక్క కొందఱు పండ్లలోఁ జిక్కుకొనుచు.

యథా నదీనాం బహవోఽంబువేగాః
సముద్రమే వాభిముఖా ద్రవంతి
తథా తవామీ నరలోకవీరాః
విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి. 28

పాఱుచుండెడి నదులప్రవాహ మెట్లు
సంద్రమున కెట్టయెదురుగాఁ జాలువాఱు
నట్లె యీ లోకము వీరు అంద ఱిపుడె
పడుచు నున్నారు మండు నీవదనములను.

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయ సమృద్ధ వేగాః
తథైవ నాశాయ విశంతి లోకాః
త వాపి వక్త్రాణి సమృద్ధవేగాః 29

బాగుగా మండు మంటలోఁ ద్వరితగతిని
మిడత లెట్లు నాశనముకై పడుచునుండు
నట్టులే నాశనమున కయి ప్రాణులెల్లఁ
బడుచు నుండెను వేగ నీ వదనములను.

లేవిహ్యసే గ్రసమాన స్సమంతాత్
లోకా న్సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః
తేజోభి రాపూర్య జగత్సమగ్రం
భాస స్తవోఽగ్రాః ప్రతవంతి విష్ణో 30

మండు ముఖములతోడ బ్రహ్మాండములను
వన్నిటిని నెల్ల యెడ గ్రమింగి నాకుచుంటి

వోమహావిష్ణు ! యీ సర్వ భువనములను
తేజముల నింపి నీయుగ్రదీప్తి కాల్చు

ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమోస్తుతే దేవ వర ప్రసీద
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్. 31

భయద రూపంబు దాల్తు వెవ్వండవొ తెలుపు
నుతు లివిగొ నీకు దేవ ! యనుగ్రహింపు
మాద్యు నిన్నెఱుంగఁ దలంతునయ్య నేను
నీ ప్రవర్తన మెట్టిదో నే నెఱుఁగ.

శ్రీ భగవానువాచ :

కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకా న్సమాహర్తు మిహప్రవృత్తః
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 32

శ్రీ భగవానుఁ డనియె.

జగములను జంపి వర్ధిల్లు సమయ మేను
భువనముల సంహరింపఁగఁ బూనుకొంటి
నెదిరి పక్షమందలి యోధులెల్లఁ గూడ
నుర్వి నీవు లేకున్నను నుండ రిచట,

తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వాశత్రూ న్భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్

మయైవై తే నిహతాః పూర్వ మేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్! 33

కాన లెమ్మింకఁ గీర్తిని గాంచు మోయి
యరులఁ గెల్చి సుస్థిరరాజ్య మనుభవింపు
సర్వు లిట మున్నె నాచేతఁ జంపఁ బడిరి
యర్జున! నిమిత్తమాత్రంబ వగుమి యందు.

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యా నపి యోధవీరాన్
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠాః
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్. 34

ద్రోణుఁడును భీష్ముఁడు జయద్రథుండు కర్ణుఁ
డింకఁ గల యుద్ధవీరుల నెల్లఁ గూడ
నేనుజంపిన వారినే నీవు చంపు
వగవకుము పోరుము జయింతు వనిని రిపుల.

సంజయ ఉవాచ :

ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య. 35

సంజయుఁ డనియె.

అంతఁ గృష్ణుని యీ పల్కు లాలకించి
యంజలి ఘటించి వణఁకుచు నర్జునుండు

మ్రొక్కి మాటిమాటికి భయమొందుచుండి
నమ్రుఁడై గద్గదధ్వనిఁ దటికెఁ గృష్ణు.

అర్జున ఉవాచ :

స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా
జగ త్ప్రహృష్య త్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః. 36

అర్జునుఁ డనియె:

బాగు ! కృష్ణ ! నీ మహాత్మ్యవర్ణనమున
భువన మానందమొందె ప్రేముడిని మున్గ
భయముతో రాక్షసులు దిశల్ పాఱుచుండ
రోగిని సిద్ధసంఘము మ్రొక్కుచుండె రిదిగా.

కస్మా చ్చ తే న నమేర న్మహాత్మన్ !
గరీయసే బ్రహ్మణో౽ప్యాదికర్త్రే
అనంత దేవేశ ! జగన్నివాస !
త్వ మక్షరం సదస త్తత్పరం యత్. 37

ఏల మ్రొక్కరు నిను వారలిట మహాత్మ !
ఆది కర్తయౌ బ్రహ్మను నతిశయిలేదు
ఘన ! యనంత దేవేశ ! జగన్నివాస !
సత్త సత్తుల దాటు నక్షరుఁడ వీవు.

వివ:- సత్తు=ఉన్నది అసత్తు లేనిది.

త్వ మాదిదేవః పురుషః పురాణః
త్వ మస్య విశ్వస్య పరం నిధానం
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనంతరూప! 38

మొదటి దేవుఁడవు పురాణ పురుషుఁడవు
ఈ సకల జగత్తుకు మూల మీవె సుమ్ము
జ్ఞానివియు జ్ఞేయమవు పరంధాముఁడవును
నఖిలమునునిండె నీచే ననంతరూవ !

వివ:- జ్ఞానివి=తెలిసికొనువాఁడవు, జ్ఞేయవవు= తెలిసికొనఁదగిన వాఁడవు.

వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాంకః
ప్రజాపతిస్త్వం ప్రపితామహ శ్చ
నమోనమ స్తేస్తు సహస్రకృత్వః
పున శ్చ భూయోఽపి నమోనమ స్తే. 39

వాయువు యముండ వగ్నివి వరుణుఁడవును
సోముఁడు ప్రజాపతివి ప్రపితామహుఁడవు
వందనము నీకు వేనవేల్ వందనములు
వందనము నీకు మఱిమఱి వందనములు

నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమో స్తు తే సర్వత ఏవ సర్వ !
అనంతవీ ర్యాఽమితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వ. 40

వందనము ముందుప్రక్కకు, వందనంబు
వెనక, వందన మెల్లెడ విశ్వరూప !
ఓయనంతవిక్రమ ! యమితోరుబలుండ
వంతయును నిండితివి సర్వమైతి వనఘ !

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ! హే యాదవ ! హే సఖేతి
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వాపి, 41

నీదు మాహాత్మ్య మెఱుంగని నేను నిన్ను
యదుకుమారక ! మిత్ర ! కృష్ణా ! యటంచు
ప్రణయమునఁ గాని పొరపాటువలనఁగాని
సఖుఁడ వని యెంచి యెదియంటి సాహసమున.

య చ్చావహాసార్థ మసత్కృతోఽసి
విహార శయ్యాసన భోజనేషు
ఏకోఽథవాఽప్యచ్యుత ! తత్సమక్షం
తత్క్షామయే త్వా మహ మప్రమేయం. 42

పండుకొనుచుఁ దిరుగుచుఁ గూర్చుండి తినుచు
నెదుటఁ గాని చాటునఁ గాని యేది నవ్వు
లాటకుఁ దిరస్కరించుచు నంటి నదియుఁ
గూడ నిన్నమేయ క్షమింప వేడికొందు.

పితాసి లోకస్య చరాచరస్య
త్వ మస్య పూజ్య శ్చ గురు ర్గరీయాన్

న త్వత్సమోఽ స్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ ! 43

ఈ చరాచర జగమున కీవె పితవు
దీనికిం బూజ్యుఁ డుత్తముఁ డైన గురుఁడ
వెనయ నీకుఁ దుల్యుఁడు గాని ఘనుఁడు గాని
మఱి జగాల లేఁ డెట్లుండు నిరుపమాన !

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యం
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుం. 44

అందుచే భక్తి మ్రొక్కి సాష్టాంగముపడి
యీశ, నిను, స్తుత్యు దయఁ గల్గఁ జేసికొందు
జనకుఁడు సుతున్ బలె, సఖుండు సఖునిఁబోలెఁ
బ్రియను బ్రియుఁ డట్లు దేవ ! సైరింతఁ దగుదు.

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే
తదేవ మే దర్శయ దేవ ! రూపం
ప్రసీద దేవేశ ! జగన్నివాస ! 45

మును గనని రూపు గని మోద మొందినాఁడ
భయముచేఁ గూడ వ్యాకులం బయ్యె మనసు
రూవ మా మున్పటిదె దేవ ! చూప వయ్య
నన్ను దయఁ జూడు మీశ ! జగన్నివాస !

కిరీటినం గదినం చక్రహస్తం
ఇచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే. 46

గద కిరీటము చక్రంబు గలుగు నిన్నె
చూడఁగా వలె నని కోరు చుంటి నయ్య!
వేల బాహులు గలవాఁడ! విశ్వమూర్తి!
తిరుగ నానాల్గు చేతుల నరుఁడ వగుము.

శ్రీ భగవా నువాచ :

మయా ప్రసన్నేన తవార్జు నేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్
తేజోమయం విశ్వ మనంత మాద్యం
య న్మే త్వదన్యేన న దృష్టపూర్వం. 47

శ్రీ భగవానుఁ డనియె.

ఇటు ప్రసన్నుఁడ నైన నే నిపుడె నీకు
నాత్మయోగానఁ జూపితి నాద్యు నింతి
విభువు, తేజోమయు, మనంత విశ్వరూప;
మింతవఱ కెవ్వ రిది చూడ రీవు తక్క.

న వేదయజ్ఞాధ్యయనైర్న దానైః
న చ క్రియాభిర్న తపోభి రుగ్రైః
ఏవం రూప శ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర. 48

వేద, దాన, యజ్ఞాధ్యయనాదిచేతఁ
గాని, యుగ్రతపములచేఁ గాని, క్రియల
చేతఁగాని యుర్విఁ ద్వదన్యచేత నిట్టి
రూపు గల నేఁ గనఁబడ నోకురు ప్రవీర!

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృ ఙ్మమేదం
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య. 49

క్రూర మగు నిట్టి నాదు స్వరూప మరసి
మోహము, వ్యథ నీవొందక పోదు వింక
భయము వీడి యానందభావంబుతోడ
మరల సెప్పటి నా పె య్యరయు మిదిగొ.

సంజయ ఉవాచ :

ఇత్యర్జునం వాసుదేవ స్తథో క్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా. 50

సంజయుఁ డనియె:

వాసుదేవుఁ డట్టులె యని పార్థుఁ బలికి
చూపె మరలఁ దనదు పూర్వరూప మపుడు
ఆ మహాత్ముఁడు సౌమ్యదేహంబు పూని
యులికి వణఁకెడు నర్జును నూరడించె.

అర్జున ఉవాచ :

దృష్ట్వేదం మానుషం రూపం, తవ సౌమ్యం జనార్దన
ఇదానీ మస్మి సంవృత్తః, సచేతాః ప్రకృతిం గతః 51

అర్జునుఁ డనియె.

సౌమ్యంబౌ నీదు మానవ, దేహంబు చూచి మాధవా!
యిప్పుడు గద స్వాస్థ్యంబు, గాంచి నాపై జ మొందితిన్.

శ్రీ భగవా నువాచ :

సుదుర్దర్శ మిదం రూపం, దృష్టవా నసి య న్మమ
దేవా అప్యస్య రూపస్య, నిత్యం దర్శనకాంక్షిణః 52

శ్రీ భగవానుఁ డనియె.

ఎట్లున్ జూడఁగరాని యీ, నాదు రూపము గాంచితి
వీరూపు దేవతల్ గూడఁ జూడఁ గోరెద రెప్పుడున్.

నాహం వేదై ర్న తపసా, న దానేన న చేజ్యయా
శక్య ఏవంవిధో ద్రష్టుం, దృష్టవా నసి మాం యథా. 53

వేదాలచేఁ దపసుచే, దానంబుచేత నిష్టిచే
నిట్టి నేను గనన్‌రాను, నీనిప్డు చూచినట్లుగా.
భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన, ప్రవేష్టుం చ పరంతప. 54

అనన్య భక్తిచేతనె, సరిగా నీదృశున్ ననున్
దెలియఁ జూడఁ జేరఁగ, శక్యంబు సుమ్మి ఫల్గునా!

మత్కర్మకృన్మత్పరమో, మద్భక్తస్సంగవర్జితః
నిర్వైర సర్వభూతేషు, యస్స మామేతి పాండవ॥ 55

నాకర్మల్ చేసి నన్నమ్మి, నా భక్తిన్ గోర్కె లేకయే
సర్వప్రాణులఁ బ్రేమించు, వాఁడు నన్నొందు నర్జునా.

ఇది శ్రీ ........................ గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగు గీతయందు విశ్వరూపదర్శన యోగమను
పదునొకండవ యధ్యాయము.

—10—

# తెనుఁగు గీత

## పండ్రెండవ అధ్యాయము.

### భక్తియోగము

అర్జున ఉవాచ :

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే
యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః 1

అర్జునుం డనియె.

నీకర్మ లెప్పుడున్ జేయు, భక్తులా లేక యక్షరు
నవ్యక్తుఁగొల్చు వారలా, యెవ్వరు యోగిసత్తముల్.

శ్రీ భగవా నువాచ :

మ య్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతాః తేమే యుక్తతమా మతాః. 2

శ్రీ భగవానుఁ డనియె.

నాయందుఁ జిత్తమున్ నిల్పి, నిత్యంబు నిర్మలాత్ములై
యత్యంత శ్రద్ధతోఁ గొల్చు, వారలే యోగిసత్తముల్.

వివ:- ఇది సగుణోపాసకుల విషయము.

యే త్వక్షర మనిర్దేశ్యం అవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువం. 3

ఇట్టిదనంగఁ జింతింప, రాని యవ్యక్తు సర్వగున్
స్థిరుస్, నిశ్చలుఁ గూటస్థు, నక్షరున్ వేరు గొల్తురో.

వి॥:- అవ్యక్తుని=జాతిగుణక్రియారహితుని, కూటస్థుఁడు=కూటమనఁగా అబద్ధము లేక మాయ. అందు, స్థ=ఉన్నవాఁడు. త్రాటియందు పాము గుణములు వలె మాయా ప్రపంచము నందు (ఆత్మ) అభ్యాస రూపముగా ఉన్నది బ్రహ్మము.

సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితేరతాః. 4

వారింద్రియంబులం గెల్చి, యెల్లెడ సమబుద్ధులై
సర్వప్రాణులకున్ మేలు, గోరుచున్ నన్నె గాంతురు.

క్లేశోఽధికతర స్తేషాం అవ్యక్తాసక్త చేతసామ్
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే. 5

కాని యవ్యక్తమున్ గోరు, వారి కెక్కువ కష్టమౌ
దేహాభిమానవంతుల, కవ్యక్తగతి కష్టమే.

వి॥:- అవ్యక్తమును=నిర్గుణబ్రహ్మమును, దేహాభిమానమును విడనఁగాని పరబ్రహ్మము పొంద శక్యముగాదు కావున దేహాభిమానము గలవారికి నిర్గుణబ్రహ్మమును బొందుట కష్టమని భావము.

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే. 6

సర్వకర్మలు నాయందె, యర్పించి నన్నె గోరుచున్
అనన్యబుద్ధి నెవ్వారు, ధ్యానించుచును గొల్తురో.

తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్
భవామి న చిరా త్పార్థః మ య్యావేశితచేతసామ్. 7
వారిని మృత్యుసంసార, వార్థిం దరింపఁ జేయుదున్
నాపై జిత్త ముంచువారి, కాలసింపను ఫల్గునా.

మ య్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. 8
నాయందె చిత్త ముంచుమి, నాయందె బుద్ధి నిల్పుమీ
నాయందె యుందు విటుపై, సందియమేమి లేదిటన్.

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ. 9
మరి నాయందుఁ జిత్తంబు, గట్టిగ నిల్ప లేనిచో
అభ్యాస యుక్తిచే సైన, నన్నొందఁ గోరు మర్జునా:

అభ్యాసే వ్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ
మదర్థ మపి కర్మాణి కుర్వ న్సిద్ధి మవాప్స్యసి. 10
అభ్యాసశక్తి లేనిచో, నాకర్మల్ చేయఁ గోరుమీ
నాకోసంబును గర్మలు, చేసినన్ సిద్ధి గల్గును.

అథై తద ప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. 11
అవియుం జేయ లేనిచో, నాభక్తి నాశ్రయించియున్
ఫలేచ్ఛ వీడి చేయుము, కర్మల్ జితేంద్రియుండవై.

శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే
ధ్యానాత్కర్మఫలత్యాగః త్యాగాచ్ఛాంతి రనంతరమ్. 12

జ్ఞాన మభ్యాసమున్ మించు, ధ్యానంబుమించు జ్ఞానమున్
దానిన్ మించు ఫలత్యాగ, మద్దానివెంట శాంతియౌ.

వివ:- ఇంతవఱకు అభ్యాసాదులను జెప్పి యింక నిందుఁ గర్మ ఫల త్యాగమహిమ యెంతటిదో ప్రశంసింపఁ బడెను. అభ్యాసము జ్ఞానసహితము కాని అభ్యాసము. జ్ఞానము= యుక్తిసహితోపదేశ పూర్వక జ్ఞానము.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ. 13

ఏ ప్రాణుల ద్వేషింపక, స్నేహంబు దయ గల్గియున్
మమత్వాహంకృతుల్ వీడి, సుఖదుఃఖాలఁ దుల్యులై.

వివ:- మమత్వము=ఇది నాదియను భావము. అహంకృతి= నేనింత గొప్పవాఁడ నను భావము.

సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పితమనోబుద్ధి ర్యోమద్భక్తస్స మే ప్రియః 14

తుష్టులై యెప్డు యుక్తులై, వశులై, స్థిరంబులై
మనోబుద్ధుల్ నాకర్పించు, భక్తుల్ నాకుఁబ్రియుల్ సుమీ.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః
హర్షామర్షభయోద్వేగైః ముక్తో యస్సచ మే ప్రియః. 15

లోకంబు తమవల్లఁదా, మద్దానివల్లఁ గుందక
హర్షచింతల్ వెతన్ గిన్కన్, వీడు వారలె మత్ప్రియుల్.

అనపేక్ష శ్శుచి ర్దక్షః ఉదాసీనో గతవ్యథః
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః. 16

దుఃఖేచ్ఛల్ వీడి శుచులై, తటస్థులౌచు దక్షులై
కర్మ ఫలంబులన్ వీడు, భక్తుల్ నాకుఁ బ్రియుల్ సుమీ.

యో న హృష్యతి న ద్వేష్టి నశోచతి న కాంక్షతి
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః. 17
హర్షింపక, ద్వేషింపక, కుందక, కోర్కె కోరక
శుభాశుభ ఫలంబులన్, వీడు భక్తులె మత్ప్రియుల్.

సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః
శీతోష్ణ సుఖదుఃఖేషు సమ స్సంగ వివర్జితః. 18
శత్రుమిత్రుల మానావ- మానాల సమ బుద్ధులై
శీతోష్ణ సుఖదుఃఖాలఁ సములై సంగశూన్యులై.

తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్
అనికేతః స్థిరమతిః భక్తిమాన్మే ప్రియో నరః. 19
నిందాస్తుతులఁ దుల్యులై, తుష్టులై యున్నదానితో
ఇల్లంచు లేక మౌనులౌ, స్థిరుల్ భక్తులె మత్ప్రియుల్.

యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్దధానా మత్పరమాః భక్తాస్తేఽతీవ మే ప్రియాః. 20
శ్రద్ధాళులై నమన్ నమ్మి, నేఁజెప్పు ధర్మయుక్తమౌ
నీ యమృత ముపాసించు, భక్తులె నా కతి ప్రియుల్.

ఇది శ్రీ ................ గణపతి శాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగు గీత యందు భక్తియోగ మను
పండ్రెండవ యధ్యాయము.

]-o-[

# తెనుఁగు గీత

## పదమూఁడవ అధ్యాయము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

అర్జున ఉవాచ :

ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవః 1

అర్జునుఁ డనియె :

క్షేత్రంబున్ మఱి క్షేత్రజ్ఞున్ జ్ఞానంబున్ మఱి జ్ఞేయమున్
ప్రకృతిన్ బురుషున్ గృష్ణా ! తెల్పికొనంగఁ గోరెదన్.

శ్రీ భగవా నువాచ :

ఇదం శరీరం కౌంతేయ ! క్షేత్ర మిత్యభిధీయతే
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి త ద్విదః. 2

శ్రీ భగవానుఁ డనియె :

అర్జున ! యీ శరీరంబు, క్షేత్రంబని యనఁబడున్
ఈ క్షేత్రం బెఱుంగువానిన్ క్షేత్రజ్ఞుఁడండ్రు తద్విదుల్.

క్షేత్రజ్ఞ చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతంమమ 3

సర్వ క్షేత్రంబులన్ నన్ను, క్షేత్రజ్ఞుఁగ నెఱుంగుమీ
ఆ క్షేత్రంబును క్షేత్రజ్ఞు, నెఱుంగుటయె జ్ఞానమౌ.

తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారియత శ్చయత్
స చ యో యత్ప్రభావ శ్చ తత్సమాసేన మే శృణు. 4
క్షేత్రమేదో, యెట్టిదో, యే, మార్పొందు; దేన నే మగున్
క్షేత్రజ్ఞుఁ డే, ప్రభావుండో, సంగ్రహంబుగఁ జెప్పెదన్.

ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః 5
ఋషులచేత, వేర్వేఱు, ఛందాల, స్థిరయుక్తులన్
బ్రహ్మ సూత్రంపు సూక్తులఁ బల్లతిన్ జెప్పఁగా బడెన్.

మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః. 6
పంచభూతాలు, తన్మాత్రల్, జ్ఞాన కర్మేంద్రియంబులున్
బుద్ధ్యహంకార చిత్తంబు, అవ్యక్త మివి తత్త్వముల్.

వివ:- తన్మాత్రలు=శబ్ద స్పర్శ రూప రస గంధములు.

ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ 7
ద్వేషేచ్ఛ సుఖదుఃఖంబుల్ సంఘాత చేతనా ధృతుల్
మార్పొందు నివ్వి క్షేత్రము, నాఁబడు సంగ్రహంబుగన్
వివ:- సంఘాతము=దేహేంద్రియ సంఘాతము.

అమానిత్వ మదంభిత్వం అహింసా క్షాంతి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః 8
నిర్మమత వినయంబు, నహింస, ఋజుతా క్షమల్
గురుపూజయు శౌచంబు, మనోజయంబు స్థైర్యమున్,

ఇంద్రియార్థేషు వైరాగ్యం అనహంకార ఏవ చ
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్. 9
విషయంబుల వైరాగ్య మహంకారంబు వీడుట;
జన్మన్ మృతిన్ జరన్, వ్యాధిన్ బాధన్ దోషముగాంచుట.

అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వ, ఇష్టానిష్టోపపత్తిషు 10
అనాసక్తియు స్త్రీపుత్ర గృహాదుల విరక్తియున్
ఇష్టానిష్టాది వస్తులం, దెప్పుడు సమచిత్తమున్.

మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ
వివిక్త దేశసేవిత్వం, అరతి ర్జనసంసది. 11
అనన్య శ్రద్ధతో నన్ను, విడనాడని భక్తియున్
ఏకాంతస్థలసేవయు నప్రీతి జనగోష్ఠులన్,

అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్
ఏతత్‌జ్ఞాన మితి ప్రోక్తం, అజ్ఞానం య దతోఽన్యథా 12
అధ్యాత్మజ్ఞాననిత్యత, తత్త్వజ్ఞానార్థదృష్టియున్
ఇవే జ్ఞానంబు నాఁబడు, నజ్ఞానమే తదన్యమౌ.

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే
అనాదిమ త్పరంబ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే. 13
జ్ఞేయం బేదో వచించెద, దాని నెఱుంగ ముక్తియౌ
అదనాది పరబ్రహ్మ, సత్తు నసత్తుఁ గాదది.

సర్వతః పాణిపాదం తత్, సర్వతోఽక్షి శిరోముఖం
సర్వత శ్రుతిమల్లోకే, సర్వ మావృత్య తిష్ఠతి. 14

చెవుల్ కండ్లు తలల్ మోముల్, కాళ్ళేతు లన్నివైపులన్
గలదై యది లోకంబు, లన్నిటిన్ గప్పి వర్తిలున్.

సర్వేంద్రియ గుణాభాసం, సర్వేంద్రియ వివర్జితం
అసక్తం సర్వభృచ్చైవ, నిర్గుణం గుణభోక్తృ చ 15
సర్వేంద్రియగుణం బయ్యు, నింద్రియంబులు లేనిది
కోర్కె లేక యెల్లఁ దాల్చు, గుణియై నిర్గుణం బగున్.

బహి రంత శ్చ భూతానాం, అచరం చర మేవ చ
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్. 16
భూతంబులఁ బయిన్ లోనన్, చరమై యచరంబునై
సూక్ష్మం బౌట గనన్ రాక, యుండు దవ్వుల దగ్గరన్.

అవిభక్తం చ భూతేషు, విభక్త మివ చ స్థితం
భూత భర్తృ చ తద్జ్ఞేయం. గ్రసిష్ణు ప్రభవిష్ణు చ 17
భూతాళి నేక మయ్యును, విడియై నట్టు లుండును
ప్రాణులం బెంచి చంపుచుఁ, బుట్టించు, నదె జ్ఞేయము.

జ్యోతిషా మపి తజ్జ్యోతిః, తమసః పర ముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్యధిష్ఠితం. 18
అది జ్యోతులకున్ జ్యోతి, మనస్సున్ దాటి వర్తిలున్
జ్ఞేయంబున్ జ్ఞానమున్ గమ్య; మదుండు నెల్లప్రాణులన్.

ఇతి క్షేత్రం తథా జ్ఞానం, జ్ఞేయం చోక్తం సమాసతః
మద్భక్త ఏత ద్విజ్ఞాయ, మద్భావా యోపపద్యతే. 19
క్షేత్ర జ్ఞాన జ్ఞేయములన్, సంగ్రహంబుగఁ జెప్పితిన్
నా భక్తుం డివి తెలిసి, నాతో నైక్యము నొందును.

ప్రకృతిం పురుషం చైవ, విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ; విద్ధి ప్రకృతిసంభవాన్. 20
ప్రకృతియున్ బురుషుండు, ననాదులని యెంచుమీ
వికారంబుల్ గుణంబులున్, బుట్టెన్ బ్రకృతివల్లనే.

కార్యకారణ కర్తృత్వే, హేతుః ప్రకృతి రుచ్యతే
పురుష స్సుఖదుఃఖానాం, భోక్తృత్వే హేతురుచ్యతే. 21
కార్యకారణముల్ మాఱ, నాప్రకృతియె హేతువు
సుఖదుఃఖంబులెల్లకు, నాపురుషుండె భోక్తయౌ.

పురుషః ప్రకృతిస్థోహి, భుంక్తే ప్రకృతిజా న్గుణాన్
కారణం గుణసంగోఽస్య, సదసద్యోని జన్మసు. 22
ప్రకృతిన్ బురుషుండుంటన్, భుజించుఁ దద్గుణంబులన్
వీనికిన్ గుణసంగంబు, సదసజ్జన్మ హేతువౌ.

వివ:– సదస జ్జన్మహేతువు = మంచిచెడ్డ జన్మలకుఁ గారమున్

ఉపద్రష్టానుమంతాచ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో, దేహేస్మిన్ పురుషః పరః 23
సాక్షియై మోదకుండయి, భర్తయు భోక్త యీశుఁడై
పరమాత్మ యనన్మేనఁ, బరుఁడై పురుషుం డగున్.

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ
సర్వథా వర్తమానోపి న స భూయోభిజాయతే. 24
ఈ ప్రకృతిపురుషుల, నిట్లు తెలుంగువారలు
ఎల్లరీతిన్ గుణాళితో, నుండియుఁ బుట్టఁ బోవరు.

ధ్యానేనాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. 25
సాంఖ్యయోగానఁ గొందఱు, కర్మయోగానఁ గొందఱున్
ధ్యానానఁ గొంద; ఱాత్మచేఁ, గొందఱు గాంతు రాత్మమున్

అన్యే త్వేవ మజానంతః; శ్రుత్వాన్యేభ్య ఉపాసతే
తే పి చాతితరం త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. 26
కొంద ఱిట్టు లెఱుంగక, కొల్తు రన్యులచే విని
విన్న దానిని నమ్మిన, వారున్ దరింత్రు మృత్యువున్.

యావ త్సంజాయతే కించిత్, సత్త్వం స్థావరజంగమం
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్, త ద్విద్ధి భరతర్షభ! 27
జగతిం బుట్టుజంగము, స్థావరంబులు సర్వమున్
క్షేత్రక్షేత్రజ్ఞసంసక్తిఁ. బుట్టు నంచు నెఱుంగుమీ.

సమం సర్వేషు భూతేషు, తిష్ఠంతం పరమేశ్వరం
వినశ్య త్స్వ వినశ్యంతం, యః పశ్యతి స పశ్యతి. 28
సర్వభూతసముండౌచు, భూతంబులు నశించినన్
నశింపకుండు సర్వేశుఁ, జూచు మర్త్యుఁడె చూచును.

సమం పశ్యన్హి సర్వత్ర, సమవస్థిత మీశ్వరం
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాంగతిం. 29
ఎల్లెడన్ ధ్రువుఁడై యుండు, నీశున్ సమంబ చూచువాఁ
డాత్మచే నాత్మఁ జంపఁడు, కానఁ బొందును సద్గతిన్

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాత్మానమ, కర్తారం సపశ్యతి. 30

ప్రకృతే యెల్లెడన్ గర్మల్, గావించుఁగాని యాత్మయో
కర్తృమాత్రము గాదంచు, జూచు మర్త్యుఁడె చూచును,
యదా భూతపృథగ్భావం ఏకస్థ మనుపశ్యతి
తత ఏవచ విస్తారం బ్రహ్మసంపద్యతే తదా 31
భూతంబు లెల్ల వేర్వేఱ, యొక్క యాత్మను నుంటయున్
అవెల్ల నాత్మచే నౌటఁ, జూచు వాఁడొందు బ్రహ్మమున్,
అనాదిత్వా న్నిర్గుణత్వాత్, పరమాత్మాఽయ మవ్యయః
శరీరస్థోపి కౌంతేయ! న కరోతి న లిప్యతే. 32
గుణంబుల్ మొదలున్ లేమి, నీయీశుఁ డవ్యయుం డగున్
మేన నుండియుఁ జేయఁడు, నంటం బడఁడు కర్మచే.
యథా సర్వగతం సౌక్ష్మ్యాత్, ఆకాశం నోపలిప్యతే
సర్వ త్రావస్థితో దేహే, తథాత్మా నోపలిప్యతే, 33
సూక్ష్మమై యుండ, వ్యాపియౌ నాకాశ మంట రానటుల్
ఎల్లమేనులలో నాత్మ, యంటంబడదు వానిచే.
యథా ప్రకాశయ త్యేకః, కృత్స్నం, లోక మిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం, ప్రకాశయతి భారత. 34
సూర్యుఁ డొక్కండె యీలోక, మెల్లన్ వెల్గించురీతిగా
ఈక్షేత్ర మెల్ల క్షేత్రజ్ఞుఁ, డొండె వెల్గించు నర్జునా,
క్షేత్రక్షేత్రజ్ఞ యోరేవం, అంతరం జ్ఞాన చక్షుషా
భూతప్రకృతి మోక్షం చ యే విదు ర్యాంతి తే పరం. 35
జ్ఞాననేత్రంబుచే నిట్లు, క్షేత్రక్షేత్రజ్ఞభేదమున్
భూతమాయను దాటుటన్, దెల్సి గాంతుర్ జనుల్ పరున్
ఇది శ్రీ ................ గణపతి శాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగు గీతయందు క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము
పదునాల్గవ యధ్యాయము

# తెలుగు గీత

## పదునాల్గవ అధ్యాయము

## గుణత్రయ విభాగ యోగము

శ్రీ భగవానువాచ :

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమం
యద్జ్ఞాత్వా మునయ స్సర్వే పరాంసిద్ధి మితోగతాః 1

జ్ఞానంబులందు శ్రేష్ఠమౌ, బ్రహ్మజ్ఞానము చెప్పెదన్
దానిం దెల్సి మునులెల్ల, నిందుండి గాంచి రుద్గతిన్,

ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః
సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ. 2

ఈజ్ఞాన మాశ్రయించియె, పొందిరి నా స్వరూపమున్
సృష్టియందును బుట్టరు, చావరు ప్రళయంబునన్.

మమయోనిర్మహ ద్బ్రహ్మ తస్మిన్ గర్భందధామ్యహమ్
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత ! 3

మహత్తు బ్రహ్మయునైన, నా మాయ భూతహేతువు
అందు బీజంబు నాటెద, నందుండి భూతసృష్టి యౌ.

సర్వయోనిషు కౌన్తేయ! మూర్తయ స్సంభవన్తియాః
తాసాం బ్రహ్మ మహ ద్యోనిః అహం బీజప్రదః పితా. 4

సర్వ యోనులయం దెట్టి, రూపము లుద్భవించునో
వాని యోని మహ ద్బ్రహ్మ, నే బీజ మొసంగు తండ్రిని.

సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః
నిబధ్నన్తి మహాబాహో! దేహేదేహిన మవ్యయమ్. 5
సత్త్వ రజస్తమంబులు, ప్రకృతివల్లఁ బుట్టును
అవ్యయం బగునాత్మను, నవ్వి బంధించు మేనిలో.

తత్ర సత్త్వం నిర్మలత్వాత్, ప్రకాశక, మనామయమ్
సుఖసంగేన బధ్నాతి, జ్ఞానసంగేన చానఘ! 6
నిర్మలం బౌట సత్త్వంబు, ప్రకాశక, మబాధమున్
జ్ఞానా సక్తిన్ సుఖాసక్తి, నది బంధించు నాత్మను.

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగ సముద్భవమ్
తన్నిబధ్నాతి కౌన్తేయ ! కర్మసంగేన దేహినమ్. 7
రజస్సు రాగ రూపంబై, తృష్ణాసక్తి భవంబ గున్
కర్మ సంగంబుచే, నద్ధి, యాత్మను బంధించు నర్జునా !

వివ:- అప్రాప్తేచ్ఛ, తృష్ణ, దొరికినది పోఁగా రక్షించు కోర్కె ఆసక్తి.

తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినమ్
ప్రమా దాలస్య నిద్రాభిః తన్నిబద్నాతి భారత ! 8
తమ స్సజ్ఞాన జన్యంబు, మోహపెట్టును దేహులన్
ప్రమా దాలస్య నిద్రల, నది బంధించు నాత్మను.

సత్వం సుఖే సంజనయతి రజః కర్మణి భారత!
జ్ఞాన మావృత్యతు తమః ప్రమాదే సంజయ త్యుత. 9
సత్త్వంబు సుఖమున్ గూర్చు, రజస్సు చేర్చుఁ గర్మలో
తమస్సు జ్ఞానమున్ గప్పి, ప్రమాదంబునఁ జేర్చును.

రజస్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత !
రజ స్సత్త్వం తమశ్చైవ తమ స్సత్త్వం రజస్తథా. 10
రజస్సున్ తమసున్ గెల్చి సత్త్వంబు మీఱు సత్త్వమున్
తమస్సున్ మీఱు రజస్సు; తమస్సారెంటి గెల్చును.

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వ మి త్యుత
ఈ మేన నెల్లద్వారాలఁ, బ్రకాశ మదయించును
అదే జ్ఞాన; మదే మీఱ, సత్త్వంబు హెచ్చు టెంచుమీ.

లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణా మశమః స్పృహా
రజ స్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ ! 12
రజోగుణంబు వర్ధిల్ల, లోభంబును బ్రవృత్తియున్
కర్మారంభము నశాంతి, స్పృహయున్ గల్గు నర్జునా!

అప్రకాశోఽ ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ
తమ స్యేతాని జాయంతే, వివృద్ధేకురు నందన ! 13
తమోగుణంబు వర్ధిల్ల, సవివేకము మోహమున్
కర్మలం దప్రవృత్తియు, బ్రమాద మౌను ఫల్గునా !

యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రలయం యాతి దేహభృత్
త దోత్తమవిదాం లోకాన్ అమలాన్ ప్రతిపద్యతే. 14
సత్త్వగుణంబు వర్ధిల్ల, మరణ మ్మొందు ప్రాణియో
యుత్తమ తత్త్వవేత్తల, స్వచ్ఛలోకంబులన్ గనున్.

రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే.
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. 15

రజస్సు వర్ధిలన్ జచ్చి, కర్మాసక్తులఁ బుట్టును
అట్లే తమోనిమగ్నుండు, మూఢజన్మలఁ బుట్టును.

కర్మణ స్సుకృత స్యాహుః సాత్త్వికం నిర్మలమ్ ఫలం
రజసస్తు ఫలం దుఃఖం అజ్ఞానం తమసః ఫలమ్. 16
పుణ్యనిర్మల కర్మకు, శుద్ధసత్త్వ ఫలంబగున్
రజః ఫలంబౌ దుఃఖంబౌ, సజ్ఞానమె తమస్సుకున్.

సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ
ప్రమాద మోహౌ తమసో, భవతోఽజ్ఞాన మేవచ. 17
సత్త్వంబుచేత జ్ఞానంబౌ, రజస్సుచేత లోభమౌ
తమస్సుచేఁ ప్రమాదంబున్, మోహాజ్ఞానము లయ్యెడున్.

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థాః, మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్యగుణవృత్తిస్థాః, అధోగచ్ఛంతి తామసాః 18
సాత్త్వికుల్, పైకిఁ బోదురు మధ్య సుందురు రాజసుల్
నీచగుణస్వభావులౌ, తామసు, లుంద్రు క్రిందనే.

విప:- సాత్త్వికులు, సత్యలోకమువఱకు గల దేవలోకమున దేవ జన్మలను రాజసులు పుణ్య పాపమిశ్రిత భూలోకములో మనుజ్యజన్మలను. తామసులు పశ్వాది జన్మలను బొం దెదరని భావము.

నాన్యం గుణేభ్యః కర్తారం, యదా ద్రష్టాఽనుపశ్యని
గుణేభ్యశ్చపరం వేత్తి, మద్భావం సోఽధిగచ్ఛతి. 19
"గుణాళికంటె వేఱొండు కర్త లేదు; గుణాళికిన్
నేఁ బరుండ" నవిగాంచు ద్రష్ట నా యైక్య మొందును.

గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహ సముద్భవాన్
జీవన్మృత్యు జరాదుఃఖై ః, విముక్తోఽమృత మశ్నుతే 20
ఈదేహహేతులౌ మూఁడు గుణంబుల్ దాటి దేహియో
జన్మ మృత్యు జరా దుఃఖ ముక్తుఁడై మోక్ష మొందును.

అర్జునుఁ డనియె.

కైర్లిఙ్గై స్త్రీన్ గుణా నేతాన్, అతీతో భవతి ప్రభో
కి మాచారః కథం చైతాన్, త్రీన్ గుణానతివర్తతే. 21
త్రిగుణాతీతుని సెట్టి, చిహ్నాల నెఱుగందగున్
తత్ప్రవర్తన మెట్టిది, దాటునెట్లి గుణంబులన్,

ప్రకాశం చ ప్రవృత్తించ, మోహ మేవ చ పాండవ!
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి. 22

శ్రీ భగవా నువాచ :

ప్రకాశంబు ప్రవృత్తియు, మోహంబును ప్రవర్తిలన్
వానిద్వేషింపఁ డవ్వియు, మరలిపోవగఁ గోరఁడుఁ

వివ:- సత్త్వగుణకార్యమగు ప్రకాశమును, రజోగుణ కార్యమగు
ప్రవృత్తియు, తమోగుణ కార్యమగు మోహమును ప్రవ
ర్తింపఁగా వానిని అతీతించిన వానిని గుణాతీతుఁడందు
రని భావము,

ఉదాసీనవ దాసీనో, గుణైర్యో న విచాల్యతే
గుణా వర్తన్త ఇత్యేవ, యోఽవతిష్ఠతి నేఙ్గతే. 23
తటస్థువలెఁ గూర్చుండు, గుణాళిచేఁ జలింపఁడు
గుణంబులే ప్రవర్తించు, నని యుండుఁ జలింపక

సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మ కాంచనః
తుల్య ప్రియా ప్రియోధీరఃతుల్యనిందాత్మసంస్తుతిః. 24
కష్టసుఖాల్ స్తుతినిందల్, ప్రియాప్రియంబులుస్ధృతిన్
బెడ్డలున్ రాళ్ళుబంగారు, సమతన్ జూచి తుష్టుఁడౌ.

మానావమానయో స్తుల్యః, తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారంభ పరిత్యాగీ, గుణాతీతస్స ఉచ్యతే. 25
శత్రుమిత్రుల మానావ, మానాల సమదృష్టియై
సర్వకర్మల్ విడువాఁడు, గుణాతీతుఁ డనంబడున్

మాంచ యోఽవభిచారేణ భక్తి యోగేన సేవతే
స గుణాన్సమతీ త్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. 26
నన్నెవ్వఁడెప్డు వీడని, భక్తితో సేవ చేయునో
వాఁడీగుణంబులన్ దాటి. బ్రహ్మతో నైక్యమొందును.

బ్రహ్మణోహిప్రతిష్ఠాఽహమ్ అమృత స్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాన్తికస్య చ. 27
నాశ మొందక, మాఱక, శాశ్వత ధర్మ రూపమై
నిత్యానంద స్వరూపంబౌ. బ్రహ్మకున్ నేనె మూలము.

ఇది శ్రీ ................ గణపతి శాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగు గీతయందు గుణత్రయ విభాగ యోగ మను
పదునాల్గవ యధ్యాయము

]-o-[

# తెనుఁగుగీత

## పదునైదవ అధ్యాయము

## పురుషోత్తమ యోగము

శ్రీ భగవానువాచ :

ఊర్ధ్వమూల మధశ్శాఖమ్
అశ్వత్థం ప్రాహు రవ్యయమ్
ఛందాంసి యస్య పర్ణాని
యస్తం వేద స వేదవిత్. 1

శ్రీ భగవానుఁ డనియె ;

పైని వేరు కొమ్మలు క్రిందఁ బర్వి యుండ
ఆది తుది లేని యశ్వత్థమండ్రు దీని
దాని యాకుల్ ఋగాది ఛందస్సు లగును
దానిఁ దెలిసినవాఁడు వేదార్థవిదుఁడు.

వివ:– పైని=అన్నిటికి పైనున్న యుత్కృష్టమైన బ్రహ్మమునకు కొమ్మలువంటివి మహ దహంకార తన్మాత్రాదులు, శ్వః=రేపు, స్థము=ఉన్నది, అశ్వత్థము = రేపు లేనిది సంసారము, రావిచెట్టును. ఇక్కడ సంసారము రావి చెట్టుతో బోల్పఁబడినది.

అధ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖాః
గుణప్రవృద్ధా విషయప్రవాళాః

అధశ్చ మూలా న్యనుస న్తతాని
కర్మానుబంధీని మనుష్యలోకే. 2

గుణములఁ బెరిగి విషయంబు లనెడి చివురు
దొడిగి, కొమ్మల్ పయిని గ్రింద నలముకొనియె
కర్మములఁ బట్టి మర్త్యలోకమున దాని
మూలము లెడతెగక లోన వేళు లూనె

నరూపమ స్యేహ తథోపలభ్యతే
నాంతో న చాది ర్న చ సంప్రతిష్ఠా
అశ్వత్థ మేనం సువిరూఢమూలం
అసంగశ స్త్రేణ దృఢేన ఛిత్వా. 3

ఇం దటుల దీని రూపు గన్పింపకుండె
దీని కాది మధ్యము నంత మేని లేవు
పాతుకొని రాని వేళ్ళ యశ్వత్థ మిద్ది
గట్టి దైన నిష్కామ ఖడ్గమున నరకి.

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా ననివర్తంతి భూయః
త మేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ. 4

ఈ సనాతన సంసార వృక్షగతులఁ
బరపు నయ్యాదిపురుషుని శరణుఁ జొత్తు
మని తలఁచి యెందు చని మఱి మరలిరారొ
యా పదంబె యన్వేషింప నర్హ మింక.

నిర్మానమోహా జిత సఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వంద్వై ర్విముక్తా స్సుఖదుఃఖ సంజ్ఞై
గచ్ఛంత్యమూఢాః పద మవ్యయంతత్. 5

మమత మోహంబు సంగమున్ మానువారు
ఆత్మనిత్యులు నిష్కాము లైనవారు
కష్టసుఖము లాధిగ జంట గననివారు
అజడులును గాంతు రట్టి యవ్యయ పదంబు.

వివ:- అజడులు=జడులు కానివారు.

న త ద్భాసయతే సూర్యో, న శశాంకో న పావకః
య ద్గత్వా న నివర్తంతే, త ద్ధామ పరమం మమ. 6
వెల్గింపఁ డది సూర్యుండు, వెల్గింప రగ్ని చంద్రులున్
దేనిన్ బొంది యిఁకన్ రారో, యదే నావరధామము.

మమైవాంశో జీవలోకే, జీవభూత స్సనాతనః
మనః షష్ఠా నీంద్రియాణి, ప్రకృతిస్థాని కర్షతి. 7
పూర్వుఁడై జీవులం దుండు, జీవుండు నాదు నంశమే
ప్రకృతి నున్న యింద్రియ, మనస్సుల్ వాఁడె లాగును.

శరీరం యదవాప్నోతి, యచ్చా ప్యుత్క్రామ తీశ్వరః
గృహీత్వైతాని సంయాతి, వాయుర్గంధా నివాశయాత్. 8
ఎప్పుడీశుండు పైకేగు, నెప్డు మేను గ్రహించునో
యప్పు డవి దాల్చి యేగున్, బూఁదావిన్ గాలిపోలికన్.

వివ:- అవి=ఆ యింద్రియములును మనస్సును.

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ, రసనం ఘ్రాణ మేవ చ
అధిష్ఠాయ మన శ్చాయం, విషయా నుపసేవతే. 9
చెవులన్ గన్నులన్ ద్వక్కున్, నాల్కను ముక్కుఁ దాల్చియే
యీ దేహమందు మనస్సు సేవించు విషయంబులన్.

ఉత్క్రామంతం స్థితం వాపి, భుఞ్జానం వా గుణాన్వితమ్
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞాన చక్షుషః. 10
మేను వీడుచు నిల్చుచుఁ, దించు, గుణాళిఁ దాల్చుచున్
మించునీశున్ గన రజ్ఞుల్, గాంతురి విజ్ఞాన చక్షువుల్.

యతంతో యోగిన శ్చైనం, పశ్యంత్యాత్మ న్యవస్థితమ్
యతంతో ఽప్యకృతాత్మానో, నైనం పశ్యంత్యచేతసః 11
యత్నించి నిశ్చలున్ యోగుల్, గాంతు రాత్మస్థునీశ్వరున్
అసంస్కృతాత్ములౌమూఢుల్, గాంచరు యత్నమూనియున్

య దాదిత్యగతం తేజో, జగ ద్భాసయతేఽఖిలమ్
యచ్చంద్రమసి య చ్చాగ్నౌ, త త్తేజో విద్ధి మామకమ్. 12
ఎల్లలోకంబు వెల్గించు, నేతేజ ముండె సూర్యులో
చంద్రునందేది, యే దగ్ని, నదె నాదని యెంచుమీ.

గామావిశ్య చ భూతాని, ధారయా మ్యహ మోజసా
పుష్ణామి చౌషధీ స్సర్వాః సోమో భూత్వా రసాత్మకః 13
పృథివిం జొచ్చి భూతంబుల్, ధరింతు నాదు తేజుచే
రసాత్ముఁడై చంద్రుఁడనై, పెంచెద నెల్ల యోషధుల్.
అహం వైశ్వానరో భూత్వా, ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః, పచా మ్యన్నం చతుర్విధమ్. 14

అగ్నిహోత్రుండనై నేను: ప్రాణుల మేనుజొచ్చియే
ప్రాణాపానములం గూడి పచింతు నాలు గన్నముల్.

వివ:- 1 భక్ష్యము=కొఱికితినఁబడునది. 2 భోజ్యము=నాలుకతో చప్పరింపఁబడునది. 3 లేహ్యము=నాకి మ్రింగఁబడునది. 4 చోష్యము=పీల్చఁబడునది. అని యన్నముల నాలుగు విధములు.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తస్స్మృతిర్ జ్ఞాన మపోహనం చ
వేదైశ్చ సర్వైరహ మేవ వేద్యో
వేదాంత కృద్వేదవి దేవ చాహమ్. 15

ప్రాణు లన్నింటి హృది నుండువాఁడ నేను
భ్రమయు స్మృతియు జ్ఞానంబు నావల్ల గలిగె
పుడమిలో సర్వవేదవేద్యుఁడను నేనె
నేనె వేదాంతకారుఁడన్ వేదవిదుఁడ.

ద్వా విమౌ పురుషౌ లోకే, క్షర శ్చాక్షర ఏవ చ
క్షర స్సర్వాణి భూతాని, కూటస్థోఽక్షర ఉచ్యతే. 16
క్షరుండు నక్షరుండంచున్, గలరిద్దఱు పూరుషుల్
క్షరుండౌ సర్వభూతంబుల్, కూటస్థుఁ డక్షరుం డగున్.

వివ:- క్షరుఁడు= నశించువాఁడు, అక్షరుఁడు=నశింపనివాఁడు సకలోత్పత్తికి మూలమైన మాయాశక్తి.

ఉత్తమః పురుష స్త్వన్యః, పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య, బిభర్త్య వ్యయ ఈశ్వరః 17

పరమాత్ముఁ డనబడు, పురుషోత్తముఁ డన్యుఁడు
వాఁ డీలోకత్రయింం జొచ్చి, పోషించు, నవ్యయుఁ డీశుఁడై

యస్మాత్క్షర మతీతోఽహమ్, అక్షరాదపి చోత్తమః.
అతోఽస్మిన్ లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. 18
అక్షరుకన్న శ్రేష్ఠుండన్, క్షరాతీతుఁడఁ గావునన్
లోకవేదములన్ నన్నుఁ, బురుషోత్తముఁ డందురు.

యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్
స సర్వవి ద్భజతి మాం, సర్వభావేన భారత! 19
మూఢుండు గాక, నన్నిట్లు, పురుషోత్తము నెంచెడి
సర్వజ్ఞుఁ డెల్లరీతుల, నన్నె భజించు సత్తునా !

ఇతి గుహ్యతమం శాస్త్రం, ఇద ముక్తం మయాఽనఘ!
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్, కృతకృత్యశ్చ భారత20
ఇట్టి పరమ గూఢమౌ, నీశాస్త్ర మేను జెప్పితిన్
దీనిం దెలియు ధీశాలి, కృతకృత్యుండ యయ్యెడున్.

ఇది శ్రీ ........................ గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపబడిన
తెనుఁగు గీతయందు దైవాసుర సంపద్విభాగ యోగ మను
పదునారవ యధ్యాయము.

(())

# తెనుఁగు గీత

## దైవాసుర సంపద్విభాగ యోగము

## పదునాఱవ అధ్యాయము

శ్రీ భగవా నువాచ :

అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ, స్వాధ్యాయ స్తప ఆర్జవం 1

శ్రీ భగవానుఁ డినియె

నిర్భీతి, చిత్తశుద్ధియు, జ్ఞానయోగాల నిష్ఠయున్
దానంబు దమ తపంబుల్, స్వాధ్యా యార్జవ యజ్ఞముల్.

వివ:- దానము= అన్న ధనాదుల సరిగాఁ బంచుంచుట, దమము బహిరింద్రియ నిగ్రహము, తపము= శారీర, మానసిక, వాచిక నియమరూప తపస్సు స్వాధ్యాయము= మోక్షశాస్త్రాధ్యయనము; ఆర్జవము= కుటిలస్వభావము లేకపోవుట, యజ్ఞము - అగ్నిహోత్రాదులును, ద్రవ్యయజ్ఞ, దేవయజ్ఞ మనుష్య యజ్ఞాదులును,

అహింసా సత్య మక్రోధః, త్యాగ శ్శాంతి రపైశునం
దయా భూతే ష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలం 2

సత్యాహింసల్ శమ శాంతు లపైశునంబు త్యాగమున్
భూతదయ, యచాపల్య, మలౌల్య మార్దవ త్రపల్.

వివ:- శమము = అంతరింద్రియ నిగ్రహము ఆ పైశునము చాడీలు చెప్పకపోవుడ, అచాపల్యము = గడ్డిపరక మొదలగువానిని ఊరక త్రుంచుట మొదలగు ప్రయోజనశూన్యమగు పనుల చేయకపోవుట. అలౌల్యము = విషయేంద్రియ సంపర్కమున వికారము పొందకపోవుట, త్రప = అసత్కర్మము జేయుటకు సిగ్గుపడుట.

తేజః క్షమా ధృతి శ్శౌచం, అద్రోహో నాతిమానితా
వదంతి సంపదం దైవీం అభిజాతస్య భారత ! 3
అద్రోహంబున్ వినయంబున్, ధైర్య మోర్పు శుచిక్షమల్
ఈయని దైవసంపద, గల్గువాఁ డొందు నర్జునా!

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవ చ
అజ్ఞానం చాభిజాతస్య. పార్థ ! సంపద మాసురీమ్. 4
దంభంబు, స్వాభిమానంబు, పారుష్య క్రోధ గర్వముల్
అజ్ఞానం భివియాసుర, సంపదగల్గు వాని కౌ

దైవీ సంప ద్విమోక్షాయ, నిబంధా యాసురీ మతా
మాశుచ స్సంపదం దైవీం, అభిజాతోసి పాండవ ! 5
ముక్తికౌ దైవసంపద, యాసురి బంధకారియౌ
కుందకు దైవసంపద, గల్గువాఁడవు ఫల్గునా !

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్, దైవ ఆసుర ఏవ చ
దైవో విస్తరశః ప్రోక్త, అసురం పార్థ ! మే శృణు. 6
దైవంబు నాసురం బని, భూతసృష్టులు రెండగున్
దైవంబు విస్తరించితి విను మాసుర మర్జునా !

ప్రవృత్తిం చ నివృత్తిం చ, జనా న విదు రాసురాః
న శౌచం నాపి చాచారో, న సత్యం తేషు విద్యతే. 7
ప్రవృత్తియు నివృత్తియు; నెఱుంగ రాసురుల్ జనుల్
ఆచార మేని శౌచం బేన్, సత్య మెన్లేవు వారిలో.

అసత్య మప్రతిష్ఠంతే జగ దాహు రనీశ్వరం
అపరస్పర సంభూతం కి మన్య త్కామహైతుకం. 8
"ఈ లోకంబు నిరాధార, మసత్యంబు నిరీశ్వర
మిది యన్యోన్యకామేచ్ఛన్, జన్మించుఁగాక యే మిఁకన్.

వివ:- నిరీశ్వరము = ఈశ్వరుఁడు లేనిది.

ఏతాం దృష్టి మవష్టభ్య, నష్టాత్మానోఽల్పబుద్ధయః
ప్రభవ న్త్యుగ్రకర్మాణః, క్షయాయ జగతోఽహితాః. 9
అంచు నీదృష్టితో నుండి, నష్టులై, యల్పబుద్ధులై
క్రూరాత్ములై యహితులై, గావింతురు లోకనాశమున్.

కామ మాశ్రిత్య దుష్పూరం, దమ్భమానమదాన్వితాః
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్, ప్రవర్తంతేఽశుచివ్రతాః 10
నింపరాని కామమూని, దంభాభిమాన గర్వులై
మోహానఁ జెడుపూన్కితో, నుందు రశుచిదీక్షులై.

చింతా మపరిమేయాం చ, ప్రళయాంతా ముపాశ్రితాః
కామోప భోగపరమాః, ఏతావ దితి నిశ్చితాః. 11
భోగాలె పరమావధి, యింతే యని స్థిరాత్ములై
చావుదాఁకన్ మున్గుచుంద్రు, మితి లేనట్టి చింతలన్.

ఆశాపాశశతై ర్బద్ధాః, కామక్రోధపరాయణాః
ఈహంతే కామభోగార్థమ్, అన్యాయే నార్థసంచయాన్. 12
ఆశాపాశాల బద్ధులై, కామ క్రోధ వశాత్ములై
భోగంబులకు నార్జింతు, రన్యాయంబుగ ద్రవ్యమున్

ఇద మద్య మయా లబ్ధం, ఇమం ప్రాప్స్యే మనోరథం
ఇద మస్తీద మపి మే భవిష్యతి పునర్ధనమ్. 13
సంపాదించితి నియ్యది, యీ కోర్కె యింకఁ బొందెదన్
ఇది యున్నది, యీధనం, బింక రాఁగల దిప్పుడే.

అసౌ మయా హతశ్శత్రుః, హనిష్యే చాపరానపి
ఈశ్వరోఽహమహంభోగీ సిద్ధోఽహం బలవా న్సుఖీ. 14
ఈ నా శత్రువుఁ జంపితి, నన్యులన్ గూడఁ జంపెదన్
నే నీశ్వరుండ, నే భోగిన్, సిద్ధుండన్ వీరుండన్ సుఖిన్.

ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్యే ఇత్యజ్ఞాన విమోహితాః. 15
ధనాఢ్యుండఁ గులీనుండ, నా సము లెవ్వ రీ భువిన్
యజింతు నిత్తు హర్షింతు, నని భ్రమింతు రజ్ఞతన్.

అనేకచిత్తవిభ్రాంతాః, మోహజాల సమావృతాః
ప్రసక్తాః కామభోగేషు, పతంతి నరకేఽశుచౌ. 16
బహుచిత్తభ్రమ లొందుచు, మోహజాలానఁ జిక్కుచున్
భోగాలం బడి కూలెద, రశౌచ నరకంబునన్.

ఆత్మసంభావితా స్స్తబ్ధా ధన మాన మదాన్వితాః
యజంతే నామ యజ్ఞైస్తే దంభే నా విధిపూర్వకమ్. 17

మన్నించుకొంచుఁ దమ్ము దా, మబ్బి ధనమధాంధులై
బడాయిన్ యజ్ఞముల్ పేరు కొనర్తు రయథావిధిన్.

అహంకారం బలం దర్పం, కామం క్రోధం చ సంశ్రితాః
మా మాత్మ పరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః 18
గర్వాహంకార బలముల్, కామ క్రోధంబు లొందుచున్
స్వ దేహ పరదేహాల, నన్ను ద్వేషింతు రీర్ష్యతో.

తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపా మ్యజస్ర మశుభాన్ ఆసురీ ష్వేవ యోనిషు. 19
నన్ద్వేషించుచుఁ గ్రూరులై, యశుభులైన నీచులన్
సంసారంబున నాసుర, యోనులం దెప్డు ద్రోయుచున్.

ఆసురీం యోని మాపన్నాః మూఢా జన్మని జన్మని
మా మప్రాప్యైవ కౌన్తేయ! తతో యాంత్యధమాంగతిమ్
ఆసుర యోనులం బొందు, మూఢులు జన్మ జన్మలో
నన్నొంద కింక నధమ, గతిన్ గాంతురు ఫల్గునా!

వివ:_ కాన ఇందే నరక వ్యాధికిఁ జికిత్స యగు పుణ్య జ్ఞానాదులు సంపాదింపక ఇంక మందే లేని నరకమునకుఁ బోయి దుఃఖితులై ఏమి చేసిన లాభమేమి, అని భావము.

త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథా లోభః తస్మా దేత త్త్రయం త్యజేత్. 21
కామము క్రోధము, లోభం బను నీ మూడు నాత్మను
నశింపఁజేయు నరక ద్వారంబుల్, వీని వీడుమీ.

ఏతై ర్విముక్తః కౌంతేయ! తమోద్వారై స్త్రిభి ర్నరః
ఆచర త్యాత్మన శ్శ్రేయః తతోయాతి పరాంగతిమ్. 22

అజ్ఞాన నరకద్వారా లీ, మూఁటిఁ బడ కుండువాఁ
డాత్మ శ్రేయ పొంది, నుత్తమగతి గాంచును.

య శ్శాస్త్ర విధి ముత్సృజ్య, వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి, న సుఖం పరాంగతిమ్. ౨౩
శాస్త్రవిధిన్ విడి యెవం, డాశకు లొంగిచేయునో
వాఁడు సిద్ధిని బొందఁడు, సద్గతిన్ సౌఖ్య మొందఁడు.

తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే, కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం, కర్మ కర్తు మిహార్హసి. ౨4
శాస్త్రం బది ప్రమాణంబు, కార్యాకార్య వివేచనన్
కాన శాస్త్రోక్తముం దెల్సి, కర్మలు చేయఁగాఁ దగున్.

ఇది శ్రీ .................... గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపబడిన
తెనుఁగు గీతయందు దైవాసుర సంపద్విభాగ యోగ మను
పదునారవ యధ్యాయము.

((()))

# తెనుఁగు గీత

## పదునేడవ అధ్యాయము

## శ్రద్ధాత్రయ విభాగ యోగము

అర్జున ఉవాచ :

యే శాస్త్రవిధి ముత్సృజ్య, యజంతే శ్రద్ధయాఽన్వితాః
తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వ మాహో రజ స్తమః

అర్జునుం డనియె.

శాస్త్రవిధిన్ విడి శ్రద్ధన్, బెద్దలన్ విని గొల్చెడి 1
వారి దేశ్రద్ధ; సత్త్వమా, రజస్సా తమసా ప్రభూ!

శ్రీ భగవా నువాచ :

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ, తామసీ చేతి తాం శృణు 2

శ్రీ భగవానుఁ డనియె.

స్వభావంబుగఁ బ్రాణులన్, శ్రద్ధ మూఁడు విధంబులు
సాత్త్వికి, రాజసి మఱి, తామసి వాని విన్మిదే.

సత్త్వానురూపా సర్వస్య, శ్రద్ధా భవతి భారత :
శ్రద్ధామయోఽయం పురుషో, యో యచ్ఛ్రద్ధస్స ఏవసః
మనస్సుం బట్టి శ్రద్ధయా జీవుల్ శ్రద్ధామయుల్ గదా
ఎవ్వఁ డేశ్రద్ధ గలవాఁ, డాతండు నట్టివాఁడెయౌ.

యజంతే సాత్త్వికా దేవాన్, యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే, యజంతే తామసా జనాః. 4
సాత్త్వికుల్ దేవులన్ గొల్తు, రక్షోయక్షుల రాజసుల్
భూత ప్రేతగణంబులన్, యజింత్రు తామసుల్ జనుల్

అశాస్త్ర విహితం ఘోరం తప్యంతే యే తపో జనాః
దంభాహంకార సంయుక్తాః కామరాగ బలాన్వితాః. 5
శాస్త్రవిరుద్ధమౌ ఘోర, తపంబు చేయు చేనరుల్
దంభాహంకారముల్ పొంది, కామరాగాల మింతు .

కర్శయంతశ్శరీరస్థం, భూతగ్రామ మచేతనః
మాం చైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్. 6
వారు దేహస్థభూతాళిన్, లోలోన నున్న యీనను‌న్
కృశింపఁ జేతు రజ్ఞతన్, వార లాసుర నిశ్చయుల్

ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞ స్తప స్తథా దానం, తేషాం భేద మిమం శృణు. 7
జను లందఱ కాహార, యజ్ఞ దాన తపంబులుల్
మూఁడు విధాల నిష్టంబుల్, వాని భేదంబు విన్మదే.

ఆయు స్సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః
రస్యాః స్నిగ్ధా స్థిరాహృద్యాః, ఆహారా స్సాత్త్విక ప్రియాః 8
ఆయు ర్వృద్ధి బలారోగ్య, ప్రీతిదంబౌ, రసాఢ్యమౌ
చమురౌ పుష్టియౌ నింపౌ, నన్నంబుల్ సాత్త్వికంబులు.

కట్వామ్లలవణాత్యుష్ణ, తీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారా రాజస స్యేష్టాః, దుఃఖశోకామయప్రదాః 9

ఉప్పు, గార, మితివేఁడి, పుల్పు వెండువి చేఁదువి.
దప్పిన్ వ్యాధిన్, వ్యథల్ గూర్చు, నన్నంబుల్ రాజసంబులు

వ:- ప్రియతరంబులు=ప్రీతినిచ్చునవి.

యాతయామం గతరసం, పూతిపర్యుషితం చ యత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం, భోజనం తామసప్రియం. 10
చల్లఁబడ్డ రుచిపోవు. దుర్గంధి యైన, రాత్రి దా
ఎంగిలౌ నపవిత్రంబౌ, నన్నంబుల్ తామసంబులు

వ:- వ్యథలు=తాత్కాలిక బాధ, తరువాతఁ గలుగు బాధయు.

అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్య మేవేతి మనః సమాధాయ స సాత్త్వికః. 11
యజింపవలె ననియే మది నెంచి యథావిధిన్
ఫలేచ్ఛ లేక కావించు, యజ్ఞంబు సాత్త్వికం బగున్.

అభిసంధాయ తు ఫలం, దంభార్థమపి చైవ యత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ, తం యజ్ఞం విద్ధి రాజసమ్. 12
ఉద్దేశించి ఫలం బేదొ, యాడంబరముకోసమున్
చేయంబడెడి యజ్ఞంబు, రాజసం బని యెంచుమీ.

విధిహీన మసృష్టాన్నం. మంత్రహీన మదక్షిణమ్
శ్రద్ధావిరహితం యజ్ఞం. తామసం పరిచక్షతే. 13
మంత్ర మేనన్న దానం బేన్ దక్షిణ యేని శ్రద్ధయేన్
లేక, శాస్త్రోక్త మేన్ గాని, యజ్ఞంబు తామసం బగున్

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే. 14

దేవున్ ద్విజున్ గురున్ ప్రాజ్ఞున్, గొల్చుట శుచి సౌమ్యతల్
అహింస బ్రహ్మచర్యంబు, దేహతపస్సు నాఁబడున్.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. 15
బాధ గూర్పని మాటయు, ప్రియహితంబు, సత్యమున్
స్వాధ్యాయపాఠమేనియు, వాక్తప స్సనఁగాఁ బడున్

మనః ప్రసాద స్సౌమ్యత్వం, మౌన మాత్మ వినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేతత్, తపో మానస ముచ్యతే. 16

వివ:- స్వాధ్యాయపాఠము=మోక్షశాస్త్రాధ్యయనము.

మనః ప్రశాంతి సౌమ్యత, మౌన మింద్రియనిగ్రహ
మమాయకత్వ మీయవి, మన స్తపస్సు నాఁబడున్.

శ్రద్ధయాపరయా త ప్తం తప స్తత్త్రివిధం నరైః
అఫలాకాంక్షిభి ర్యుక్తైః. సాత్త్వికం పరిచక్షతే. 17
ఫలేచ్ఛ లేక యత్యంత, శ్రద్ధన్ మూఁడు తపస్సులున్
చేయు నిర్మలచిత్తుల, తపస్సు సాత్త్వికం బగున్.

సత్కారమానపూజార్థం, తపో దంభేన చైవ యత్
క్రియతే త దిహ ప్రోక్తం. రాజసం చల మధ్రువమ్. 18
సత్కారాదులకోసము. నాడంబరము కోసమున్
గాంచు చంచలం బైన, తపస్సు రాజసం బగున్.

మూఢగ్రాహే ణాత్మనో యత్. పీడయా క్రియతేతపః
పర స్యోత్సాదనార్థం వా, తత్తామస ముదాహృతమ్. 19

మూర్ఖపుం బట్టుతోఁ దాను. బాధపొందుచు నన్యులన్
జంపుట కేని గావించు, తపస్సు తామసం బగున్.

దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ 20
ఈయఁదగు నని దేశ. కాలపాత్ర లెఱింగియున్
అనుపకారి కిచ్చెడి, దానంబు సాత్త్వికం బగున్.

యత్తు ప్రత్యుపకారార్థం. ఫల ముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం, తద్దానం రాజసం స్మృతమ్. 21
ప్రత్యుపకార మాశించి, ఫలంబు గోరి యైనను
బాధపడి యొసంగెడి, దానంబు రాజసం బగున్.

అదేశ కాలే యద్దానం అపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం, తత్తామస ముదాహృతమ్. 22
దేశకాలాలు చూడక, నిందించి యవమానమున్
జేసి, యపాత్రుల కిచ్చు. దానంబు తామసం బగున్

ఓం తత్స దితి నిర్దేశో, బ్రహ్మణ స్త్రివిధః స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ, యజ్ఞాశ్చ విహితాః పురా. 23
ఓ మంచు, తత్తుసత్తంచు, బ్రహ్మంబు నండ్రు తద్విదల్
దానన్ వేదాలు బ్రాహ్మణుల్, యజ్ఞంబుల్ పూర్వమేర్పడెన్

తస్మా దోమి త్యుదాహృత్య యజ్ఞదానతపః క్రియాః
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్. 24
కాన, "ఓం" అంచుఁ బల్కుచు, బ్రహ్మవాదుల్ యథావిధిన్
యజ్ఞ దాన తపః కర్మ, లాచరించెద రెప్పుడున్.

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపః క్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః. 25

ఫలంబు గోరకుండనె, తత్తురంచుం బల్కి యెన్నియో
యజ్ఞదాన తపఃకర్మ. లాచరింత్రు ముముక్షువుల్

సద్భావే సాధుభావేచ సదిత్యేతత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా, సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే. 26

మున్ను లేనిది యైనప్డు చెడ్డది మంచి దౌతఱిన్
శుభకర్మంబు లైనప్డు, సత్తని యందు రర్జునా!

యజ్ఞే తపసి దానే చ స్థితి స్సదితి చోచ్యతే
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే. 27

యజ్ఞదాన తపస్సంబు, శ్రద్ధయు సత్తు నాఁబడున్
తత్కర్మ యాశ్వరార్థమున్, గాన సద్ధియు సత్తెయా.

అశ్రద్ధయా హుతం దత్తం, తప స్తప్తం కృతం చ యత్
అస దిత్యుచ్యతే పార్థ! నచతత్ప్రేత్య నో ఇహ. 28

హోమముల్ తపముల్ కర్మల్, దాన మశ్రద్ధఁ జేయుచో
అసత్తని యనంబడు, తేదందు ఫల మిందును.

ఇది శ్రీ ................ గణపతి శాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన
తెనుఁగు గీతయందు శ్రద్ధాత్రయ విభాగ యోగమను
పదునేడవ అధ్యాయము

[] [] []

# తెనుఁగు గీత

## పదునెనిమిదవ అధ్యాయము

### మోక్షయోగము

అర్జున ఉవాచ :

సన్న్యాసస్య మహాబాహో! తత్త్వమిచ్ఛామి వేదితుమ్
త్యాగస్య చ హృషీకేశ!, పృథక్కేశినిషూదన. 1

అర్జునుఁ డనియె.

కృష్ణ! సంన్యాస తత్త్వంబు, తెల్సికొనంగఁ గోరెదన్
అట్టులే త్యాగతత్త్వంబు, తెలియంజెప్పు మచ్యుతా!

శ్రీ భగవా నువాచ :

కామ్యానాం కర్మణాం న్యాసం, సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మ ఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః 2

శ్రీ భగవానుఁ డనియె.

కామ్యకర్మల వీడుట, సంన్యాస మండ్రు పండితుల్
సర్వకర్మఫలత్యాగ మండ్రు త్యాగంబు నేర్పరుల్.

త్యాజ్యం దోషవ దిత్యేకే, కర్మ ప్రాహు ర్మనీషిణః
యజ్ఞదానతపః కర్మ, న త్యాజ్య మితి చాపరే. 3
దుష్టకర్మల్ విడవలె, నం్రదు కొందఱు ధీయుతుల్
యజ్ఞ దాన తపః కర్మల్, వీడరాదందు రన్యులు.

నిశ్చయం శృణు మే తత్ర, త్యాగే భరతసత్తమ!
త్యాగోహి పురుషవ్యాఘ్ర, త్రివిధ స్సంప్రకీర్తితః 4
ఆ త్యాగ విషయంబందు, నా నిశ్చయంబు విన్మిదే
త్యాగంబు త్రివిధంబౌచుఁ, జెప్పంబడియె ఫల్గునా!

యజ్ఞదానతపఃకర్మ, న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ, పావనాని మనీషిణాం. 5
యజ్ఞ దాన తపఃకర్మల్, వీడక చేయఁగాఁ దగున్
యజ్ఞ దాన తపస్సులు, పూతమొనర్చుఁ బ్రాజ్ఞులన్.

ఏతా న్యపి తు కర్మాణి, సంగం త్యక్త్వా ఫలానిచ
కర్తవ్యా నీతి మే పార్థ! నిశ్చితం మత ముత్తమం 6
ఈ కర్మలున్ ఫలములు, నాసక్తి వీడి చేయఁగా
దగిన వంచు శ్రేష్ఠమౌ నానిశ్చితమతం బిదే.

నియతస్య తు సన్న్యాసః, కర్మణో నోపపద్యతే
మోహాత్తస్య పరిత్యాగః, తామసః పరికీర్తితః 7
తప్పక చేయఁదగిన, కర్మల్ వీడఁగ రా దిలన్.
అజ్ఞానంబున వానిని వీడుట తామసంబగున్.

దుఃఖ మిత్యేవ యత్కర్మ, కాయక్లేశ భయా త్త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం, నైవ త్యాగఫలం లభేత్ 8
కష్టమంచుఁ గాయకష్ట, భీతితోఁ గర్మ వీడుచో
రాజసత్యాగమున్ జేసి, పొందఁడు త్యాగలాభమున్.

కార్యమిత్యేవ యత్కర్మ, నియతం కురుతేఽర్జున
సంగం త్యక్త్వాఫలం చైవ, స త్యాగస్సాత్త్వికోమతః 9

చేయుచ్ వలయుననుచున్, దప్పక కర్మ చేయుచున్
ఫలాసక్తుల వీడ నా, త్యాగంబు సాత్త్వికం బగున్.

నద్వేష్ట్యకుశలం కర్మ, కుశలే నానుషజ్జతే
త్యాగీ సత్త్వ సమావిష్టో, మేధావీ ఛిన్నసంశయః. 10
ప్రాజ్ఞుడై సత్త్వయుక్తుండై, సంశయం బుడ్గి త్యాగి తా
ద్వేషింపఁ డశుభకర్మల్, కాంక్షింపఁడు శుభఁబులన్.

న హి దేహభృతా శక్యం, త్యక్తుం కర్మా ణ్య శేషతః
యస్తు కర్మఫలత్యాగీ, స త్యాగీ త్యభిధీయతే. 11
కర్మల్ పూర్తిగ వీడుట, దేహధారి కశక్యము
కర్మఫలంబులన్ వీడు, వాఁడె త్యాగి యనంబడున్.

అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలం
భవ త్యత్యాగినాం ప్రేత్య, న తు సన్న్యాసినాం క్వచిత్. 12
ఇష్టానిష్ట మిశ్రమను, కర్మఫలాలు మూఁడును
అత్యాగుల్ చనిగాంతురు, సంన్యాసుల్ గాంచరెప్పుడున్.

వివ:_ అత్యాగులు=త్యాగులు కానివారు.

పంచై తాని మహాబాహో! కారణాని నిబోధమే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణాం. 13
కర్మాంతమైన సాంఖ్యమం, దెల్లకర్మల సిద్ధికై
హేతులైదు చెప్పఁబడె విన్ము చెప్పెద ఫల్గునా!

అధిష్ఠానం తథాకర్తా, కరణం చ పృథగ్విధం
వివిధాశ్చ పృథక్చేష్టాః, దైవం చైవాత్ర పంచమం. 14

శరీరంబును జీవుండు, వేఱు వేఱింద్రియంబులున్
నానాచేష్టలు దైవంబున్, సిద్ధి కియ్యైదు హేతువుల్.

శరీర వాఙ్మనోభి ర్యత్, కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా, పంచైతే తస్య హేతవః.
అన్యాయమేని న్యాయంబేన్, మనోవాక్కాయ కర్మలన్
నరుం డెయ్యది పూనునో దాని కియ్యైదు హేతువుల్.

తత్రైవం సతి కర్తారం, ఆత్మానం కేవలం తు యః
పశ్య త్యకృతబుద్ధిత్వాత్, న స పశ్యతి దుర్మతిః. 16
ఇయ్యదిట్లుండ నెవ్వండు, కేవలాత్మనె కర్తగాఁ
జూచునో బుద్ధిలేమిచే, నాదుర్బుద్ధి గనం డిలన్.

యస్య నాహంకృతో భావో, బుద్ధి ర్యస్య న లిప్యతే
హత్వాపి స ఇమాన్ లోకాన్, న హంతి న నిబధ్యతే. 17
గర్వంబు వేనికుండదొ, బద్ధంబు గాదొ బుద్ధియున్
వాఁ డీలోకాలు చంపియుఁ జంపఁడు, కాఁడు బద్ధుఁడున్.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా, త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి, త్రివిధః కర్మ సంగ్రహః. 18
జ్ఞానంబు జ్ఞేయమున్ జ్ఞాత, యీమూఁడు కర్మ ప్రేరణల్
కర్మకర్త కరణంబు, లీమూఁడు కర్మపద్ధతుల్.

జ్ఞానం కర్మ చ కర్తా చ, త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసంఖ్యానే, యథావ చ్ఛృణు తా న్యపి. 19
జ్ఞానంబు కర్మ కర్తయు, గుణాలఁ బట్టి మూఁడె యౌ
సాంఖ్య శాస్త్రోక్త మియ్యది, యవ్వియున్ విన్ము చక్కగన్

సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు, తద్జ్ఞానం విద్ధిసాత్త్వికం. 20
వేఱుగానుండు భూతాళిన్, మార్పువేఱును లేనియా
భావమున్ జూచు జ్ఞానంబు, సాత్త్విక మం చెఱుంగుమీ.

పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్
వేత్తి సర్వేషు భూతేషు, తద్జ్ఞానం విద్ధి రాజసం. 21
వేఱుగా సర్వభూతాల, వేఱౌ ననేకభావముల్
చూచెడు నట్టిజ్ఞానంబు రాజస మం దెఱుంగుమీ.

యత్తు కృత్స్నవ దేకస్మిన్, కార్యే సక్తమహైతుకం
అతత్త్వార్థవ దల్పం చ, త త్తామస ముదాహృతం. 22
అంతయు నొక్క కార్యమం, దున్నదౌ, హేతుశూన్యమౌ
స్వల్పమౌ, తత్త్వశూన్యంబౌ దానిన్ దామస మందురు.

వివ:- ఈసమస్తాత్మ జ్ఞానము దేహకార్యమందుఁగాని ప్రతిమాది
కార్యమందుఁగాని మాత్రమే యున్నదనుట చార్వాకా
దులు ఆత్మ దేహమంతే యున్నదని, దేహమేఆత్మయని
అనిత్యమని అల్పమని, యందురు. ఇట్లు అంతయు
తత్త్వ విరుద్ధముగఁదలఁచుట తామసమందురనిభావము.

నియతం సంగరహితం, అరాగ ద్వేషతః కృతం
అఫల ప్రేప్సునా కర్మ' యత్తత్సాత్త్విక ముచ్యతే 23
నిత్యమై సంగశూన్యంబై. రాగద్వేషాలు లేనిదై
ఫలాపేక్షలేక చేయు, కర్మము సాత్త్వికం బగున్

యత్తు కామేప్సునా కర్మ, సాహంకారేణ వాపునః
క్రియతే బహుళాయాసం, త ద్రాజస ముదాహృతమ్ 24

కర్మ ఫలేచ్ఛచేఁ గాని యహంకారముచేత నేస్
చేయు నత్యంతకష్ట మౌ, కర్మంబు రాజసం బగున్.

అనుబంధం క్షయం హింసామ్, అనపేక్ష్యచ పౌరుషమ్
మోహా దారభ్యతే కర్మ, తత్తామస ముదాహృతమ్, 25
రాఁబోవు నష్టమున్ హింసన్, స్వసామర్థ్యము చూడక
అజ్ఞానంబునఁ గావించు, కర్మంబు తామసం బగున్

ముక్తసంగోఽ నహంవాదీ, ధృత్యుత్సాహ సమన్వితః
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. 26
ఇచ్ఛాహంకారముల్ లేక, ధైర్యోత్సాహ యుతుఁడునై
సిద్ధ్యసిద్ధుల మాఱని, కర్తయె సాత్త్వికుం డగున్

రాగీ కర్మఫలప్రేప్సుః లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్షశోకాన్వితః కర్తా, రాజసః పరికీర్తితః 27
రాగంబు కర్మఫలేచ్ఛ. హింస లోభ మశౌచమున్
హర్షమున్ శోకమున్ గల్గు, కర్తయె రాజసుండగున్

అయుక్తః ప్రాకృతః, స్తబ్ధః శఠోనైకృతికోఽలసః
విషాదీ దీర్ఘసూత్రీచ, కర్తా తామస ఉచ్యతే. 28
లోలుఁ డజ్ఞుండు స్తబ్ధుండు, మాయావి దీర్ఘ సూత్రియున్
దుంభి సోమరి భేదకుం, డౌ కర్త తామసుండగున్.

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ, గుణత స్త్రివిధం శృణు
ప్రోచ్యమాన మశేషేణ, పృథ క్త్వేన ధనంజయ 29
బుద్ధియున్ ధృతియుం గూడ, గుణాలబట్టి మూఁడెయౌ
వేర్వేఱ వానిఁ బూర్తిగఁ, జెప్పెద విన్ము ఫల్గునా !

ప్రవృత్తించ నివృత్తించ, కార్యా కార్యే భయాభయే
బంధం మోక్షం చ యావేత్తి బుద్ధిస్సాపార్థ! సాత్త్వికీ 30
ప్రవృత్తి నివృత్తుల్కార్య, మకార్యంబు, భయాభయాల్
బంధ మోక్షంబు లెఱుంగు, బుద్ధి సాత్త్వికి నాఁబడున్.

యయా ధర్మ మధర్మంచ కార్యం చకార్య మేవ చ
అయథావ త్ప్రజానాతి, బుద్ధిస్సా పార్థ ! రాజసీ. 31
ధర్మంబును, నధర్మంబున్, గార్యంబును నకార్యమున్
సరిగాఁ దెల్సికొనని, బుద్ధి రాజసి నాఁబడున్.

అధర్మం ధర్మ మితి యాఽ మన్యతే తమసావృతా
సర్వార్థా న్విపరీతాం శ్చ, బుద్ధిస్సా పార్థ తామసీ. 32
ధర్మమని, యధర్మంబున్, విరుద్ధంబుగ సర్వమున్
అజ్ఞానంబున నెంచెడి, బుద్ధితామసి నాఁబడున్

ధృత్యా యయా ధారయతేమనః ప్రాణేంద్రియ క్రియా
యోగేనా వ్యభిచారిణ్యా ధృతి స్సాపార్థ! సాత్త్వికీ. 33
ఎన్నండుఁ బోని ధృతితో, మనః ప్రాణేంద్రియక్రియల్
అత్యంత శ్రద్ధఁ దాల్చెడి ధృతి సాత్త్వికి నాఁబడున్

యయా తు ధర్మకామార్థాన్, ధృత్యా ధారయతేఽర్జున
ప్రసంగేన ఫలాకాంక్షీ, ధృతి స్సా పార్థ! రాజసీ. 34
ధర్మ మర్థముఁ గామంబు, నాయాప్రవసక్తిఁ బట్టియే
ఫలంబు గోరి ధరించు, ధృతి రాజసి నాఁబడున్

యయాస్వప్నం భయం శోకం, విషాదం మద మేవ చ
న విముంచతి దుర్మేధా, ధృతిస్సా పార్థ! తామసీ. 35

కలయుం భయముం గాని, శోకంబు నేడ్పు గర్వమున్
వీడని, బుద్ధిహీనుని, ధృతి తామసి నాబడున్.

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ !
అభ్యాసా ద్రమసే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛసి. 36
పార్థ ! యింతన్ ద్రివిధమౌ, సుఖంబు విన్ము చెప్పెదన్
దానిన్ నేర్వ సుఖింతువు, దుఃఖాంతమును గాంతువు.

యత్తదగ్రే విష మివ, పరిణామేఽమృతోపమం
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం, ఆత్మబుద్ధి ప్రసాదజం 37
ఏగి ముందట విషమై ఫలింప నమృతంబునై
బుద్ధినైర్మల్యముం గూర్చు, సుఖంబు సాత్త్వికం బగున్.

విషయేంద్రియ సంయోగాత్ యత్తదగ్రేఽమృతోపమం
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతం. 38
విషయేంద్రియ సంపత్తి, నేది ముం దమృతంబయై
ఫలింపంగ విషంబౌ నా సుఖంబు రాజసం బగున్,

యదగ్రే చానుబంధే చ, సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్య ప్రమాదోత్థం, తత్తామస ముదాహృతం. 39
ముందున్ దర్వాత నాత్మను, మోహా పెట్టుచు నిద్రచే
మాంద్యాస భ్రాంతిచేఁ గల్గు, సుఖంబు తామసం బగున్

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం, యదేభిస్స్యా త్త్రిభిర్గుణైః 40
భువిం గాని దివింగానీ, దేవులన్ బ్రకృతిజన్యమౌ
నీమూఁడుగుణముల్ లేని, పదార్థం బుండ దెన్నఁడున్.

బ్రాహ్మణ క్షత్రియ విశాం, శూద్రాణాం చ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని, స్వభావ ప్రభవైర్గుణైః. 41
బ్రాహ్మణక్షత్రియులకున్ వైశ్యశూద్రుల కర్జునా!
స్వస్వభావ గుణంబులఁ. గర్మలు విభజించితిన్.

శమో దమ స్తప శ్శౌచం, క్షాంతి రార్జవ మేవచ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం, బ్రాహ్మం కర్మ స్వభావజమ్. 42
శమంబు ధమమున్ దప, మాస్తిక్య మోర్పు శౌచమున్
జ్ఞాన విజ్ఞాన సౌమ్యతల్, బ్రాహ్మణు నైజకర్మలు.

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం, యుద్ధే చాప్యపలాయనమ్
దాన మీశ్వరభావ శ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ 43
తేజు శౌర్యంబు ధైర్యంబు, పోరున వెన్ను చూపమి
దక్షత దాన మీశత. క్షత్రియు నైజకర్మలు.

కృషి గోరక్ష వాణిజ్యం. వైశ్యం కర్మ స్వభావజమ్
పరిచర్యాత్మకం కర్మ, శూద్రస్యాపి స్వభావజం 44
కృషి వాణిజ్య గోరక్షల్. వైశ్యుని నైజకర్మలు
శుశ్రూషారూపమౌ కర్మ, శూద్రుని నైజకర్మయౌ

స్వే స్వే కర్మ ణ్యభిరతః. సంసిద్ధిం లభతే నరః
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. 45
శ్రద్ధన్ స్వకర్మలన్ జేయు, జనంబు సిద్ధిపొందును
స్వస్వకర్మపరు లెట్లు. సిద్ధి గాంతురో విన్మిదే.

వివ:_ స్వస్వకర్మపరులు=స్వస్వవర్ణాశ్రమ విహితకర్మ పరులని పూర్వులు. స్వస్వభావనియతకర్మ పరు లని నవీనులు.

యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతం
స్వకర్మణా తమభ్యర్చ్య. సిద్ధిం విందతి మానవః 46
భూతంబు లెల్ల సృష్టించి, యందెల్ల నిండి యుండిన
యీశున్ స్వకర్మచేఁ గొల్చి, మర్త్యుండు సిద్ధి పొందును.

శ్రేయాన్ స్వధర్మో విగుణః. పరధర్మా త్స్వనుష్ఠితాత్.
స్వభావనియతం కర్మ, కుర్వ న్నాప్నోతి కిల్బిషం. 47
సరిగాఁ జేయఁబడిన, పరధర్మంబు కంటెను
విగుణంబుగఁ దోఁచియు. స్వధర్మ మదె శ్రేష్ఠము (క)
తన స్వభావమునకున్, నియతంబైన కర్మను
ఆచరించెడి జీవుండు, పాపంబు పొందఁ డెప్పుడున్ (ఖ)

సహజం కర్మ కౌంతేయ, సదోషమపి న త్యజేత్
సర్వారమ్భా హి దోషేణ, ధూమే నాగ్ని రివావృతాః. 48
సహజంబైనకర్మలు, దుష్టంబు లయ్యు వీడరా
దగ్నిన్ బొగ క్రమ్మినట్లు, దోషంబుల్ నిండె నెల్లెడన్

అసక్తబుద్ధి స్సర్వత్ర, జితాత్మా విగతస్పృహః
నైష్కర్మసిద్ధిం పరమాం, సన్న్యాసే నాధిగచ్ఛతి 49
ఎల్లెడన్ గోర్కె వర్జించి, వశియై వీతరాగుఁడై
సంన్యాసంబున శ్రేష్ఠమౌ, నైష్కర్మ్య సిద్ధి పొందును.

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ, తదాప్నోతి నిబోధ మే
సమాసేనైవ కౌంతేయ, నిష్ఠా జ్ఞానస్య యాపరా. 50
జ్ఞానంబు నిష్ఠయౌ సిద్ధిన్, బొంది బ్రహ్మంబు గాంచెడి
రీతిక్లుప్తముగాఁ బార్థ!, వచియింతు నెఱుంగుమీ.

బుద్ధ్యా విశుద్ధయాయుక్తో, ధృత్యాత్మానం నియమ్య చ
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా, రాగద్వేషౌ వ్యుదస్య చ 51
నిర్మలబుద్ధితోఁ గూడి, ధృతితో మేను గెల్చియున్
శబ్దాదిభోగముల్ వీడి, రాగద్వేషము లంబక.

వివిక్త సేవీ లఘ్వాశీ యత వాక్కాయ మానసః
ధ్యానయోగపరో నిత్యం, వైరాగ్యం సముపాశ్రితః. 52
మనోవాక్కాయముల్ నిల్పి, యొంటిమై మితభోజియై
ధ్యానయోగములం దెప్డు, డుండి వైరాగ్యయుక్తుఁడై.

అహంకారం బలం దర్పం, కామం క్రోధం పరిగ్రహం
విముచ్య నిర్మమ శ్శాంతో. బ్రహ్మభూయాయ కల్పతే. 53
శక్తి గర్వ మహంకార, మిచ్ఛ యల్క తనూభ్రమన్
మమతన్ వీడ శాంతుఁడై, బ్రహ్మ మొందు సమర్థుడౌ.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా, న శోచతి న కాంక్షతి
సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. 54
బ్రహ్మంబయి ప్రసన్నుండై, విచారింపఁడు కోరఁడు
సర్వభూతాలఁ దుల్యుండై. మేలౌ నాభక్తి నొందును.

భక్త్యా మా మభిజానాతి యావాన్య శ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరం 55
ఎంతవాఁడ, నెవండనో, నన్ భక్తి సరిగాఁ గనున్
పైని నన్ సరిగాఁ గాంచి, తర్వాత నన్నె చొచ్చును.

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి. శాశ్వతం పద మవ్యయం. 56

ఎన్నండుఁ గర్మ లన్నియుఁ, జేసి నన్నాశ్రయించియున్
నాయనుగ్రహముచేతన్, బొందున్ శాశ్వతమౌగతిన్

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య, మచ్చిత్త స్సతతం భవ. 57
మదిచే సర్వకర్మల్ నా, కర్పించి మత్పరుండవై
బుద్ధియోగ మాశ్రయించి, నన్నెప్పుడు నెంచుమీ.

మచ్చిత్తస్సర్వ దుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అథచేత్త్వ మహంకారాత్ నశ్రోష్యసి వినంక్ష్యసి. 58
నన్నెంచ దాటరానివి, యెల్లన్ దాటెదు నా కృపన్
మది నీవా యహంకృతి, వీడవేని నశింతువు.

య ద్యహంకార మాశ్రిత్య, న యోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి. 59
అహంకారముతో నీవు, "పోర"నని తలంచిన
ఈ నిశ్చయంబు వ్యర్థంబు, శాసించు నైజమే నినున్.

స్వభావజేన కౌంతేయ నిబద్ధ స్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి య న్మోహాత్ కరిష్య స్యవశోఽపి తత్. 60
నైజమౌ నీదుకర్మచే, బద్ధుండవయి మూర్ఖతన్
జేయ నెంచని దానినే, చేతువు విధి లేకయే.

ఈశ్వర స్సర్వభూతానాం, హృద్దేశేఽర్జున! తిష్ఠతి
భ్రామయ స్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా.
యంత్రమం దున్నవానిని, బోలె భూతంబు లన్నిటిన్
మాయం ద్రిప్పుచు నీశుండు, భూతాళి హృది నిల్చెను.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్
అన్నివిధాల నీతనే, శరణఁ జొచ్చు మర్జునా!
తత్కృప నుత్తమ శాంతిన్, శాశ్వత స్థాన మొందెదు.

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు. 63
నీ కిట్లతి రహస్యంబౌ జ్ఞానంబు చెప్పఁగాఁ బడెన్
దీనిని బూర్తిగఁ జర్చించి, చేయు నీకిష్టమౌ నటుల్

సర్వ గుహ్యతమం భూయః శృణు మే పరమం వచః
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్. 64
అన్నిటన్ గడు గూఢంబౌ నా శ్రేష్ఠవాక్కు క్రమ్మఱన్
విను మెంతయు నిష్టుండ, వని నీ మేలు చెప్పెదన్.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. 65
నన్నె పొకడెదు సత్యంబు, నాతోడు సూ ప్రియుండవు.
నన్భావింపు నన్నెగొల్వు, నన్వేల్పు నన్నె మ్రొక్కుమి

సర్వధర్మా న్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః 66
ధర్మంబులెల్ల వర్జించి, నన్నొండె శరణొండుమీ
సర్వపాపాలనుండి నిన్ విడిపింతు, వగన్ విడు.

వివ:- ధర్మంబులు = వర్ణాశ్రమాది సర్వధర్మములు.

ఇదంతే నాతపస్కాయ నాభక్తాయ కదాచన
నచాఽశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి.

తపమున్ భక్తి సేవయు, నేమీ చేయని వానికిన్
నన్ను నిందించు వానికిఁ, జెప్పరాదిది యెన్నఁడున్.

య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభి ధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్య త్యసంశయః

ఈ పరమ రహస్యంబు, నా భక్తులకుఁ జెప్పువాఁ
డెంతయో భక్తి నాయందు, నిల్పి తప్పక నన్గనున్.

న చ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః
భవితా న చ మే తస్మాత్ అన్యః ప్రియతరో భువి. 69

వానికంటెను నాకిష్ట, తముండు లేఁడు మర్త్యులన్
వానికంటెను నాకిష్ట, తముఁడు పుట్టఁబో డిలన్.

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః
జ్ఞాన యజ్ఞేన తేనాహం ఇష్ట స్స్యామితి మే మతిః. 70

ఎవ్వఁ డీ ధర్మయుక్తంబౌ, సంవాదము పఠించునో
ఆ జ్ఞానయజ్ఞునకు నే, నిష్టుడనని యెంచెదన్.

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపి యో నరః
సోపిముక్త శ్శుభాన్లోకాన్ ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్.

అసూయ లేక శ్రద్ధతో, దీనిని విన్న మర్త్యుఁడు
ముక్తుండై పుణ్యకర్ముల, శుభలోకంబులన్ గనున్.

కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా
కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రణష్ట స్తే ధనంజయ! 72

ఏకాగ్రబుద్ధితోఁ బార్థ! విన్నావుగద! దీనిని
అజ్ఞానంబునఁ బుట్టిన, వ్యామోహము నశించెనా.

అర్జున ఉవాచ :

నష్టో మోహః స్మృతిర్లబ్ధా. త్వత్ప్రసాదా న్మయాచ్యుత!
స్థితోస్మి గతసన్దేహః. కరిష్యే వచనం తవ. 73

అర్జునుఁ డనియె.

మోహంబు పోయె స్మృతియున్, వచ్చె నీదయ నచ్యుతా!
ఎల్ల సందేహముల్ పోయె, నీచెప్పినట్లు చేసెదన్.

సంజయ ఉవాచ :

ఇ త్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః
సంవాద మిమ మశ్రౌషం అద్భుతం రోమహర్షణమ్ 74

సంజయుఁ డనియె.

ఇట్లు మహాత్ముఁడౌపార్థుఁ, డా శ్రీకృష్ణుఁడు చేసిన
గగుర్పా టిడు సద్భుత, సంవాద మాలకించితిన్

వ్యాసప్రసాదా చ్ఛ్రుతవాన్ ఏత ద్గుహ్యతమం వరమ్
యోగంయోగేశ్వరాత్కృష్ణాత్ సాక్షాత్కథయతస్స్వయమ్. 75

యోగేశ్వరుండు కృష్ణుండు, సాక్షాత్తు చెప్పు చుండగా
వ్యాసుని దయవింటి నీ, నిగూఢమైన యోగమున్.

రాజన్! సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతం
కేశవార్జునయోఃపుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః. 76

ఈ కృష్ణార్జున సంవాద, మద్భుతంబు పవిత్రమున్
దీనిన్ భావించి, భావించి పొంగిపోదున్ మఱిన్ మఱిన్

తచ్చ సంస్మృత్య. రూప మత్యద్భుతం హరేః
విస్మయో మే మహాన్ రాజన్! హృష్యామి చ పునః 77
ఆకృష్ణు నద్భుతాకృతిఁ, దలంచియుఁ దలంచియు
ఓరాజ! విస్మయం బగు, పొంగిపోదున్ మఱిన్ మఱిన్

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతిః. ధ్రువా నీతి ర్మతిర్మమ. 78
యోగియౌ కృష్ణు డెందుండు ధన్వి పార్థుఁడు
అందే సిరియు సంపదల్, నీతి గెల్పు ధ్రువంబులు.

ఇది

శ్రీమద్వేద వ్యాసమహర్షి రచిత భగవద్గీతలందు, నుపనిషత్తు
లందు బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రమందు, జనక
గురువర చర్ల నారాయణశాస్త్రి కరుణాలబ్ధ విద్యుఁ
డును వెంకమాంబా పుత్రుఁడునగు గణపతి
శాస్త్రిచేఁ దెనిఁగింపబడిన తెనుఁగుగీత
యందు మోక్షయోగము
పదునెనిమిదవ అధ్యాయము
సమాప్తము.

....*....